


# విశ్వకథా విపంచి

(ప్రపంచ ప్రఖ్యాత ఆంగ్లకథలు)


తెలుగు స్వేచ్ఛానువాదం

శ్రీ ఎం.వి. నారాయణాచార్య,ఎం.ఎ.

(రిటైర్డు ఇంగ్లీషు లెక్చరర్)









రోహిణి పబ్లికేషన్స్

మెయిన్‌రోడ్, రాజమండ్రి-1





# విశ్వకథా విపంచి






స్వేచ్ఛానుసరణ :

యం. వి. నారాయణాచార్య





రోహిణి పబ్లికేషన్స్
మెయిన్‌రోడ్, రాజమండ్రి-1

విశ్వకథా విపంచి,

— యం. ఏ. నారాయణాచార్య, యం. ఏ.



ప్రథమ ముద్రణ :
నవంబర్ - 1998

వెల : రూ. 35/-

ముద్రణ :
వంశీకృష్ణ ప్రింటర్స్
విజయవాడ-2

ప్రకాశకులు :

ఫోన్ : 73444

రోహిణి పబ్లికేషన్స్
మెయిన్ రోడ్
రాజమండ్రి – 1.

# విషయ సూచిక

9. ఇది మరీ అన్యాయం ! ! !

— సోమర్సెట్ మాం (ఇంగ్లాండు)

10. మాతృత్వం ? ! !

— లిలికా నకోస (గ్రీస్)

11. అయ్యో ! పాపం పసివాడు

— హెచ్. హెచ్. మన్రో (సాకి) (గ్రేట్ బ్రిటన్)

12. నేను నేనే నన్నానా ?

— సి.జి.యం. స్క్వాజ్ (యు. కె )

13. మేక్ డోవెల్ కథ

— మోర్లీ క్యాలహన్ (కెనడా)

14. పిల్లి మంత్రాలు

— లాఫ్కాడియో హెర్న్ (జపాన్ కథ)

15. తప్పించుకు తిరుగువారు ధన్యులు సుమతీ !

— పాట్రిక్ వ్యాడింగ్టన్ (కెనడా)

16. ప్రాణం ఖరీదా ? కోడిపెట్ట ఖరీదా ?

— మేరీ లేవిన్ (ఐర్లండ్)

17. మా నిషాద ప్రతిష్ఠాతమ్

— గే-డి-మొపాసా (ఫ్రాన్స్)

—:o:—

# 1. దేవుడు నిజాన్ని చూస్తాడు - కాని తొందరపడడు

## (GOD SEES THE TRUTH – BUT WAITS)

—లియో టాల్‌స్టాయ్.

(టాల్‌స్టాయ్ ప్రపంచ ప్రఖ్యాతుడైన రష్యన్ రచయిత. మహాత్మా గాంధీని సైతం ఎంతో ప్రభావితం చేశాయి అతని కథానికలు—అందు చేతనే ఆయన దక్షిణాఫ్రికాలో భారతీయుల చిన్నారుల కోసం నడిపిన పాఠశాలకి "టాల్‌స్టాయ్ ఫారం" అని పేరు పెట్టుకుని దానిని ఆదర్శ విద్యాలయంగా నడిపించారు. మనం పోతన్నగారి "సిరికింజెప్పడు...." అన్న గజేంద్రమోక్షపు పద్యాన్ని వినగానే—భక్తుల్ని రక్షించడంలో భగవంతుడికి ఎంత ఆత్రుతో అనుకుంటామేతప్ప—గజేంద్రుణ్ణి ఆదుకో డానికి "పరమాత్మ" ఆయనని ఎన్ని కఠిన పరీక్షలకి గురిచేశాడో విస్మ రిస్తాం. భగవంతుడు దేన్ని ఎందుకు ఎప్పుడు ఎలా చేస్తాడో ఊహిం చడం—దాని మీద మనం నిర్ణయాలకి రావడం....మన తరంకాదు— భగవంతుడు చేసే దానిని తలవంచుకుని ఔదల దాల్చడమే—భగవంతుణ్ణి విశ్వసించే మన విధి....అని ఈ చిన్ని కథ సారాంశంగా తోస్తుంది....)

వ్లాడిమిర్ పట్టణంలో "ఇవాన్ డెమిట్రిచ్ అక్సియోనోవ్" అనే ఒక యువ వర్తకుడు ఉండేవాడు. అతడు రెండు దుకాణాల్ని నడిపేవాడు— అతనికి ఓ స్వంత భవనం కూడా వుంది. అందంగా, ఆకర్షణీయంగా, ఉత్సాహం పొంగిపొర్లుతూ వచ్చినట్టుండేవాడు—సున్నితమైన హాస్యం, శృతి పక్వమైన గొంతుతో పాటలు పాడడం అతని సహజాలంకారాలు. అయితే యవ్వన ప్రాదుర్భావంలోనే మధ్యపానానికి బానిస అయ్యాడు—ఎక్కువగా పుచ్చుకున్నప్పుడు అతని వ్యవహారమూ దురుసుగా వుండేది. అయితే ఓ చక్కని చుక్క అతని జీవిత భాగస్వామి అయిన తర్వాత అప్పు డప్పుడు తప్పితే పుచ్చుకోవడం పూర్తిగా కట్టిపెట్టేసినట్టే లెక్క.

కొన్ని రోజులు గడిచాయి....ఆ వేసవిలో "ఆక్సియోనోవ్" నిజ్‌నీ అనే గ్రామంలో జరిగే ఒక పెద్ద సంతకి బేరాల కోసం బయల్దేరబోతోంటే భార్య "నా మాట విను, నాకేవో పీడకలలు వచ్చాయి—ఈ రోజు బయలు దేరద్దు" అంటూ బతిమాలింది....

ఆక్సియోనోవ్ పకపకా నవ్వి "నన్ను ఒంటరిగా వదిలేస్తే....మళ్ళీ తాగి కథని మొదటికి తెస్తానని కదా....నీ భయం" అన్నాడు.

"నేనెందుకు భయపడుతున్నానో నాకు ఇదమిద్ధంగా తెలీదు—నాకు తెలిసిందల్లా నా పీడకలల గురించి మాత్రమే....నువ్వు తిరిగి వచ్చి టోపీ తీశావట....నీ తల ముగ్గుబుట్టలా నెరసిపోయివుందట....ఇదీ నా కొచ్చిన కల....

మళ్ళీ పకపకా నవ్వడమే ఆక్సియోనోవ్ వంతయింది.

"ఓసి పిచ్చిదానా....అది పీడకల కాదే....మనకి అదృష్టం కలిసి వస్తోందనడానికి గుర్తు....చూడు మన సరుకంతా సంతలో వేడి వేడి పెస రట్లలా అమ్ముడైపోయి—లాభాలు గడించి—నీకెలాంటి బహుమానాలు తీసుకువస్తానో!" అని భార్యకి టాటాచెప్పి బండి తోలుకుంటూ వెళ్ళి పోయాడు....

సగం దూరము ప్రయాణము చేశాక, దారిలో అతనికి పరిచయస్తుడైన మరో వర్తకుడు కలిశాడు. ఇద్దరూ కలిసి ఒకే బసలో గదులు అద్దెకి తీసుకున్నారు. ఇద్దరూ కలిసి టీ త్రాగి, సరదాగా కబుర్లాడుకుని.... ఎవరి గదుల్లోకి వారు వెళ్ళి నిద్రపోయారు....అయితే ఆక్సియోనోవ్‌కి ఎక్కువసేపు నిద్రపోతూ అలవాటులేదు. చల్లబాటున ప్రయాణం ప్రారంభిస్తే ఎండెక్కేటప్పటికి విశ్రాంతి తీసుకోడానికి వీలవుతుందనే ఉద్దేశ్యంతో బండివాణ్ణి సూర్యోదయానికి బాగా ముందె లేపి బండిని సిద్ధం చెయ్య మన్నాడు.

బస యజమానిని లేపి అతనికి చెల్లించవలసిన బిల్లు చెల్లించి తన మానాన తన ప్రయాణాన్ని కొనసాగించాడు. ఓ ఇరవై ముప్పై మైళ్ల

ప్రయాణించి—తన గుర్రాలకి మేత వెయ్యడానికి దారిలోని మరో బస దగ్గర మజిలీచేసి ఈలోగా తనూ విశ్రాంతి తీసుకుంటున్నాడు.

తనకి తాగడానికి ఓ డ్రింక్ ఆర్డరిచ్చి గిటార్ వాయించుకోవడం ప్రారంభించేడు.

హటాత్తుగా మూడు గుర్రాలు కట్టిన ఓ గుర్రపు బండి ఆగి—దాట్లోంచి కొంత మంది సోల్జర్లు ఓ అధికారి దిగేరు. ఆ అధికారి నేరుగా ఆక్సియోనోవ్ దగ్గరకే వచ్చి "నువ్వెవరివి?....ఎక్కణ్నించి వస్తున్నావు? ఎక్కడికి వెళుతున్నావు? ఎప్పుడు ఇక్కడికి వచ్చావు" లాటి ప్రశ్నలతో ఉక్కిరిబిక్కిరి చెయ్యడం ప్రారంభించేడు. వాటన్నిటికీ ఆక్సియోనోవ్ ఓపిగ్గా సమాధానాలు చెప్పి "దయచేసి కూర్చోండి....మనం కలిసి తీరుబడిగా టీ తాగుతూ మాట్లాడుకుందాం" అన్నాడు....ఆ అధికారి స్వరం కొంచెం కఠినంగా మారింది....

"నిన్నరాత్రి నీవెక్కడ విశ్రాంతి తీసుకున్నావు?....నువ్వొక్కడివే ఆ బసలో వున్నావా? మరో వర్తకుడు కూడా వున్నాడా? మరి అతనితో చెప్పకుండా అంత వేకువనే బయలుదేరి రావడంలో నీ ఆంతర్యం ఏమిటి?" అంటూ ప్రశ్నమీద ప్రశ్న వేయసాగేడు.

ఆక్సియోనోవ్ దిగ్భ్రాంతి చెందినా—అన్ని ప్రశ్నలకూ వివరంగా జవాబులు చెప్పేడు. "నన్నెందుకీ ప్రశ్నలు వేస్తున్నారో నాకర్థం కావడము లేదు...." నేను దొంగననుకున్నారా....హంతకుణ్ననుకున్నారా?" ఏమిటీ ప్రశ్నలు? అర్థం లేకుండా...." అన్నాడు.

"నేను ఈ జిల్లా పోలీసు అధికారిని-నువ్వు రాత్రి బస చేసిన మకాంలో నీతోపాటు దిగి, నీతో గడిపిన వ్యాపారి తల ఉత్తరించబడి మంచంమీద మరణించి వున్నాడు. మేం నీ వస్తువుల్ని సోదా చెయ్యాల్సి వుంది" అన్నాడు.

అతని సంచీని విప్పి వెతుకుతోంటే రక్తసిక్తమయిన కత్తి ఒకటి బైట పడింది.

"ఏమిటిది?" అని గర్జించాడు పోలీస్ ఆఫీసర్....

"అక్స్యెనోవ్ నోటమాట రాలేదు....ఎలాగో ప్రయత్నపూర్వకంగా "నా....కు....ఇ....ది....మి....టో.... అ....ర్థం....కా....వ....టం....లే....దు" అని మాత్రం అనగలిగేడు.

"ఈ రోజు ఉదయమే అతని తల తెగి మరణించి వుండడం గమనించబడింది....

నువ్వు మాత్రమే నిన్న అతనితో వున్నట్టు సాక్ష్యాలు వున్నాయి. పైగా అతనాడు నిద్రపోయిన గది లోపలినుంచి తాళం వేసివుంది. ఇంకెవ్వరూ లోపలికి వెళ్ళే అవకాశం లేదు. పైగా....ఈ రక్తసిక్తమయిన కత్తి నీ సంచిలో దొరికింది.

ఇంక నువ్వు దబాయించి లాభంలేదు- ఎంత అమాయకంగా ముఖాన్ని పెట్టినా నమ్మేవారెవరూ లేరు. ఎలా చంపేవు? ఎంత మొత్తం కాజేశావు? ఈ రెండు ప్రశ్నలకే నువ్వు జవాబు చెప్పాల్సి వుంటుంది" అన్నాడు.

నాకేం తెలియదు. నా దారిన నేను వచ్చేశాను....మేం యాదృచ్ఛికంగా కలిశామే తప్ప....మాకేమీ సంబంధం లేదు....నేను ఇంటి దగ్గర నుంచి తెచ్చుకున్న ఎనిమిది వేల "రూబుళ్ళు" (రష్యన్ నాణేలు) తప్ప నా దగ్గర పరాయివారి సొమ్ము ఒక్క పైసా లేదు. దైవసాక్షిగా నన్ను నమ్మండి....అని పరి పరి విధాల చెప్పేడు. కాని ఎవరు నమ్ముతారు? అతనికి కూడా కంగారు తొట్రుపాటూ కలిగేయి. ముచ్చెమటలూ పోశాయి. నోరు తడారిపోయింది.

పోలీసులు అక్స్యెనోవ్ కాళ్ళూ చేతులూ తాళ్ళతో బలంగా కట్టి వేసి ఓ జంతువుని విసిరేసినట్టు ఒక బండిలోకి విసిరేశారు. హృదయ విదారకంగా ఏడిచాడు. మొత్తుకున్నాడు. అతని డబ్బు వస్తువులూ ప్రభుత్వం స్వాధీనం చేసేసుకుంది. అతని గ్రామానికి వాకబు చేసి అతని ప్రవర్తనని గురించి దర్యాప్తు చేస్తే, అతను గతంలో విచ్చలవిడిగా తాగి తందనాలాడేవాడని, తరచు కొట్లాటలకి దిగేవాడని చెప్పేరు. అయితే మనిషి స్వత

హాగా 'మంచివాడే'నన్న వాళ్ళూ లేకపోలేదు. శాస్త్రోక్తంగా కోర్టు, కేసు, వాగ ప్రతివాదాలు జరిగేయి. "రయజాన్" పట్టణానికి చెందిన వర్తకుణ్ణి చంపి ఇరవై వేల రూబుళ్ళు దొంగిలించాడనే వాదనకే బలం చేకూరింది-

ఇది తెలిసిన భార్య రష్యా చక్రవర్తి "జార్"కి ఒక అర్జీ పంపుకుంది.

జార్ చక్రవర్తికూడా-అక్సియెనోవ్ ఈ నేరం చేశాడనే బలంగా నమ్మడం వల్ల ఆ అర్జీని తిరస్కరించాడు భర్తని కలుసుకుని ఇదేసంగతిని చెప్పింది.

"నాకు ఇటువంటి "కల" వచ్చింది—అని చెపితే పెడచెవిని పెట్టేవు —ఏమి జరిగిందో చూశావా?" అని మొత్తుకుంది....ఎంత మొత్తుకుంటే ఇప్పుడేం లాభం?

"అయినా డియర్....నేనడుగుతున్నాను....నువ్వీ పని చేశావాలేదా? నాకైనా నిజం చెప్పవా?"

అక్సియోనోవ్‌కి మిన్ను విరిగి మీద పడినట్టయింది.

తన భార్యే తన నిజాయితీని శంకించినప్పుడు....ఇక తనేం మాట్లాడినా ఏమీ ప్రయోజనం వుండదని....రెండు అరచేతులు వెనుక ముఖం దాచుకుని భోరుమని ఏడ్చేశాడు. ఇక "టైమయింది" నడవండంటూ కాపలాదారు భార్యనీ, ముక్కుపచ్చలారని పిల్లల్ని ఆక్కణ్నించి పంపించేశాడు.

భార్య వెళ్ళిపోయిన తరువాత జరిగిన విషయాల్ని ఒకసారి మననం చేసుకున్నాడు అక్సియోనోవ్.

భార్యతో సహా ఈ భూ ప్రపంచంలో నా నిజాయితీని నమ్మటం లేదు. నేను నమ్మించనూలేను. అయితే నిజం తెలిసినవాడు ఆ సర్వాంతర్యామి ఒక్కడే. ఆయనే స్వయంగా దిగి వచ్చినా ఎవ్వరూ నమ్మరు. ఆయనా నన్ను రక్షించలేరు. అయితే ఆయన దయాదాక్షిణ్యాలను నాపై వర్షించమని మాత్రమే నేను ఆయనను ప్రార్థించగలను. దైవప్రార్థన

తప్ప నేను ఇక ఈ విషయమై పెదవి విప్పను. ఆయన ఏం నిర్ణయిస్తే దానిని శిరసా వహిస్తాను. సహిస్తాను.

"నేను....నాది....నా కోసం....నావాళ్ళు" అనే భావం వుంటేకదా బాధపడేది....వాటినించి విముక్తుణ్నవుతాను అని నిర్ణయం చేసుకున్నాడు.

అక్సియోనోవ్‌ను కొరడాదెబ్బలతో హింసించి ఆ గాయాలనించి కోలుకున్నాక సైబీరియాకి పంపి అక్కడ గనుల్లో ఇతర ఖైదీలతోపాటు శ్రమ్వకపు పనిలోకి పంపించివేయాలని తీర్మానించారు—అదే జరిగింది కూడా ..............................................................

..............................................................................

హాస్యాభరితంగా మాట్లాడుతూ, తుళ్ళుతూ, చలాకీగా కదుల్తూ మెరిసే కళ్ళతో చూపరులను ఆకట్టుకునే స్ఫూరద్రూపి అక్సియెనోవ్ చచ్చిపోయి ఇరవై య్యేళ్ళయింది. ఇప్పుడతని జుట్టు ముగ్గుబుట్టలా తయారయింది....ఓ పెద్ద గడ్డం గుండెలదాకా పరచుకుంది, నడుం వంగి పోయింది. నడవలేక నడుస్తున్నాడు, తక్కువగా మాట్లాడుతున్నాడు, నవ్వనేది ఎలా వుంటుందో దాదాపు మరచిపోయాడు. అయితే మూడొం తుల కాలం-దైవప్రార్థనలోనే గడుపుతున్నాడు.

జైల్లో బూట్లు కుట్టడం నేర్చుకున్నాడు. తద్వారా సంపాదించిన డబ్బుతో "మహాత్ముల చరిత్ర" అనే పుస్తకాన్ని కొనుక్కున్నాడు. కవి పించేంత కాంతి జైలు గదిలోకి ప్రసరించేటంత సేపూ ఆ పుస్తకాన్నే చదువుకుంటూ కూర్చునేవాడు, ఆదివారాల్లో చర్చి ప్రార్థనల్లోమాత్రం బోధకుల మాటల్ని శ్రద్ధగా వింటూ— అతని కంఠం ఇంకా శ్రావ్యతని కోల్పోని కారణంగా - గొంతెత్తి ప్రార్థనా గీతాల్ని మాత్రం మధురంగా పాడుతూ వుండేవాడు.

కుహనా విలువలతో బ్రతికే బయట ప్రపంచంలో మనబోంట్లం మంచి తనాన్ని - సాధుశీలత్వాన్నీ గుర్తించం కాని, జైలు గోడల మధ్య విజాయితీ, మంచితనం, మంచితనానికి కనీసపు గుర్తింపు ఇంకా బ్రతికే ఉన్నాయనిపిస్తుంది. అందుకే అక్సియోనోవ్ సాధుశీలిగా, మంచివాడుగా

"తాతాజీ"గా జైలు వార్డర్లచేత తోటి ఖైదీల చేత గుర్తింపబడి గౌరవింప బడేవాడు. వారి వారి కష్టాల్ని జైలు అధికార్లకు విన్నవించుకోవాలంటే ఈ "తాతాజీ" ద్వారానే విన్నవించుకునేవారు. వారిలో వారికి తగాదాలు వచ్చినా తాతాజీనే సర్దుబాటు చేయమని అర్థించేవారు. ఆయన నిర్ణయానికి కట్టుబడి వుండేవారు.

తన భార్యా, పిల్లలూ ఏమయ్యారో - ఎలా ఉన్నారో కూడా కనీ సం అతనికి తెలిసే అవకాశాలు లేవు.

ఇలా ఉండగా .... ఒకరోజున కొత్తగా కొంతమంది కొత్త ఖైదీల గుంపు ఒకటి ఈ జైలుకి తరలించబడింది. పాత ఖైదీలు కొత్త ఖైదీల చూట్టూ చేరి పరస్పర పరిచయాలు చేసుకోవడం ప్రారంభించారు. ఎక్కడ్నుంచి వచ్చారో.... ఏయే నేరాలకి ఎవరెవరికీ, ఎంతెంత కాలం శిక్ష పడిందో.... ఈ వివరాలు అడగడం ప్రారంభించారు. ఇవేవీ పట్టించుకో కుండా అక్స్నియోనోవ్ తలదించుకుని కూర్చున్నాడు. అయితే మాటలు చెవిలో పడకమానవుకదా ....!!

వాళ్ళలో ఒక అరవై ఏళ్ళ వరకూ వయస్సున్న ఒక దృఢకాయు డైన ఒక ఖైదీ వున్నాడు....

"చూడండి మిత్రులారా.... నన్ను అన్యాయంగా.... ఓ గుర్రాన్ని దొంగిలించానని అరెస్టు చేశారు.... నిజానికి నేను చేసింది దొంగతనం ఏమీ కాదు.... నాకు చాలా అర్జంటు పనొకటి పడింది - దాంతో గుర్రం మీద అయితే చెక చెకా వెళ్ళి ఆ పని చూసుకుని వచ్చి -తిరిగి ఆ గుర్రాన్ని (అది నిజానికి నా స్నేహితుడి గుర్రమే- ఎటొచ్చి తీసికెళ్తు న్నాన్రా అని చెప్పలేదు అంతే)గుర్రపు శాలలో కట్టేద్దామని అనుకున్నాను ఇదీ సంగతి అని చెప్పాను-కాదు నువ్వు చేసింది దొంగతనమే అన్నారు. అయితే నేను దాన్ని ఎక్కడ ఎలా దొంగిలించానో చెప్పలేకపోయారు. అయినా వాళ్ళకా విషయం, అనవసరమట!—నిజంగా నేను మర్డరే చేసి

నప్పుడు నన్ను వాళ్ళు అనుమానించడంకూడా అనుమానించలేదు. ఇదీ ఈ న్యాయ వ్యవస్థ సరళి" అన్నాడు చాలా నిర్లక్ష్యంగా.

"అయితే మీదేవూరన్నావ్?"

"అబ్బాయిలూ ఇన్ని ప్రశ్నలు అవసరంలేదు-మాది వ్లాడిమీర్ నా పేరు "మకర్", నన్ను "సిమ్యోనిచ్" అనికూడా పిలుస్తారు."

ఇది విన్న అక్సియోనోవ్‌కి ఉత్కంఠ కలిగింది. సిమ్యోనిచ్‌ని "వ్లాడిమీర్‌లో అక్సియోనోవ్‌లనే వ్యాపారులు కుటుంబం వుండాలి.... వాళ్ళని గురించి నీకేమైనా తెలుసా?" అని అడిగేడు.

"తెలియకపోవడం ఏమిటి! అక్సియోనోవ్‌లది ఒక భాగ్యవంతుల కుటుంబం. అయితే వాళ్ళ నాన్న సైబీరియాలో వున్నాడంటారు. మనలాగే ఏదో ఒకపాపం చేసి ఖైదు చేయబడినట్టున్నాడు. అది సరే "తాతాజీ" మీరు చూస్తే పాదుపుంగవుల్లా కనిపిస్తున్నారు. మీరిక్కడి కెలా వచ్చారండి బాబూ?" అన్నాడు తేలిగ్గా నవ్వేస్తూ.

అక్సియానోవ్ అతనికేమీ జవాబివ్వలేదు...కాని తనలోతాను గొణుక్కున్నట్టు...." నాదీ ఏదో పురాకృతమే....ఇరవైయ్యేరు సంవత్సరాలుగా కట్టికుడుపుతోంది" అన్నాడు.

"మీరు పాపం చెయ్యడమా?" అన్నాడు మకార్ ఆశ్చర్యంగా.

హాఁ....హాఁ....నేను ఇందుకే పుట్టానేమో బహుశః...."

ఇంతకిమించి అక్సియానోవ్ మరేమీ చెప్పదల్చుకోలేదు. అయితే పాత ఖైదీలు కొత్తగా వచ్చినవారికి అక్సియోనోవ్ దీనగాధని వివరించారు. దానితోపాటు ఎవరో ఎవరినో హత్యచేసి ఆ కత్తిని అక్సియోనోవ్ సంచిలో దాచిన వృత్తాంతంకూడా కలిపి చెప్పేరు.

ఇది విన్న సిమ్యోన్‌చ్‌కి ఎవరో "చళ్ళని చరచినట్లయింది.... కాని వెంటనే సర్దుకుని "అయ్యో పాపం....ఎలాగుండేవాడు ఎలాగయిపోయాడో?" అనేశాడు ఆశ్చర్యంగా. "ఇదివరకు నీకు ఈయన తెలుసా?" అంటూ నిలదీశాడు తోటీ ఖైదీలు.

"అబ్బే అదేంకాదు....అదేంకాదు...." అంటూ "మనం ఇలా కలుసుకోవడం....చాలా ఆనందంగా వుంది" అన్నాడు. అయితే ఈ మాటలు విన్న అక్సియోనోవ్‌కి ఈ వ్యక్తికి ఆ వ్యాపారిని హత్యచేసిన వారెవరో తెలుసునేమోననిపించసాగింది."

"చూడు బాబూ....నువ్వు ఇదివరలో నా విషయాల్ని విన్నవాడి వేనా అయుండాలి లేదా....నన్ను చూసేనా వుండాలి........అవునా ?" అన్నాడు.

"నాకేం తెలుస్తుంది....ఊరన్నాక ఏవో విశేషాలు అనోటాఆనోటా పుకార్లుగా వ్యాపిస్తాయి కదా ! అయినా చాలారోజులయిందికదా....విన్నవి ఏమో మరిచిపోయాను" అన్నాడు.

"అసలా వ్యాపారిని హత్యచేసిన వారెవ్వరై ఉంటారంటావ్?"

"ఎవరై వుంటారు?.... ఎవరి సంచీలో కత్తి దొరికిందో వాడే అయి వుంటాడు! ... దొరికే దాకా అందరూ పెద్ద మనుషులే.... హ్హా!హ్హా! హ్హా!హ్హా!" అంటూ భళభళా నవ్వేశాడు. పైగా

"తాతాజీ! నాకుతెలియక అడుగుతాను....నువ్వే నిద్దరపోతున్నావ నుకో.... నీకు నిద్రా భంగం కాకుండా నీ తలగడక్రింద కత్తిని పెట్టడం సాధ్యమేనంటావా?" అన్నాడు.

ఒక చిన్న ప్రశ్నకి ఇంత లెక్చర్ ఇచ్చాడంటే....ఆ వ్యాపారిని చంపింది బహుశః ఇతడే అయివుండొచ్చునని అనుమానం కలిగింది అకి యోనోవ్‌కి. ఆ రాత్రంతా ఆలోచిస్తూనేవున్నాడు. ఇన్నాళ్ళూ అనుభవించిన మనోవిశ్రాంతి....చెల్లా చెదరయిపోయింది.

తనని విడిచిపెట్టి వెళ్ళేముందు కన్నీటితో తనముందు నిలబడ్డ తన భార్య ముఖం, చిన్నారి పిల్లల ముఖాలూ.... తనకి మళ్ళీ కనబడ సాగేయి. తన సంసార జీవితంలో తనూ తన భార్య గడిపిన మధుర క్షణాలు, హాయిగానవ్వే ఆమె నవ్వు; ఆమె వయ్యారం.... పిల్లల ముద్దు ముద్దు మాటలు, బుడిబుడినడకలతో నడిచే బాబు. తల్లి ఒడిలో పడుకుని

అమాయకంగా పాలు త్రాగే పసికందు.... కళ్ళలో నీళ్ళు సుళ్ళు తిరుగుతు న్నాయి. తన హుంషారు, వ్యాపారంలో కలుపుగోలు తనంగా నలుగురితో తను వ్యవహరించే తీరు– తనువేసే జోక్సుకి అందరూ విరగబడినవ్వ డం.... ఆ పాడు రోజున వ్యాపారిని తను కలుసుకోవడం; వారు కలసి ప్రయాణం చెయ్యడం, తను వేకువ ఝామునే లేవడం, ప్రయాణం చెయ్య డం, పోలీసులు తనతో వ్యవహరించిన తీరు.... కోర్టులో.... తనమీద కేసు నిరూపించబడ్డ విధం.... అబ్బా.... తల్చుకుంటేనే తల తిరిగిపో తోంది.... ఏమిటిది....భగవంతుడా? ప్రశాంతంగా సాగిపోతోన్న ఈ ఇర వయ్యారు సంవత్సరాల జీవితాన్ని భగ్నపరుస్తూ ఎందుకు ఈరోజు నన్ను మన శ్శాంతికి దూరం చేశావు? అంటూ తెల్లవార్లూ విలపిస్తూనే వున్నాడు. ఒక "దశ"లో ఆత్మహత్య చేసేసుకుంటే.... అనే ఆలోచనకూడా రాక పోలేదు.

ఇదంతా అమాకర్ సిమ్యోనిచ్ మూలంగానే జరిగిందనే అనిపి స్తోంది. తన ప్రాణాలకే విపత్తు కలిగిన.... తనవింత సర్వనాశనం చేసిన సిమ్యోనిచ్ మీద కక్షతీర్చుకుందామనే అనిపిస్తోంది.... తెల్లవార్లూ "భగ వంతుడా నన్ను పాపపు ఆలోచనల్నించి తప్పించు" అని ప్రార్థిస్తూనే వున్నాడు.

పగటిపూట మాకర్ సిమ్యోనిచ్ దరిదాపులకు కూడా వెళ్ళాలని అనిపించలేదు.

ఇలా ఓ పక్షం రోజులు గడిచాయి. నిద్రాహారాలు కూడా మాని మధనపడసాగేవాడు. ఏమీ చెయ్యడానికీ ఏమి పాలుపోవడం లేదు.

అది అర్థరాత్రి.... ఏదో గురగురమని శబ్దం వస్తోంది. ఖైదీలు నిద్రపోయే గూళ్ళలో ఒకదాని లోంచి మట్టిపెళ్ళలు దొర్లి పడుతోన్నట్టు అనిపించింది. ఏమిటా అదిఅని అక్సియోనోవ్ ఆత్రతగా అటుకేసి చూశాడు. నేలలో చేసిన ఒక రంధ్రంలోంచి సిమ్యోనిచ్ పైకి వచ్చాడు.

అక్సియోనోవ్‌ని చూసి గజ గజ లాడిపోయాడు. అక్సియోనోవ్ మాత్రం ఏమీ పట్టించుకోని వాడిలా నిరామయంగా ముందుకి సాగిపోయాడు. మాకర్ గబగబా వచ్చి అక్సియోనోవ్ రెండు చేతులూ పట్టుకున్నాడు. "నేను గోడలోంచి ఒక బిలాన్ని తవ్వుతున్నాను -తవ్వగావచ్చిన మట్టిని బూట్లలోపోసి బయటకు వెళ్ళినప్పుడు దానిని ఆరుబయట పారబోస్తూ వుంటాను ఎలాగో ఇక్కణ్ణించి నేను పారిపోదామని వేస్తోన్నప్లాన్ ఇది" అని చెప్పేడు. పైగా....

"నోరెత్తావంటీ.... నిన్ను ఇక్కడే చంపేస్తాను.... నా ప్లాన్ బయటపడితే ఇక్కడి పోలీసులు నాప్రాణాలు తోడేస్తారు. అరిచేవంటే చస్తావ్....కబడ్దార్!" అని హెచ్చరించాడు. అక్సియోనోవ్ ఆగ్రహంతో ఊగిపోయాడు. అయితే తమాయించుకుని, "నాకు ఇక్కణ్ణించి పోవాలనీ లేదు.... ఎవరికీ అపకారం చేసి ఎవరి ప్రశంశలూ పొందాలనీ లేదు.... నన్ను నువ్వు చంపాల్సిన అవసరమూలేదు. ఎందుకంటే పాత అక్సియోనోవ్ చచ్చిపోయి చాలారోజులైంది. నీ విషయంలో ఏం చెయ్యాలన్నది.... నా నిర్ణయమూ కాదు. నీ నిర్ణయమూకాదు.... ఆ భగవంతుడి నిర్ణయం ఏదైతే.... అదే చేస్తాను.... నేను ఇది చేస్తానని గాని చెయ్యనని గాని చెప్పను" అన్నాడు దృఢంగా....

మర్నాడో.... మూడో నాడో కాబోలు.... ఎవరో బూట్లలో మట్టి పెళ్ళల్ని రవాణా చేస్తోన్న సంగతి పసిగట్టబడింది. మొత్తం జైలు గదులన్నిటినీ గాలించారు.... ఒక భూ గృహం తవ్వబడు తోందన్న విషయం బయటపడింది. కొంతమంది ఖైదీలకు ఈ రహస్యం తెలిసినా.... సిమ్యోనిచ్‌కి భయపడి ఎవ్వరూ పెదవి విప్ప సాహసించలేదు.

జైలు "గవర్నర్" చివరికి అక్సియోనోవ్ కేసి తిరిగి "తాతా! నీ నిజాయితీమీద నాకు పరిపూర్ణమైన విశ్వాసం వుంది. దేవుడి ముఖం చూసి చెప్పు ఈ భూగృహాన్ని తవ్వే ప్రయత్నం చేస్తోన్నది ఎవరు?"

అక్సియోనోవ్‌లో మానసిక సంఘర్షణ ప్రారంభమైంది. అతని పెదవులూ, చేతులూ వణకసాగేయి. నోరు తడారిపోయింది. తన జీవితం సర్వనాశనం కావడానికి కారకుడైనవాణ్ని తనెందుకు కాపాడాలి? తన

మాటని నమ్మితే వాడి ప్రాణాలు తోడేస్తారు....లేదా....ముసలాడికి మతి భ్రమణం కలిగిందని....అతన్ని వదిలేసినా వదిలేయవచ్చు....ఏదిఏమైనా దీనివల్ల తనకి కలిగే మంచిగాని....చెడుగాని ఏమిటి?

"ఏం మౌనంగా వున్నావ్? చెప్పు నీకు తెలిస్తే" తీవ్రంగా అన్నాడు గవర్నర్.

అక్సియానోవ్ మాకర్‌కేసి .... ఓసారి .... తదితరులకేసి ఓసారీ చూశాడు.

"నేను చెప్పలేనండి దొరగారూ! చెప్పమని నాకు భగవంతుడి అనుజ్ఞ అవలేదు. నేను మీ ఖైదీని - నేను మీ చేతుల్లో వున్నాను. నన్ను మీరేమైనా చేసుకోండి - భగవంతుని ఆజ్ఞలేనిదే నేను ఏమీ చెప్పను" అన్నాడు.

ఆ రాత్రి తన పక్కమీద అక్సియోనోవ్ ప్రశాంతంగా పడుకున్నాడు. ఆ చీకట్లో ఎవరో వచ్చి ఆయన పాదాల దగ్గర కూలబడ్డారు. అతడెవరో కాదు మాకర్ సిమ్యోనిచ్.

"నీ కింకా నావల్ల ఏం కావాలి? ఎందుకొచ్చావ్?" మాకర్ నిశ్శబ్దంగా కూర్చున్నాడు.

అక్సియోనోవ్ లేచి కూర్చున్నాడు....

"నన్నెందుకిలా వేధిస్తావ్? వెళ్ళిపోతావా .... గార్డుని పిలవమంటావా?" అన్నాడు.

"నన్ను క్షమించవా అక్సియోనోవ్!" అంటూ కన్నీళ్ళతో అతని కాళ్ళు కడగడం ప్రారంభించాడు.

"దేనికి నువ్వేం చేశావని ?"

"ఆ రోజు ఆ వ్యాపారిని చంపింది, కత్తిని నీ సంచీలో దాచింది నేనే....అసలు నిన్నూ 'ఖతం' చేద్దామనుకున్నాను. బయట ఏదో అలజడి వినబడేసరికి కత్తి నీ సంచీలోపెట్టి కిటికీలోంచి దూకి పారిపోయాను. భగవంతుడి సాక్షిగా ఈ విషయాన్ని నేను జైలు అధికార్ల ముందు ఒప్పేసుకోదల్చుకున్నాను. నిన్ను విడుదల చేస్తారు. నీ జీవిత శేషాన్ని నువ్వు సుఖంగా గడపవచ్చు."

"చాలా సులువుగా చెప్పేశావ్....తమ్ముడూ....ఈ జైలులో ఇర వయ్యారు సంవత్సరాలు అరిగిపోయింది ఈ శరీరం....నా భార్య చనిపోయింది పిల్లలు నేనెవరో చెప్పినా గుర్తుపట్టలేరు .... ఈ జైలే .... నా జీవితం....లే....లే పిచ్చి పిచ్చి ఆలోచనలు మానుకో...." అన్నాడు అక్సియోనోవ్.

మాకర్ తల నేలకేసి బాదుకోసాగాడు. నన్ను క్షమించానని ఒక్కమాట అను "తాతాజీ"—వాళ్ళు నన్ను బెల్టులతో చితక బాదినప్పటికంటె కూడా....నీ పట్ల నే చేసిన ద్రోహం నన్ను విపరీతంగా బాధపెడుతోంది. ఆ "ఏసు" ప్రభువు ముఖం చూసైనా నన్ను క్షమించానని ఒక్కమాట అను" అంటూ హృదయ విదారకంగా రోదించసాగేడు.

అతని ఏడుపు చూస్తే అక్సియోనోవ్ కూడా దుఃఖం పొంగి వచ్చింది.

"మనల్నందరినీ క్షమించాల్సింది....ఆ భగవాన్ ఒక్కడే........ నేను నీకున్న ఎన్నో వేలరెట్లు అధమాధముణ్ణి కావచ్చు. నీవు ఒక్కణ్ణి ఒక్కసారే హత్య చేశావు. నేను మానసికంగా తెలిసో తెలియకో నిన్ను ఎన్ని వేలసార్లు హత్య చెయ్యాలనుకున్నానో....ఆ భగవంతుడికి తెలియదా? నా జీవిత శేషం ఇక్కడే గడవాలనీ, ఇక్కడే ఈ ఎండిపోయిన ఆకు రాలిపోవాలి అనేది నా కోరిక....నీవు నిశ్చింతగా వుండు....నాకు నీ పట్ల ఏ భావమూ లేదు" అని వీపు తట్టి పంపించాడు.

అయినా మాకర్‌సిమ్యోనిచ్ తన తప్పుని—అక్సియోనోవ్"తాతాజీ" నిర్దోషిత్వాన్ని అధికారుల ముందు ఒప్పేసుకుని...."తాతాజీ"ని విడుదల చెయ్యాల్సిందని ప్రార్థించాడు....

అయితే సిమ్యోనిచ్‌కి తెలియని రహస్యం వుంది....అధికార్లు విడుదల చేయడానికి నిర్ణయించిన సమయంలోనే "తాతాజీ"ని ఈ ఇహలోక సంబంధాల్నించి విడుదల చేసెయ్యమని ఆ సర్వాంతర్యామి ఆర్డర్లు జారీ చేశాడని — తాతాజీ సుఖ నిద్రలోనే దీర్ఘ నిద్రలోకి జారుకున్నాడు అనేదే ఆ రహస్యం....

—:o:—

# 2. ఓ దేవుడా ....ఉభయ కుశలోపరి

## (A LETTER TO GOD)

—గ్రెగోరియో లోపెజ్ ఫ్యుయింటెస్(మెక్సికో)

అది ఒక కుగ్రామము—గ్రామమంటే గ్రామమూకాదు—ఒక కొండ చెరియలో ఎత్తుమీద వుండే ఒకే ఒక పూరిల్లు. అక్కణ్నించి చూస్తే నది కనబడుతుంది—పంట పొలాలు కనబడతాయి చిక్కుడు పూలతో నేలంతా బంగారము పరచినట్లు కనబడుతుంది మరోవైపు చూస్తే. అయితే ఆ గ్రామస్థుల-ఇళ్ళు విసిరేసినట్లు దూర దూరముగా వుంటాయి. ఆ గ్రామంలోని వారు చూసేది ఈ సౌందర్యాన్ని కానేకాదు. వాళ్ళ శ్రద్ధ ఎంత సేపూ ఆకాశ పంచాంగమువైపే. "వర్షాలు కురవాలి—పంటల్లు పండాలి" ఇదే వాళ్ళ తాపత్రయం—ఎంతసేపూ. అంచేత "లెంచో" అనే ఆ గృహస్థు—ఆకాశాన్నే పరిశీలనగా చూస్తూ ఈశాన్య ఋతుపవనాలెప్పుడు వస్తాయా అన్న దృష్టిలోనే వుంటాడు ఎప్పుడూ.

"ఆఁ వర్షాలు ఈ ఏడు బాగానే కురిసేట్టున్నాయే భార్యామణీ" అన్నాడు.

"భగవంతుడు దయామయుడు—కురిపిస్తాడు" అంది భార్యామణి రొట్టెల్ని వత్తుతూ.

ఆ కుటుంబంలోని పెద్ద పిల్లలు రెక్కలు ముక్కలు చేసుకుని పొలాల్లో కష్టించి పని చేస్తూంటారు—వాళ్ళమ్మ భోజనానికి పిలిచే సమయం దాకా....

లెంచో ఊహించినట్లుగానే ...వాళ్ళు భోజనాలు చేస్తుండగా కాబోలు పెద్దపెద్ద వర్షపు చినుకులు పడసాగేయి. ఈశాన్యంవైపు దట్టంగా పట్టిన నీలిమబ్బులు వీరివైపురావడముగమనించిన ఆ కుటుంబ సభ్యులకి అమితమైన ఆనందము కలిగింది.

లెంచో వర్షపు స్పర్శ ఆనందాన్ని తనివితీరా అనుభవించాలని ఆరు బయటకు వచ్చాడు. తిరిగివచ్చి "కురిసేవి వర్షపు చుక్కలుకాదు .... పది సెంట్ల నాణేలూ—ఐదు సెంట్ల నాణేలూను" అన్నాడు ఉద్వేగంతో....

మనస్సుకు ఎంత ఆనందమో! ఎంతో తృప్తో....వర్ణించడానికి మాటలు చాలవు....పొలాలన్నీ బంగారంలాటి చిక్కాడు పూలతో మెరిసిపోతు న్నట్లు....నోట్ల కట్టలు లెక్కపెట్టుకుంటోన్నట్లూ పగలే కలలు కన సాగేడు....

అనుకున్నంతసేపు పట్టలేదు. గాలి తీవ్రత హెచ్చింది....వర్షపు చిను కులు కాస్తా వడగళ్ళుగా మారేయి. లెంచో అన్నట్లు పది, ఐదు సెంట్ల నాణేల సైజు వడగళ్ళే పడుతున్నాయి.

అలా ఓ రెండు గంటలపాటు వడగళ్ళు పడుతూనే వున్నాయి. పిల్లలకేం తెలుసు....వడగళ్ళంటే....వారికి కడగళ్ళేనని....బయటకివెళ్ళి వడగళ్లు ఏరుకుని ఆనందంతో గెంతులు వెయ్యసాగేరు. వానవెలిసిపోయాక లెంచో మైదానం మధ్య నిలబడి చూశాడు, హతాశుడయ్యాడు.

"మిడతల దండు కూడా ఇంతటి మారణహోమాన్ని చేసివుండదు" అంటూ విలపించాడు.

పచ్చ పచ్చటి చేలన్నీ తెల్లగా ఉప్పు పరచినట్లు మెరిసిపోతున్నాయి. మచ్చుకైనా ఒక్క పచ్చటి ఆకు కనబడడంలేదు. పువ్వులన్నీ రాలి పోయాయో మరి కరిగిపోయాయో తెలియదుగాని—ఒక పువ్వూ కన బడడంలేదు. ఈ వడగళ్ళ తుఫాను పోతూ పోతూ లెంచో సర్వస్వాన్నీ దోచుకుపోయింది అది అతని జీవితంలో ఒక దుర్దినం.

"మన కష్టం....ఇలా బూడిదలో పోసిన పన్నీరయ్యింది....ఏది దారి?" అని వాపోయాడు.

"ఎవరు మనకి సహాయం చేస్తారు?"

"ఈ సంవత్సరమంతా....మనం మలమలా మాడి చావాల్సిందే"

అయితే ఆ ఒంటరి ఇంటిలో నివసించే ప్రతి హృదయములోనూ ఒకే ఒక ఆశారేఖ ఆరిపోకుండా మిగిలివుంది, అదే భగవంతుడిమీద విశ్వాసం....అతడు వారిని కష్టాలబారి నుండి రక్షిస్తాడన్న గాఢమైన నమ్మకం.

"ఎవ్వరూ ఏమీ బెంగపెట్టుకోనక్కరలేదు—దేవుడు దయా మయుడు—పిపీలకాది బ్రహ్మపర్యంతం ఆయనను నమ్ముకుని ఆయన

దయాదాక్షిణ్యాలతో జీవిస్తోందే తప్ప—నేలను, వానల్ని, పంటల్ని, పొలాల్ని నమ్ముకుని కాదు....

"ఇదే అనుభవజ్ఞులైన పెద్దలమాట....అందుకే అన్నారు పెద్దల మాట చద్దిమూట అని."

లెంచో ఆ రాత్రంతా కూర్చుని ఈ విషయమే ఆలోచిస్తూ కూర్చుండి పోయాడు. దేవుడు....అవును....దేవుడి దృష్టినించి ఏదీ తప్పించుకోలేదు. ఆయన సర్వసాక్షి, సర్వాంతర్యామి, సర్వజ్ఞుడు, అబ్బో ఆయన అగాధాల లోకి చూడగలడు, అంతరిక్షంలోకీ ఎగరగలడు మనస్సుల్ని చదివేయగల మహామహిమాన్వితుడు....

లెంచో—ఒప్పువంచి గొడ్డులా పనిచేసే మనిషి రూపంలోవున్న పశువే అయినా అక్షర జ్ఞానంలేని పశువుకాదు—చదవడంవచ్చు, వ్రాయ డమూవచ్చు—"నాయపోసినవాడు నీరుపోయకమానడు" అనే సామెతని గాఢంగా విశ్వసించినవాడే అయినా....అతనికి మరో సామెత కూడా తెలుసు "అడగనిదే అమ్మయినా పెట్టదని" దేవుడు జీవుల్ని సృష్టించి ఊరుకోడట....వీరి రక్షణ కోసం కొంత మంది రక్షకుల్ని అధిదేవతలుగా కూడా సృష్టిస్తాడట....అంచేత మనము ఆ అధిష్ఠాన దేవతల ద్వారా దేవుడికి మొరపెట్టుకుంటే....మన మొర తప్పకుండా ఆలకిస్తాడు, మన లను తప్పక ఆదుకుంటాడు....అదీ లెంచో విశ్వాసం "ఆ! నా వెర్రిగాని.... దేవుడికి మాత్రం ఎన్నికోట్ల పనులుంటాయి?

మనం మనగోడు చెప్పుకోకపోతే....ఎలాగో....పని గట్టుకుని మనలను గురించి వాకబుచేసి....తెలుసుకుని మనకి సహాయపడవలసిన అవసరం ఆయనకేమిటట? శతకోటి జంగాల్లో బోడి జంగం అన్నట్టు మన దృష్టేనా ఆయనలో....అయితే మొరపెట్టుకుంటే వినకపోతాడా? తప్పకుండా వింటాడు.

అందుకే దేవుడిపేర ఓ అర్జీ వ్రాసి పంపాలని నిశ్చయించాడు "లెంచో.

ఓ దేవుడా! అని మొదలుపెట్టి....నీవు గనక మమ్మల్ని ఆదుకోక పోతే ఈ సంవత్సరమంతా ఆకలితో నేనూ, నాభార్యా పిల్లలూ మల మల

మాడి ఆకలితో చస్తాము. అయితే నేను కాళ్ళుజాపుక్కూర్చుంటాను, నాకు తేరగా డబ్బియ్యమని అడగడంలేదు. కాళ్ళిచ్చావు, చేతులిచ్చావు, వంట్లో శక్తినిచ్చావు. వ్యవసాయం చేసుకొనేందుకు పొలాన్నిచ్చావు. మరెందుకో తెలియదు-వడగళ్ళ తుఫానుని పంపించి నా సోయాచిక్కుడు పంటని నామ రూపాల్లేకుండా సర్వనాశనం చేశావు. నువ్వు చేసింది న్యాయమని గాని, అన్యాయమని గాని నిర్ణయం చేసేందుకు అఫ్టరాల్ గాణ్ణి నేనెవర్ని? ఒక్క వంద పిసోలు (ఆదేశపు నాణేలు) ఇప్పించు-విత్తనాలు కొనుక్కుంటాను. రెక్కలు ముక్కలు చేసుకుని మళ్ళీ నాట్లు వేసుకుని పండించుకుని, నీపేరు చెప్పుకుని ఈ ఏటికి పస్తులుండకుండా బండిలాగించేస్తాను. బాబ్బాబు! ఈ ఒక్క ఉపకారమూ చేసి పుణ్యం కట్టుకో!...." అని ముగించి తన ఎడ్రస్ కూడా రాసి—ఆ కాగితాన్ని మడతపెట్టి ఒక కవరులో పెట్టి "దేవుడి దివ్య సన్నిధికి" అని కవరుమీద ఎడ్రస్‌రాసి-నాలుగు మైళ్ళ దూరంలో వున్న పోస్టాఫీసు వున్న వూరికి నడిచివెళ్ళి స్టాంపులు కొని, అతికించి పోస్టు డబ్బాలో పడేసి వచ్చాడు-

బట్వాడా చేసే పోస్టుమ్యాన్ చేతిలో పడ్డ ఈ వుత్తరాన్ని ఎలా బట్వాడా చెయ్యాలో-ఎవరికి అందించాలో తెలియక పోస్టు మాష్టారి దగ్గరకు పోయి-

"ఇదేం చెయ్యమనసార్!" అన్నాడు పకపకా నవ్వుతూ

ఇది చూసిన పోస్టు మాష్టారిక్కూడా ఎంత ఆపుకుందామన్నా నవ్వు ఆగింది కాదు. మరో పోష్టుమ్యాన్‌గాని, మరో పోష్టుమాస్టర్ అయితే ఈ వుత్తరం బహుశః చెత్తబుట్టని వరించేది. కాని వీళ్ళది ఒక విచిత్రమైన మనస్తత్వం.

"ఇతనెవరికో దేవుడిమీద విపరీతమైన విశ్వాసం వున్నట్టుగావుంది. ఇతనికువ్నంత భక్తి విశ్వాసాలు నాకుంటే బాగుండును. అతనిలా నేనూ దేవుణ్ణి నమ్మగలిగితే....మనకెలాగు అంతటి స్థాయి, విశ్వాసమూ లేవు-కనీసం అతని విశ్వాసాన్ని వమ్ము చెయ్యకుండా మనం ఏదైనా చేస్తే

బాగుంటుందని నాకనిపిస్తోంది....ఎంత విశ్వాసం లేకపోతే నేరుగా దేవు డికే ఉత్తరం రాస్తాడు?"

అందుకే నరనరాల్లోనూ దైవం పట్ల విశ్వాసం గల అతనికి దేవుడి దగ్గర్నించే ఏదో సహాయం అందినట్లు చెయ్యాలని ఆలోచించారు—పోస్టు మ్యాన్ పోస్టుమాష్టారూ కలిసి-ఆ కవరుని జాగ్రత్తగా ఊడదీసి పరాయి వాళ్ళ ఉత్తరాలు చదవడం నేరమేనని తెలిసినా చదివేరు...."అయ్యో పాపం....వెర్రివాడా!" అనుకున్నారు ....పోస్ట్‌మ్యాన్, పోస్ట్‌మాష్టారూ కలిసి, ఇతర స్నేహితుల దగ్గర కొంత సొమ్మును పోగు చేశారు. అయితే ఎంత ప్రయత్నించినా....అతను కోరిన వందపెసోలు సమకూర్చ లేక పోయారు. సుమారు అరవై డెభ్భై పెసోలు దాకా పోగయింది. అసలులేని దానికన్నా ఏదోకొంత సహాయం పంపితేనైనా అతనికి తాత్కాలిక ఉప శమనం కలిగించిన వాళ్ళం అవుతామనే ఉద్దేశ్యంతో ఆ నోట్లన్నిటినీ ఒక కవర్‌లో భద్రంచేసి దేవుడి సంతకం చేసిన ఓ కవరింగ్ ఉత్తరాన్ని కూడా కలిపి కవర్‌ని రెడీ చేశారు....

ఆ దేశంలో పోస్టుమ్యాన్ మనదేశంలోలా ఇంటింటికీ వెళ్ళి ఉత్త రాలు బట్వాడా చెయ్యరట! కాళీగా ఉన్నప్పుడు వ్యక్తులే వెళ్ళి వారికి వచ్చిన ఉత్తరాలని తీసుకువెళతారు.

లెంచో ఆదివారంనాడు పెంద్రాళే పోస్టాఫీసుకు వెళ్ళి "నాకు ఏమైనా ఉత్తరాలు ఉన్నాయా" అని వాకబు చేశాడు.

పోస్టుమ్యాన్ స్వయంగా ఆ కవర్‌ని అందజేసి లెంచో ఎంత ఆశ్చ ర్యంతో తబ్బిబ్బయి పోతాడని ఓరకంట గమనించసాగేడు. లెంచో కవర్ విప్పి చూసుకున్నాడు. అతడి ముఖంమీద ఏమాత్రం ఆశ్చర్యంగాని, తబ్బిబ్బుకాని కనపడలేదు-పైగా నోట్లు ఒకటికి పదిసార్లు లెక్కపెట్టుకు న్నాడు....అనుమానంగా అటూ ఇటూ చూశాడు-దేవుడు లెక్కల్లో "పూర్" కాదు ఆయనే లెక్కల్లో "పూర్" అయితే ఈ కోట్లాది నక్షత్రాలూ భూమీ

సూర్య చంద్రులూ సృష్టి ఇంత లెక్కప్రకారం ఎలా వుంటాయి? దేవుడి దగ్గర పనిచేసే అధిష్టాన దేవతలకీ ఈ "వంద" రాళ్ళలోనూ కక్కుర్తి పడాల్సిన అవసరంలేదు. అవి దేవుడిదగ్గర కరక్టుగానే బయల్దేరి ఉంటాయి. ఈ లెక్క తకరారు ఎక్కడ వచ్చి వుంటుందీ అని తీవ్రంగా ఆలోచించాడు. అందుకే ఈ విషయం దేవుడితోటి తేల్చుకోదలచుకున్నాడు.

అందుకే ఉత్తరాలు బట్వాడా చేసే కిటికీ దగ్గరకు వెళ్ళి "దయచేసి ఒక తెల్ల కాగితం ఇప్పిస్తారా?" అని అడిగాడు. ఇంకు బుడ్డికూడా అడిగి తీసుకున్నాడు. టేబుల్ దగ్గరకూర్చుని రాయడం ప్రారంభించేడు. తీవ్రంగా ఆలోచించి ఉత్తరాన్ని పూర్తిచేశాడు. దాన్ని కవర్లో పెట్టి మళ్ళీ "దేవుడి" ఎడ్రస్ రాసి పోస్టు డబ్బాలో పడేశాడు.

పోస్టుమ్యాన్ ఆ డబ్బాలోంచి ఉత్తరాన్ని పైకి తీసినప్పుడు చించి చదివాడు........ఇలా రాసి వుంది.

"దేవుడూ....ఉభయ కుశలోపరి-నేనడిగింది ఎంత? నువ్వు పంపింది ఎంత? డెబ్భైపిసోలు మాత్రమే నా కందేయి. నువ్వు కరెక్టుగానే వందా పంపి వుంటావని అనుకుంటున్నాను. అయితే ఎక్కడ "కిరికిరి" జరిగిందో నాకు తెలియదు కాని....నాకు మిగతా ముప్పై పిసోలూ అర్జెంటుగా పంపించు. దయచేసి పోస్టులో మాత్రం పంపకు-వాళ్ళు మధ్యలో కొంత కొట్టేసి పంపించడానికి అలవాటుపడ్డ ఘటాలు....ఉంటా....మిగిలిన డబ్బు త్వరగా పంపిస్తావు కదూ!....పోస్టులో మాత్రం పంపొద్దు ప్లీజ్.... ఉంటాను....లెంచో" అని సంతకం చేసి ముగించాడు.....

పోస్టుమ్యాన్ నోట తడారిపోయింది.

....***....

# ౫. ఆనందం అర్ణవమైతే…

## (THE HAPPY PRINCE)

**ఆస్కార్ వైల్డ్ (ఐర్లండ్)**

"సాహిత్య కళాకారులలో రెండువర్గాలవాళ్ళున్నారు; కళకళకోసమే కనుక—సాహిత్యాన్ని సాంఘికస్పృహతో ఏమీ తీర్చిదిద్దనక్కరలేదు. కళాత్మకంగా, వినూత్నంగా ప్రదర్శించగలిగితేచాలు—వాస్తవమా?.... వాస్తవదూరమా? అన్న చర్చకూడా అర్థరహితం అనే వాదన ఒకవైపైతే "కాదు కళ సంఘంకోసం సాంఘిక స్పృహలేని సృజనాత్మకతకి విలువ లేదు అనేది మరోవర్గపు వాదన—తమాషా ఏమంటే సాంఘిక స్పృహ స్పృహ....అంటూ రొమ్ము విరుచుకు తిరిగేవారి "స్పృహ" ఏమిటో అర్థం చేసుకోదల్చుకుంటే....వారి పరిభాషకి మన స్పృహ తప్పిపోవలసి నదే తప్ప—ఒక్క ముక్క అర్థమై ఏడవదు. ఆస్కార్ వైల్డువంటి మహారచయితలు-మేము కళని కళగానే ఆరాధిస్తున్నాం....అంటూ నిర్ద్వం ద్వంగా "రాసి" పడేశారు.....అయినా ఈ స్వేచ్ఛాను వాదకుడయిన ఈ అజ్ఞానికి "ఆస్కార్‌వైల్డు" మహాశయుని రచనల్లో కనబడ్డ సాంఘిక స్పృహ....మరి ఎవరి రచనల్లోనూ కనపడలేదు. బహుశః అది భవదీ యుడి అజ్ఞానానికి పరాకాష్ఠ కావచ్చు....ఈ కథ చదివిన పాఠకుల నిర్ణ యానికే వదిలేస్తున్నాను....నిర్ణయించే బాధ్యతని)

ఆ పట్టణం నడిబొడ్డున ఒక ఎత్తయిన వేదిక-దానిమీద నిలబెట్టేరు ఒక విగ్రహాన్ని....అతనిని అంతా "ఆనంద రాజనందనుడు" అనేవా రట....అతను జీవించివున్న రోజుల్లో. బతికున్నరోజుల్లో "అందంచూడ వయా....ఆనందించవయా" అంటూ ఆనంద సాగరంలో ఓలలాడడమే కాదు, మరణించినా అష్టయిశ్వర్యాలతో తులతూగేలా అమర్చారు అతని విగ్రహాన్ని. అబ్బో! విగ్రహాన్ని మొత్తం బంగారు రేకుల్తో తళ తళ లాడేలా తీర్చిదిద్దారు. నేత్రాల స్థానంలో ఏకంగా రెండు ఇంద్రనీలమణుల్నే అమర్చారు. ఎర్రగా మెరిసిపోయే రత్నాన్ని అతని పచ్చలబాకు పిడిలో

బిగించారు....అది ఈ రోజుల్లో....మనదేశంలో అయితే తెల్లవారేదాకా ఉంటుందనే గ్యారంటీ లేదుకావి....మరి ఆ రోజుల్లో........(అప్పుడూ ప్రపంచం ఇంత స్వార్ధపరంగానూ ఉండేది ఎంచేతో తెలియదుకాని ఈ రాకుమారుని విగ్రహం జోలికి మాత్రం ఎవ్వరూ వెళ్ళిన సూచనలు లేవు (అది ఎవిమిదో వింతేమరి!)

ఆ వూరి కౌన్సిలర్‌గారు ఒకాయన చూసి "అబ్బ ఎంత అందంగా వున్నాడు! గాలికోడిలాగ...." అంటూ ముచ్చటపడిపోయాట్ట....అయితే వెంటనే ఇలాంటి సాంఘిక స్పృహలేవి అవాక్కులు మాట్లాడితే ఓట్లు రాలవని భయపడ్డాడో ఏమో...." వెంటనే నాలుక కరుచుకుని అయినా ప్రజోపయోగమయినా మరోసవి చేయొచ్చుకదా....ఇలా ధనం తగలేసే బదులు" అనేశాడు ఎందుకయినామంచిదని.

ఓ చంటికుర్రాడు "నాకు దాయి దాయి కావాలి!" అంటూ చంద్రుణ్ణి చూపించి ఎడుస్తూంటే——

"నువ్వూ ఆ "ఆనందరాకుమారుల్లా" మంచి బాబులా వుండాలిరా.. ఆయనెప్పుడూ నీలాటి వెర్రిమొర్రి పేచీలు పెట్టి ఎరగడట....బ్రతికుండే రోజుల్లో" అంటూ బుజ్జగించింది వాళ్ళమ్మ.

"అమ్మయ్య....ఈ ప్రపంచంలో కష్టాలంటే ఎరగని ఆనందాన్ని అనుభవించిన ఒక్క జీవి ఉండేదన్నమాట....నేను సైతం వెర్రిగొంతుక విప్పి అతనితో శృతిని కలిపేను" అంటూ తనలోతను గొణుక్కున్నాడొక భగ్నహృదయుడు....(మరి అతని హృదయం ఎందుకు భగ్గుమందో మనకి తెలియదు) ఆ విగ్రహాన్ని తృప్తిగా చూస్తూ

"ఓహోహో....ఒక దేవదూతనే చూస్తోన్నట్టనిపిస్తోంది....ఈ విగ్రహాన్ని చూస్తూంటే" అన్నారు శరణాలయాన్నించి ఎర్రచొక్కాలు తెల్ల మఫ్లర్లూ గల యూనిఫారం వేసుకొచ్చిన పిల్లలు.

"దేవదూతల్ని మీరిదివరకు ఎప్పుడూ చూశ్ళేదుకదా....ఈ విగ్ర

పాన్ని చూస్తుంటే....మీరెప్పుడూ చూడని దేవదూతలెలా జ్ఞాపకం వచ్చారు ?'' అలా అన్నది లెక్కల మేష్టారులెండి....ఆయనకి ప్రతిదానికీ ఋజువులూ, సాక్ష్యాలూ, సూత్రాలూలాటి డేటా ఇస్తేగాని, ఏ స్టెప్పూ లేకుండా ఆన్సర్లు వేసేస్తే మార్కులువేసే ఘటంకాదు, అసలు యిలాంటి కలలూ, ఆధారంలేని ఊహలూ పిల్లల్ని చెడగొట్టేస్తాయనేది ఆయన సిద్ధాంతం.

'మాకు కలల్లో ఇలాటివి కనిపిస్తాయి మాష్టారూ'' అనేశారు పిల్లలు....వాళ్ళు అమాయకులు కదా? పిల్లలూ దేవుడూ చల్లనివారే కల్ల కపట మెరుగనీ....

"షటప్....డోంటాక్ రబ్బిష్'' అని అనలేడుకాని అలా అన్నట్టు కళ్ళెర్ర చేశారు లెక్కల మేష్టారు........

ఆనాటి రాత్రి ఆ వూరి మీదుగా ఒక చిన్న కోయిల పిల్లలాటి పక్షి ఎగురుతోంది. అది మనదేశాల్లోవుండే పక్షికాదు—దానిని "శ్వాలో" అంటారు. మనం మన సౌలభ్యంకోసం "కోయిల" అని పిలుచుకుందాం. ఆ కోయిల ఏదో దేశంనించి ఈ దేశానికి వలసవచ్చిన గుంపుతో కలసి వచ్చింది. దారితప్పి ఉండిపోలేదుకాని దాని గుంపు గుంపూ ఆరువారాల క్రిందటే ఈజిప్టుదేశానికి ఎగిరిపోయింది....దానిది ఒక విషాదభరితమైన ప్రేమకథ. అది వర్ణాంతరపు ప్రేమకాదు—ఒక శాఖాంతరపు ప్రేమకథ. గాలిలో ఎగిరే పక్షి-నేలతల్లినే అంటిపెట్టుకుని స్థావరంగావున్న గడ్డిపర కని ప్రేమించింది. మనకది వేళాకోళపు వ్యవహారంగా తోచవచ్చుగాక ప్రేమికుల నడగండి చెపుతారు. ప్రేమికులకు ఏ అవధులూ వుండవని కేవలం ఆవరోధాలు మాత్రమే ఉంటాయని వసంతర్తు సమాగమ సమ యాన ఒక నాచుపట్టిన హరితవర్ణపు సరోవరం మీదుగా ఎగురుతోన్న శ్రీ పక్షిగారికి అందాలు చిందేటి అందాల భామ ఈ గడ్డిపరకగారు కనబడి ఒళ్ళెరగని ప్రేమమైకంలో ముంచేశారు. దాని హొయలు—దానివయ్యారం దాని నాట్యభంగిమలూ చూసిన పక్షీంద్రునికి మతే గతితప్పింది. మనలాగ ముసుగులో గుద్దులాటలు తెలియవు ఈ జీవాలకి—అందుకే........

"నేను నిన్ను ప్రేమించుకుంటున్నాను-ప్రేమించుకోనా?" అని ఠపీ మని అడిగేసింది. గడ్డిపరకకి - పక్షి భాష అర్థమయిందో లేదో తెలియదు కాని - ఒకసారి "సలాం ఆలేకుం" అన్నట్టు తలవంచి మళ్ళీ తల పైకి ఎత్తింది - ఇది అంగీకారం కాక మరేమిటి? అందుకే సంతోషంతో తబ్బిబ్బైన "పక్షి" టప టపమని రెక్కలతో వీవన కర్రతో విసురుతూన్నట్లు ప్రియురాలిచుట్టూ కలియ తిరగసాగింది. సరస్సు తన ఉపరితలం మీద చక్రాలు చక్రాలుగా సుడులు తిరుగుతూ వీరి ప్రేమకి మద్దత్తు పలికింది. ఆ వేసవికాలం అంతా పక్షి గడ్డిపరకని ప్రేమిస్తూనే కాలక్షేపం చేసేసింది.

మిగతా పక్షులు దీనిని చూసి "ఇది అర్థం పర్థం లేని అనుబంధం ....గడ్డిపరకకి గడ్డిపరకంత ఆస్థి కూడా లేదు. బంధువులు మాత్రం కుప్ప తెప్పలుగా వున్నారు. వద్దు మనకీ అనవసరపు ప్రేమ గోల" అన్నాయి. నిజమే ఆ సీజనులో సరస్సునిండా గడ్డిపరకలు మొలిచి వున్నాయి దాని మీద తేలే నాచుమీద. అయితే శశిరం వచ్చేసరికి ఈ గడ్డిపరక బంధువులు ఒక్కొక్కళ్ళే రాలిపోయారో, కొట్టుకుపోయారో గాని మొత్తానికి అక్కరకు రాని చుట్టాల్లా ఒక్కొక్కళ్ళే జారుకున్నారు. ప్రేమించి ప్రేమించి విసుగెత్తిపోయింది మన చిన్నారి పక్షికి. "ఉలకదేం-పలకదేం?....కొంప తీసి మరో ప్రియుడి వలలో చిక్కుకుందేమో....అవును సుమా! గాలితో నా ప్రియురాలు అక్రమ సంబంధం పెట్టుకున్నట్లు అనిపిస్తోంది. అందుకే నేమో గాలి వీచినప్పుడల్లా దానికి ఆ గిలగిలలూ - రెపరెపలూను .... ఛీ అందుకే ఆడదాన్ని నమ్మకూడదన్నారు. పైగా దీనిని ఎంతసేపు నేలబారు ఆలోచనలేగాని, నాలా ఊహల్లోనూ, గాలిలోనూ ఎగిరే లక్షణాలు దీన్లో కనబడటం లేదు. నాకు విహారాలంటే ఎంతో ఇష్టం - నా భార్యకూడా నా ఇష్టానుసారంగా వుండాలి గాని....ఇదేమిటి అసహ్యంగా నేలలో కూరుకుపోతానంటుంది ? అయినా అమ్మి, తుమ్మి తేల్చేసుకుంటాను .... అసలు అమ్మాయ్ నాతో లేచి వస్తావా? రావా? నాకు ఈ నంగిరితనం ఇష్టం వుండదు" అనేసింది.

గడ్డిపరక ప్రేయసి ఉలకలేదు-పలకలేదు....తన ప్రియుడు "గాలి" ఆడించమన్నట్టుల్లా తల అడ్డంగా ఆడించింది.

"పరేలే నిన్ను నమ్ముకుని నేను నా వాళ్ళకి దూరమయ్యాను—ఎలాగో అలా తంటాలుపడి ఈజిప్టులో పిరమిడ్ల దగ్గరున్న మా వాళ్ళని చేరుకుని గంతకుతగ్గ బొంతని ఒకదాన్ని వెతుక్కొని హాయిగా బ్రతికేస్తాను-నేను రోమియోనీ కాదు-దేవదాసునీ కాదు.

"ప్రేమో....ప్రేమో....అంటూ పడి చావడానికి" అనేసి గుడ్‌బై కొట్టి ఆకాశంలోకి ఎగిరిపోయింది. పక్షి బింకానికి ఎగిరిపోయిందేకాని.... ఎటు పోవాలో దిక్కు తోచటంలేదు. అసలు ఈ రాత్రికి ఎక్కడ మకాం చెయ్యాలనేదే ముఖ్య సమస్య అయి కూర్చుంది.

అప్పుడు ఆ వేదిక మీద నిలబడ్డ ఆనంద—రాజనందనుడి గారి బంగారు వన్నెలీనే విగ్రహం కనపడింది.

"ఆ ఇక్కడ బేషుగ్గా వుండేలా వుంది" అని ఆ విగ్రహం పాదాల రెండింటి మధ్య బెడ్‌రూంలావున్న కాళీ జాగాలో దిగింది....

"ఓహోహో! ఎవరో మన కోసం ఇక్కడ ఓ బంగారపు బెడ్ రూమ్‌ని ఏర్పాటు చేశారు. ఎలాగైనా ఈ పట్టణంలో వాళ్ళకి అతిధి మర్యాదలు బాగా తెలుసు....వెచ్చగా కూడా వుండేలా వుంది" అని రెక్కల సందులో తలదూర్చి నిద్రపోడానికి సిద్ధమవుతోండగా...."టప్" మని ఓ వాన చినుకు పడింది.

"బలే తమాషాగావుందే....ఆకాశంలో ఒక్క మేఘంకూడా లేకుండా వర్షం కురియడం ?....ఇది బాగా పొడిగా వుండే రోజులు కదా!" అయినా ఆ గడ్డిపోచ "గాలి"తో వ్యభిచరించడం జ్ఞాపకం వచ్చి .... నిద్రపాడయిపోయి - పక్షి (లేవనుకోండి)....పట పట కొరికింది.

ఒట్టి స్వార్థపరుల లోకం నిష్కామమైన ప్రేమకు రోజులు కావివి. మళ్ళీ టపీమని మరో చినుకు....

"ఎందుకొచ్చిన విగ్రహమయ్యా ఇది?- వర్షం నించి వచ్చిన అతి

ధుల్ని, ఆదుకోలేని ఇలాటి విగ్రహాల్ని చూసే "విగ్రహ పుష్టి నై వేద్య నష్టి" అని వుంటారు....పోతానయ్యా బాబూ, పోతాను. మరోమంచి పైన గొడుగులాటి దేదేనా వున్న పొగగొట్టమయితే నీకన్న నయం" అని విసుక్కుంది.

రెక్కలు విప్పి లేవబోతోంది. మళ్ళీ మూడో చినుకు ముత్యంలా మీద పడింది. అప్పుడు తలెత్తి పైకి చూసింది....ఏమి చూసింది ?...

ఆ ఆనంద రాజనందుని విగ్రహపు ఇంద్రనీలాల నేత్రాలు అశ్రుపూరితాలయి వున్నాయి. దాని బంగారు పచ్చెలినే చెక్కిళ్ళ నుండి అశ్రువులు ధారాపాతంగా కారుతున్నాయి. అయితే అతని ముఖం మాత్రం వెన్నెలకాంతితో పోటీగా తళతళలాడుతూ, అందం వుట్టిపడుతూ ముద్దొస్తూ వుంది. పక్షికి ఎంతో జాలేసింది.

"ఎవరివయ్యా బాబూ నువ్వు?" అంది.

"నేనా? నా పేరు ఆనంద రాజనందను డంటారు."

"మరి ఈ ఏడుపెందుకోయ్?....నీ ఏడుపేదో నువ్వేడ్చుకుంచే నాకేం అభ్యంతరంలేదు....చూడు నన్నెలా తడిపేశావో!"

"నేను బ్రతికున్న రోజుల్లో.... నాకు మనుష్య హృదయం వుండేది. అప్పుడు నాకు ఏం చూసినా కన్నీళ్ళు వచ్చేవి కావు. నేను నివసించే "సబ్‌సౌరి" అనే దివ్య సౌధంలోకి గాని, దాని పరిసరాల్లోకి కన్నీళ్ళని, కష్టాల్ని రానిచ్చేవారు కాదు. పగలంతా స్నేహితుల్తో గడిపే వాణ్ణి రాత్రంతా మా భవనం డ్యాన్స్‌హాల్‌లో ఆటపాటలు, సంగీత సాహిత్యాలు, ఓహ్! ఆనందమే ఆనందం. మా భవనం చుట్టూ ఓ ఎత్తైన, బలమైన ప్రహారీగోడ. ఆ గోడ అవతల ఏముందో నేను అడిగే వాణ్ణీకాదు- ఎవరూ చెప్పేవారు కాదు. అంతా అందమే అని అనుకునే వాణ్ణి - నా చూట్టూ చేరిన వారంతా నన్ను "ఆనందాల రాకుమారా" అని పిలిచేవారు. నేనూ "ఆనందమె జీవిత మకరందం" అనుకునేవాణ్ణి.... సుఖమయజీవితానికి - ఆనందానికీ మధ్య విభజనరేఖ లేదనే అనుకునే వాణ్ణి - అలాగే బ్రతి

కేను - అలాగే మరణించాను. నేను మరణించిన తర్వాతే నాకు ప్రపంచంలో ఇన్నికష్టాలూ, బాధలూ వుంటాయని అర్థమయింది. నా హృదయం ఇప్పుడు మనిషి హృదయం కన్న కొంచెం మృదువైన సీసంతో చెయ్యబడిందేమో, నాకు నా చుట్టు పక్కల వారికష్టాలు చూస్తోంటే దుఃఖం ఆగడం లేదు.

"అయితే నువ్వు మొత్తం బంగారానివి కాదన్నమాట....పైకిపటారం లోనలోటారం వ్యవహారం అన్నమాట" అనాలని అనుకుని మర్యాద కాదని మిన్నకుండి పోయింది.

"ఇక్కడికి దూరంగా" రాజకుమారుని సుస్వరం గంధర్వులు వీణ మీటినంత మధురంగా వుంది. "ఇక్కడకు చాలా దూరంలో ఒక ఇరుకు సందు వుంది. ఆ సందులో ఓక బీద సంసారం వుండే ఇల్లు.... ఆ ఇంట్లో ఒక టేబుల్ దగ్గర ఆమె కూర్చుని వుంది.... బక్క చిక్కిన శరీరం-పాలిపోయిన ముఖం ఆమె బండబారిన వేళ్ళు ఎర్రగా వున్నాయి. ఆమె కుట్టుపనిలో, అందమైన అల్లికలపనిలో ప్రవీణురాలు—— రేపే రాణీగారి భవంతిలో బ్రహ్మాండమైన విందు, వినోదాల కార్యక్రమం - అందుకోసం ప్రత్యేకంగా ఒక బ్రహ్మాండమైన డ్రెస్‌మీద నభూతో నభవిష్యతిగా ఎంబ్రాయిడరీ చెయ్యాలని ఓ లార్డుగారి భార్య ఆర్డరిచ్చింది. ఏది ఏమైనా ఆమె ఎంతరాత్రయినా ఆ పని పూర్తిచేస్తేగాని ఒప్పుకున్న మజూరీ చేతిలో పడదు...."

"అయితే ఏమిటట!" విసుగ్గా అంది పక్షి.

"ఏంలేదు బుల్లిపిట్టా! వాళ్ళ చిన్నబాబుకి ఒళ్ళు తెలియనంత జ్వరం. అమ్మా నాకు నారింజకాయలు కావాలి.... నోరంతా చేదుగా వుంది. అని ఏడుస్తున్నాడు. జ్వరతీవ్రత వల్ల నీరసంగా వున్నాడు. అయితే ఆ ఇంట్లో మంచినీళ్ళు తప్పమరేం లేవు. తల్లి వాడి ఏడుపు చూళ్ళేదు. చేసే పనిని మానలేదు. బుల్లిపిట్టా - బుల్లిపిట్టా - నా బాకుపిడిలో వున్న ఎర్ర రత్నాన్ని ఊడబెరికి వాళ్ళకి ఇచ్చిరావా? నా పాదాలు ఈ వేదికకి బిగించి వున్నాయి - నేను కదల లేనిస్థితిలో వున్నాను....ప్లీజ్....ప్లీజ్ "

"మా వాళ్ళు ఈజిప్ట్‌లో నా కోసం ఎదురు చూస్తూవుంటారు. వాళ్ళు నైలునది మీద సరదాగా గింగిరాలు కొడుతూ నదిమీద తేలిఆడే తామర పువ్వుల్తో ఎంతోసరదాగా మాట్లాడుతూ వుంటారు. అలా ఆడి ఆడి అలసిపోయి ఈజిప్ట్‌రాజు సమాధిగా ప్రఖ్యాతి పొందిన పిరమిడ్ అనే దివ్య భవనంలో రాత్రుళ్ళు సుఖంగా నిద్రపోతూ వుంటారు. అబ్బ ఆరాజుగారిని సమాధిచేసిన శవపేటిక అందాన్ని చూడ్డానికే వెయ్యి కళ్ళుచాలవు తెలుసా! ఆయనని పచ్చటి సిల్కు బట్టల్తో అలంకరిస్తారు - ఆయన శరీరానికి పూతగాపూసిన సుగంధ ద్రవ్యాల పరిమళం తల్చుకుంటేనే ఒళ్ళుపులకరిస్తుంది తెలుసా! ఆయన మెడలో పుష్యరాగాలు పొదిగిన కంఠాభరణం వుంటుంది - ఆయన చేతులు........"

"పిట్టా! పిట్టా!! బుల్లిపిట్టా!!!.... ఈ ఒక్కరాత్రికి నా కోసం ఆగి ఈ పని చేసిపెట్టు, నీకు పుణ్యం వుంటుంది. ఆ అబ్బాయి దాహంతో చాలా బాధపడుతున్నాడు"....

అబ్బా నీకెలా చెప్పనోయ్ రాకుమారా!!.... నాకు ఈ మగపిల్లలంటే పరమ అసహ్యం.... క్రిందటి సంవత్సరం మేమిక్కడికి వలస వచ్చినప్పుడు — ఇద్దరుపిల్లలు - ఎవడో మిల్లుయజమాని కొడుకులట! ఎప్పుడూ మమల్ని రాళ్ళతో కొడుతూ వుండేవారు. నాకెప్పుడూ దెబ్బలు తగల్లేదనుకో.... అయితేమేము వాలినచోట వాలకుండా ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని పరిగెత్తవలసివచ్చేది.... అయినా మా కుటుంబం స్పీడుస్పీడుగా ఎగరడంలో నిష్ణాతులం గనక సరిపోయింది కాని.... అయినా నాకు వాళ్ళు చేసే ఈ క్రూరపరిహాసాలు చూశాక.... అసహ్యత పేరుకుపోయింది. అబ్బాయిలకి సహాయం చెయ్యడం తప్ప మరేమైనా చెయ్యమను చేస్తాను-" ఆరాకుమారునికి ఇవేవీ వినపడటం లేదల్లే వుంది.... దిక్కు మొహంచూస్తే జాలేసింది...." సరేలే.... నీ మొహం చూసి నా సిద్ధాంతాన్ని కొంచెం మార్చుకుంటున్నాను. ఈ రోజు రాత్రికి ఆగుతానులే. నీ రాయబారిగా మాత్రమే.... నువ్వు చెప్పినపనిని చేసి పెడతాను. అబ్బాయిల్ని మాత్రం నాజన్మలో క్షమించను సుమా!" అంది.

"చాలా థాంక్స్.... బుల్లిపిట్టా!"

బుల్లిపిట్ట తన ముక్కుతో రాకుమారుని జాకుపిడిలో బిగించివున్న ఎఱ్ఱరత్నాన్ని పెకలించింది. దాన్ని ముక్కున కరుచుకుని అవూళ్ళో భవనాల పైనించి రాకుమారుడు చెప్పిన "చిరునామా" వైపు ఎగరసాగింది.

దారిలో ఒకపెద్ద చర్చి శిఖరం కనబడింది. ఆశిఖరం మీద పాల రాతితో అందంగా మలచబడ్డ దేవదూతల విగ్రహాలు కనబడ్డాయి. రాజ భవనం మీదనించి ఎగురు తోంచే నాట్యవిన్యాసాలూ కనబడ్డాయి. పాటలు వినబడ్డాయి. బాల్కనీలోకి ప్రియుడితో కలసి ఒక అందమైన అమ్మాయి వచ్చింది. ప్రియుడు

"చూశావా ప్రియా! నక్షత్రాలు ఎలా మిల మిల మెరుస్తున్నాయో!! ప్రేమ ఎంత అద్భుతమైనదో?" అంటున్నాడు

"రేపటిరాజదర్బారులో విందు వినోదాల సమయానికి నేనుఆర్డరిచ్చిన "స్పెషల్‌గౌను తయారవుతుందోలేదో?" నేనుచాలా అందమైన పువ్వుల్ని అల్లమని చెప్పాను ఆగౌనుమీద. ఈ కుట్టుపని వాళ్ళున్నారే వాళ్ళు శుద్ధ బద్ధకస్తులు - ఒక డ్రెస్సూమనకి తృప్తిగా తయారు చేసి ఏడవరు" అంది అతని ప్రేమడైలాగులకు సమాధానంగా.

ఆ పిట్ట నది మీదుగా ఎగిరింది—ఓడ తెరచాప కొయ్యలమీద ఊగుతూ వ్రేలాడుతోన్న లాంతర్లను చూసింది. ఛాంబర్ ఆఫ్ కామర్స్ భవనం (ఘెట్టో అంటారు) మీంచి ఎగిరింది. అక్కడ యూదు వ్యాపారులు వ్యాపారపు లావాదేవీల్లో మునిగి తేలుతున్నారు, డబ్బుని రాగి త్రాసుల్లో తూచుకుంటూ లెక్కలు రాసుకుంటున్నారు. చిట్టచివరికి రాకుమారుడు చెప్పిన ఇల్లును కనుక్కోగలిగింది. వారి పేదరికం పిట్ట మనసుని కలచివేసింది. ఆ అబ్బాయి జ్వరముతో మెలికలు తిరిగి పోతున్నాడు. అలసి సొలసిన తల్లి అదమరచి నిద్రపోతోంది. పిట్టమెల్లిగా గెంతుకుంటూవెళ్ళి పడుకున్న ఆ తల్లి వ్రేలికి తొడుక్కునే టోపీపక్కగా జారవిడిచింది. జ్వరంతో బాధపడుతోన్న ఆ అబ్బాయి చుట్టూ రెక్కలు టపటపలాడిస్తూ గాలి తగిలేలా విసురుతూ ఎగిరింది.

"ఆహా ఎంత హాయిగా ఉంది ప్రాణం....జ్వరం తగ్గిపోయినట్టు అనిపిస్తోంది" అంటూ నిద్రలోకి జారుకున్నాడు ఆ అబ్బాయి.

చిన్నపిట్ట—తిరిగివచ్చి రాజకుమారుడితో జరిగిన విషయాన్ని సవిస్తరంగా చెప్పింది. "చలిగానేవున్నా—వెచ్చగా హాయిగా వుంది" అంది చిన్న పిట్ట....

"మంచి పనులుచేస్తే మనసుకి అలాగే హాయిగా వున్నట్టు అని పిస్తుంది" అన్నాడు రాకుమారుడు, చిన్నపిట్ట ఆలోచనలో పడింది, ఆలోచనలు నిద్రపట్టిస్తాయి, ఆ రాత్రికి హాయిగా నిద్రపోయింది చిన్నపిట్ట.

తెల్లవారిన తర్వాత లేచి నదికి వెళ్ళి హాయిగా స్నానం చేసింది. దానిని చూసిన ఒక జీవశాస్త్ర ఆచార్యుడు ఆ దారిన బ్రిడ్జీ మీంచి వెళ్తూ, ఈ పిట్టస్నాన దృశ్యాన్ని చూశాడు. "ఆహా ఏమి ఈ వింత? శీతాకాలంలో ఈ చిన్నపిట్ట ఇక్కడ వుండడం వింతకాక మరేమిటి?" అని ఈ వింత గురించి పేపర్లకి ప్రముఖంగా వార్త రాసి పంపించాడు, అన్ని పేపర్లూ దీన్ని ప్రముఖంగా ప్రచురించాయి, అయితే దీనివెనుక ఉన్న శాస్త్రనిబద్ధత ఏమిటో ఎవరికీ అర్థం కాలేదు.

"అయితే ఈ రాత్రి ఈజిప్టు బయల్దేరతాను" అని ఆనందంగా ఆ వూరంతా కలియజూసింది. ఈ పిట్టని పిచికలుచూసి కిచకిచ భాషలో "ఏమిటీ—కాలంగాని కాలంలో ఈ వింత ఆగంతకుడు?" అని ఒకళ్ళతో ఒకళ్ళు చెప్పుకున్నాయి.

రాత్రి రాకుమారుడి దగ్గరకు చేరుకున్న చిన్నపిట్ట.

"ఏమోయ్ రాకుమారా! ఈజిప్టులో ఎవరైనా తెలిసిన వాళ్ళకి నువ్వు పంపించదల్చుకున్న సందేశం ఉంటే చెప్పుకోవోయ్" నేను ఈ రోజు రాత్రే బయలుదేరుతున్నాను" అంది.

"పిట్టా! పిట్టా!! చిన్నపిట్టా!!!....మరొక్క రోజుకి నాతో వుండి పోవూ."

"నాయనా నీకో నమస్కారం....మా వాళ్ళు నా కోసం ఈజిప్టులో ఎదురు చూస్తూ వుంటారని చెప్పానా! ఈ వేళ మా వాళ్ళు జలపాతాలమీంచి

ఎగురుతాయయ్యా! మెమ్నాన్ దేవుడు బ్రహ్మాండమైన గ్రానైట్ సింహాసనం మీద ఆసీనుడై వుంటాడు. రాత్రి అంతా ఆయన నక్షత్రాలను గమనిస్తూంటాడు. తెల్లవారుఝాము నక్షత్రం కనబడగానే సంతోషంగా కేకలు వేస్తాడు. వెంటనే నిశ్శబ్దం అవుతాడు. మధ్యాహ్నం సమయంలో ఇసుక వర్ణపు సింహాలు నీరు త్రాగడానికి వస్తాయి. ఆకుపచ్చని కళ్ళతో అవి జలపాతపు హోరుతో పోటీగా సింహనాదాలు చేస్తూంటాయి.

"పిట్టా! పిట్టా!! చిన్నపిట్టా!!!....అలా చూడు ఈ నగరానికి చాలా దూరంగా నాకు ఒక యువకుడు కనబడుతున్నాడు. అతడు ఒక డెస్కు ముందు వాలి కూర్చునివున్నాడు. ఆతని ముందు కాగితాలు చిందరవందరగా పడివున్నాయి. అతని ప్రక్కనవున్న గాజుపాత్రలో వడలిపోయిన పూలున్నాయి. అతని జుట్టు మట్టికొట్టుకుపోయి చిందరవందగా వుంది. అతని పెదవులు ఎర్రగా దానిమ్మ గింజల రంగులో వున్నాయి. అతని కళ్ళు కలలు కంటున్నట్టు మత్తుగా వున్నాయి...."

"కవిత్వంలో పడ్డావన్నమాట....బాబూ నా ప్రాణాలు తియ్యక సూటిగ చెప్పదల్చుకున్నదేదో చెప్పు....నాది అసలే పిట్టతలకాయ"....

"అదే పాయింట్‌లోకే వస్తున్నా....ఒక థియేటర్ డైరక్టరుగారికి ఆ అబ్బాయి నాటకం రాస్తున్నాడు—దాన్ని పూర్తిచేసి అందించాలి....చలి విపరీతంగా ఉండడంచేత అతని కలం కదలడంలేదు. అతని ఫైర్‌ప్లేస్‌లో కట్టెలులేవు ఆకలితో నకనకలాడిపోతున్నాడు.

"ఓ యస్! ఈ రోజూ వుంటాను....మరో రత్నం పీకి అతనికి అందజేయమంటావా?"

"అయ్యో! నా బాకుపిడిలో మరో రత్నంలేదే...."

"మరి దారి?"

నా కళ్ళు ఇంద్ర నీలాలతో చేశారుగా....వాటిని ఇండియానించి వెయ్య సంవత్సరాల క్రితం తెప్పించారట! (చూశారా భారతదేశపు పూర్వపు ఔన్నత్యం) దాన్లో ఒకదాన్ని ఊడబెరికి ఆ అబ్బాయికి అందజేస్తే దానిని అమ్మి కట్టెలు కొనుక్కుంటాడు—తృప్తిగా భోజనం చేస్తాడు.

"నువ్వేం చెప్పినా నేనాపని చేయనుకాక చెయ్యను" అంది దృఢంగా పక్షి "ఏయే పక్షి!....ఇది ఒకప్పుడు నా రాజ్యం....నేను సర్వాంసహా చక్రవర్తిని....ఆ హోదాలో నిన్ను ఆజ్ఞాపిస్తున్నాను — చేస్తావా లేదా" అంటూ ఇంద్ర నీలాల్ని ఎర్ర చేశాడు. భయంతో వణికిపోలేదు కాని.... ఆయన దయార్ద్ర హృదయానికి విచలితమైంది, ఆ చిన్నారి పక్షి చిట్టి హృదయం, అందుకే మారుమాటాడకుండా "ఇంద్రనీలాన్ని" ఊడబెరికింది బరువెక్కిన హృదయంతో ఆ యువకుని నివాసానికి ఎగిరి వెళ్ళింది. అయితే గదిలో ప్రవేశించడం దానికో సమస్యకాలేదు. ఆ గది కప్పుమీద పెంకులూడి కన్నం ఓటి రెడీగా వుంది—పిడికెడు పిట్టకదా! సునాయాసంగా లోపల ప్రవేశించగలిగింది. పైగా ఆ అబ్బాయి నిరాశగా నిస్పృహతో, నీరసంతో, విరాసక్తంగా, అరచేతులతో, ముఖాన్ని కప్పుకుని మేజామీద బోర్లా తలపెట్టుకుని,కుర్చీలోకూర్చున్నాడు. అంచేత అతనికి ఈ పిట్టరాకని గమనించే, వినే స్థితిలో లేడు. అంచేత ఆ బుల్లిపిట్ట ఆ ఇంద్రనీలమణిని వడలిపోయిన పుష్పగుచ్ఛంలో గుచ్చి ఎగిరిపోయింది.

కొంతసేపటికి తేరుకుని ఆ ఇంద్రనీల మణిని చూసిన అబ్బాయి "ఓహో మనకీ అభిమానులున్నారన్నమాట" అనుకున్నాడు. "చూసుకో-ఇక నాతడాకా నా నాటకం చాలా అందంగా రాసేయగలను" అని ఆత్మవిశ్వాసంతో ఊపిరి పీల్చుకున్నాడు.

పగలంతా చేసేపనిలేక "పిట్ట" ఓడరేవుకి వెళ్ళింది. ఒక ఓడ తెరచాప కొయ్యమీద కూర్చుని-ఓడలోంచి పెద్ద పెద్ద బంగారం వెండి వున్న పెట్టెల్ని మోసుకు వెళుతూ సేదదీరడానికి "హైహో" అంటూ అరచే కార్మికుల్ని చూసి "శ్రమ ఒకరిది సోకు ఒకరిది" అనుకుని కన్నీళ్ళు పెట్టుకుంది.

అయితే వాళ్ళని ఎలా ఓదార్చాలో తెలియక "ఈరోజు రాత్రే నేను ఈజిప్ట్ వెళ్ళిపోతున్నానోయ్"అని "కూ"అని అరిచింది. అయితే ఈ బుల్లి పిట్ట-చేసిన ముఖ్యమైన ఎనౌన్స్‌మెంట్‌ని పట్టించుకునే తీరికా, ఓపికా, ఆసక్తీ ఎవరికీ లేవు. "నీకు గుడ్‌బై చెప్పడానికి వచ్చానోయ్ రాకుమారా" అంది. రాజకుమారుడి దగ్గిరికి తిరిగి వచ్చినప్పుడు—

ఇక చేసేదిలేక పిట్ట— రెండో కంట్లో ఉన్న ఇంద్రనీల మణిని పీకి నోట కరచి పట్టుకుని వెళ్ళి ఆ అమ్మాయి అరచేతిలో పడేటట్లు పడే సింది. ఈ రాయి ఎంత బాగుందో అని గెంతుకూంటూ ఇంటిలోకి పరి గెత్తింది. చిన్న పిట్ట వెంటనే ఎగిరిపోయి గ్రుడ్డివాడిగా మిగిలిపోయిన రాకుమారుని విగ్రహం దగ్గరికి వచ్చేసింది.

"అయ్యో.... కళ్ళు రెండూపోయాయి. నేను ఇంకెక్కడికీ వెళ్ళ నోయ్! శాశ్వతంగా ఇక్కడే వుండిపోతాను."

"ఒద్దు పిట్టా! ఒద్దు!! మీ దేశానికి వెళ్ళిపో .... ఈజిప్టులో మీవాళ్ల నీకోసం ఎదురు చూస్తూంటారు. .... వెళ్ళమ్మా....వెళ్ళు" అంది.

ఆ మర్నాడు పగలంతా రాజకుమారుని భుజంమీదే కూర్చుని- తాను ఏయే దేశాల్లో ఏయే వింతలు చూసిందో అవన్నీ కథలు కథలుగా చెప్ప సాగింది. నైలు నదిలో బంగారు రంగులో వున్న కింగ్ ఫిషర్ పిట్టలు నోళ్ళతో చేపపిల్లల్ని కరచుకుని అలలమీద గింగరాలు ఎలా కొడుతుం టాయో, ఈజిప్టు ఎడారులలో ఒడాయిలు ఒంటెలెక్కి ఎలా తిరుగుతుం టారో వర్ణించి చెప్పింది. ఆ దేశాన్ని పాలించే పర్వత చంద్రమహారాజు గారు తళతళా మెరిసే నల్లదంతంతో చేసిన బ్రహ్మాండమైన సింహాసనం మీద ఎలా వైభవోపేతంగా కొలువుతీర్చి కూర్చుంటాడో వర్ణించి చెప్ప సాగేది.

"నా ప్రియమైన చిట్టిపిట్టా! నువ్వు చాలా అందమైన, అద్భుతమైన విషయాల్ని చెపుతున్నావు సరే .... నా అనుభవంతో చెపుతున్నాను— విను. అన్నిటికన్న మహా అద్భుతమై— హృదయాల్ని కదిలించేది మరోటి వుంది. అది మనుష్యులుపడే జీవిత యాతనలు. అందుచేత దయ చేసి "ఈ గత వైభవ అధరామృతంలాంటి" అందమైన కబుర్లు ఆపి.... నా దేశంలో ఆకలితో, ఈతిబాధలతో అలమటించే జనుల కష్టాల్ని, బాధల్ని గురించి చెప్పు - ప్రతీ ఉదయం - ఊళ్ళో ఓ చెక్కరకొట్టి వచ్చి నాకు చెప్పవా, పిట్టా ప్లీజ్....ప్లీజ్!" అన్నాడు.

అంచేత ఈ బుల్లిపిట్ట— నిత్యకార్యక్రమంగా - రోజూ ఊరంతా చెక్కరకొట్టి రావడం - మిగతావేళల్లో ప్రజలుపడు బాధల్ని ....కష్టాల్ని, నష్టాల్ని గురించి కళ్ళులేని ఆ కబోది రాకుమారుడికి తను చూసినవి వివే దిస్తూ వుండేది. ఒక్కొక్క కష్టానికీ ఒక్కొక్క బంగారు రేకు చొప్పున పీకి పంచిపెట్టేసింది. బంగారు రేకులు దక్కిన కుటుంబాలన్నీ రెండు పూటలా భోజనంచేసి కొంతకాలమైన ఆనందంగా జీవించసాగారు.

క్రమక్రమంగా చలి తీవ్రత హెచ్చసాగింది - బంగారు రేకులు దక్కినవారు ఉన్నిబట్టలు కట్టుకుని - ఆత్మ విశ్వాసాన్ని పెంచుకుని జీవితంలో స్థిరపడి జీవితాన్ని ఆనందనందనంగా మార్చుకున్నారు- వాళ్ళ పిల్లలు కేరింతలు కొడుతూ స్కూళ్ళకి వెళ్ళడం ఆటలాడడం చేసేవారు.

చిన్నపిట్ట ఆకలేసినప్పుడల్లా రొట్టెల దుకాణాలికిపోయి అక్కడ రొట్టెల్ని చిదుపుకు తినేవాళ్ళ క్రింద రాల్చిన రొట్టెముక్కల్ని తిని తన "చిన్నిపొట్టకు శ్రీరామ రక్ష"గా జీవించసాగింది. తన శరీరాన్ని వెచ్చగా వుంచుకోవడానికి రెక్కలు టపటపలాడిస్తూ రొట్టెలు చేసే పొయ్యి చుట్టూ తిరిగేది. అయితే "జాతస్య.... ధృవం" కదా! అయినా విపరీతమైన చలికి ఈ బుల్లిపిట్ట తట్టుకోలేక పోతుంది. తనకి చివరి దశ వచ్చేసిన సంగతి దానికి తెలిసిపోయింది.—

"ఇంక వస్తానోయ్ నేస్తమా.... గుడ్ బై" అంది.

"అయితే నువ్వు ఈజిప్టు వెళ్ళిపోతున్నందుకు చాలా సంతోషంగా వుందోయ్ మిత్రమా!" అన్నాడు రాకుమారుడు.

"నే వెళ్ళేది ఈజిప్టు కాదు. "మరణం"గారని ఒకాయన వున్నా డులే.... ఆయన ఊరికి ప్రయాణమౌతున్నాను. ఆయన నిద్రగారికి తమ్ముడట కదా!" అంది చిన్నపిట్ట.... అంటూనే ఆ రాకుమారుణ్ని పెద వుల మీద ముద్దు పెట్టుకుంది... ముద్దు పెట్టుకుంటూనే హాయిగా అతని పాదాల మీదపడి కళ్ళుమూసి శాశ్వత నిద్రలోకి జారుకుంది.

సరిగ్గా అదే సమయానికి ఒక అద్భుతం జరిగింది. రాకుమారుని విగ్రహం పై నుంచి క్రిందిదాకా బీట పడింది. నిజానికి జరిగిందేమిటంటే ....రాకుమారుడి సీసపు గుండె భళ్ళని పగిలింది.

ఆ మరునాటి ఉదయమే ఆ నగరపు మేయర్‌గారు తన కౌన్సిలర్లతో కలిసి నగరంలోని పారిశుధ్య పరిస్థితిని గమనించడానికి బయలుదేరారు. అయితే కౌన్సిలర్స్ అందరూ నగర మేయర్‌గారి ప్రతీమాటకీ "భళాభళి- తానతందనాన- ఔనుసర్! మీరన్నది నిజం సర్" అనే పార్టీ అనుయాయులే, ఈ విగ్రహాన్ని చూస్తూనే "అబ్బా ఈ విగ్రహం ఎంత రోతగా వుంది" అనేశారు మేయర్ మహాశయులు—

షరామామూలే "భళాభళి ....తానతందానాన............" వగైరా వగైరా అనేశారు కౌన్సిలర్లు.

"ఈ బాకులో రత్నం లేదు - కళ్ళల్లో - ఇంద్రనీలాలు లేవు - బంగారపు రేకులన్నీ ఊడిపోయాయి...." ఇదేదో విదేశీకుట్ర కావచ్చు ...." అన్నాడు మేయర్ సర్.

మళ్ళీ "భళాభళీ.... వగైరాలు మామూలే.

"ముష్టివాడి కంటే కొంచెం నయంకదూ"

"అవును సర్! ....భళాభళి"

"అరె! ఈ కాలి దగ్గర ఈ చచ్చిపోయిన పిట్ట పడివుండడం— మరీ అసహ్యంగా వుంది కదూ"

"భళాభళీసర్...."

"అందుకనే మనం రేపే కౌన్సిల్‌లో ఓ తీర్మానం చేద్దాం - పిట్టలు విగ్రహాల దగ్గిర చావరాదు అని" మేయర్‌గారు క్యాంప్ క్లర్క్‌కేసి తిరిగారు.

క్లర్కు మేయర్‌గారి పాయింట్‌ని నోట్ చేసుకున్నాడు డైరీలో.

ఈ విగ్రహాన్ని పీకేయమని ఆజ్ఞను జారీచేశారు. విగ్రహం కూల్చబడింది.

"మళ్ళీ రిపేరు చేయించడం దండగ-కరిగించెయ్యాల్సిందే"

"భళాభళి సర్"

విగ్రహాలు నిజానికి శనిగ్రహాలు వాటివల్ల పోతున్న మనుష్యుల నిగ్రహాలు........అందుకే కలుగుతున్నవి ఆగ్రహాలు...."అంటూ కవితవిరాశాడు ఓ యూనివర్శిటీలోని అధ్యాపకమహాశయుడు. యూనివర్శిటీలో ఆతడుపురావస్తు శాస్త్రాన్ని బోధిస్తాడు....కాళీటైములో ఏమోషనల్‌గా కవిత్వాన్ని వెలగబెడుతూంటాడు.

విగ్రహాన్ని కొలిమిలో వేసి కరగబెట్టాడు కమ్మరి....అంతా కరిగిపోయింది. కాని ఎంచేతో దాని గుండెకాయమాత్రం ఎంత మంటబెట్టినా కరగటంలేదు. అంచేత, విసుగెత్తి దాన్ని పెంటకుప్పమీద పారేశాడు. ఆ పెంటకుప్పమీదే చచ్చిపోయిన బుల్లిపిట్ట వుంది.

మరునాడు కౌన్సిల్ సమావేశంలో ఓ తీర్మానాన్ని ఇలా ప్రతిపాదించారు. "పీకేసిన విగ్రహం ఉన్న చోటులో నా విగ్రహం వుంచవలెను....."

"భళాభళి....యస్ సర్...." నా విగ్రహం వుండవలెను" అదే సబబు అని కౌన్సిలర్లందరూ ఆపాయింట్‌మీద పేపరు వెయిట్లు విసురుకున్నారు....కాగితాలు చింపుకున్నారు. అరచారు....గీపెట్టారు....కౌన్సిల్ రణరంగంగా మారింది.

..................................................

స్వర్గంలో దేవుడికి ఓ చిత్రమయిన ఆలోచన వచ్చింది.

"ఓ నా దేవదూతలారా! ప్రపంచంలో రెండు అపురూపమైన, అపూర్వమైన, రెండు వస్తువులను నాకు కానుకగ తెండి" అని ఆదేశించాడు.

దేవదూతలు తిరిగి తిరిగి....పెంటకుప్పమీద పడివున్న కరగని విగ్రహపు గుండెముక్కల్ని—ఆ గుండెనే అంటిపెట్టుకుని పడివున్న పిట్ట మృతదేహాన్ని దేవుడికి కానుకగా పట్టుకెళ్ళేరు.

"భళా మీ ఎన్నిక బ్రహ్మాండంగా వుంది" అని మెచ్చుకున్నాడు భగవాన్.

"ఓ రాకుమారా....నువ్వు నా ప్రక్కనే కూర్చుని నన్ను నీ పాటలతో అలరించు....నీ ప్రియాతి ప్రియమయిన ఈ చిన్నపిట్ట నా తోటలో హాయిగా విహరిస్తూ స్వేచ్ఛగా కూస్తూంటుంది" అని వరాలను ప్రసాదించాడు.

మరి దేవుడంటే ఏమిటనుకున్నారు ?

—o—

# 4. సర్వజ్ఞ శిఖామణి

## (Mr. KNOW-ALL)

### సోమర్సెట్ మాం-గ్రేట్ బ్రిటన్

(చిన్న కథాకథన చక్రవర్తిగా సోమర్సెట్ మాం ప్రసిద్ధుడు-చిన్న కథ ఏమిటి అనేది నిర్వచనాలకులొంగే ప్రక్రియకాదు. చిన్నకథ ఈ ఉద్దేశ్యంతోనే రాయాలని నియమమూలేదు. కథ ఉద్దేశ్యం నీతిబోధ కావచ్చు. కొసమెరుపుతో పఠితల్ని ఆశ్చర్యచకితుల్ని చెయ్యడం కావచ్చు. ఒక జోక్ని పొడిగించడం కావచ్చు....అతి చిన్నచిన్న కథగా ప్రసిద్ధమైనఒక కథని చెప్పనా?

"నాకు దెయ్యాలంటే నమ్మకంలేదు" అన్నాడు ఒకడు.

"నాకూ లేదు" అన్నాడు వెనకాల నున్నవాడు.

మొదటివాడు వెనక్కి తిరిగిచూశాడు. వెనకాల ఎవ్వరూలేరు. ఇది ఎందుకు కథైందో-కథకుండవలసిన లక్షణాలన్నీ దీనికి వున్నాయోలేదో-మీ నిర్ణయానికే వదిలేస్తున్నాను. కథకి ఉండవలసిన లక్షణం పఠితల్ని పట్టివుంచడమే....అంటే కథావిధానమే కాని-దాన్లో సరుకు (వుంటే మరీ మంచిది)....ముఖ్యాతి ముఖ్యంకాదు—॥అను॥)

మేక్స్ కెలడా మహాశయుణ్ణి, అతనెవరో నాకు తెలియకముందే, ఏవగించుకోవడం మీకు ఆశ్చర్యం కలిగించవచ్చు. అవి అప్పుడప్పుడే యుద్ధం ముగిసిన రోజులు. అందుచేత ఓడప్రయాణాల్లోకూడా—జనంతొడతొక్కిడిగా ప్రయాణంచేసే పరిస్థితి ఏర్పడింది. మామూలురోజుల్లోఅయితే ఒక్కొక్క ప్రయాణీకుడికి ఒక్కొక్క ప్రత్యేకమయిన గదిలాటిదాన్ని ఓడ ప్రయాణాల్లో కేటాయిస్తారు. కాని మరి రద్దీనిబట్టి ఇద్దరు ప్రయాణీకులు ఒకే కూపేలో ప్రయాణం చేయడానికి సిద్ధపడాల్సి వుంటుంది. పైగా మనం కోరుకునేవారే మన కూపేలో మనతో ప్రయాణంచేసే సదుపాయమూలేదు. అసలేదో దొరికిందనేదానికే మనం తృప్తిపడాలి" మేక్స్ కెలడా-నీతో నీ గదిలో ప్రయాణిస్తున్నాడు" అని వినగానే అతనెవరో

ఎరగకపోయినా—అతనంటే వైముఖ్యం కలిగింది.....ఎందుకంటే ఏం చెప్పను? అది అంతే—నా మనస్సు కృంగిపోయింది. గది అన్ని తలుపులూ బిగించి ఊపిరిఆడనంత ఉక్కిరిబిక్కిరి అయింది. (అతనలా చేశాడని కాదు-అలా చేస్తే ఎలా వుంటుంటో అనే మనస్థితిలో వున్నాడు కథకుడు అని అర్థం) ఇతనితో పద్నాలుగురోజులు కలిసి ప్రయాణించాలంటే చాలా కష్టమే మరి... అతనిపేరు ఏస్మిత్తో, బ్రౌనో అయితే ఇష్టపడి వుందునేమో!....కెలడాగారి సామాను నేను ఓకె ఎక్కేసరికే అక్కడ వుంది. ఇది కెలడాగారి సామానంది అని చెప్పగానే అటు చూడ్డానికి బుద్ధి పుట్టలేదు....అయితే ప్రతి పెట్టెమీదా "కెలడా కెలడా" అని తెగ లేబుల్సు అంటించేసివున్నాయి. పెద్దపెద్ద ట్రంకుపెట్టెలు, బట్టల స్టాండులు....ఓ దేశం మరో దేశానికి తరలించుకు పోతోన్నట్టు అనిపించిందే తప్ప ఒక వ్యక్తి ప్రయాణం చేస్తోన్నట్టు అనిపించడంలేదు.

నేను గదిలోకి వెళ్ళగానే ఆ గదినిండా కెలడాగారికి సంబంధించిన సెంట్లతోనూ ఆయన రకరకాల దువ్వెనలతోటి, బూట్స్‌తోటి, పాలిష్ డబ్బాలతోటి కిటకిటలాడిపోతూ స్వాగతమిచ్చింది. ఇక ఈ గదిలో కూర్చున్నకొద్దీ అసహనం పెరిగిపోయి—స్మోకింగ్ గదిలోకి (పొగ త్రాగడం కోసము ఏర్పడ్డ ప్రత్యేకమైన గది) వెళ్ళి పేక దస్త్రాన్ని తీసి 'పేషెన్స్' ఆడుకోవడము ప్రారంభించాను. నా ఆట ప్రారంభము అయిందో లేదో "మహానుభావుడు" ప్రత్యక్షమయ్యాడు.

"హలో! మీరేనా ఫలానా....ఫలానా....నా పేరే కెలడా" అంటూ షేక్‌హ్యాండ్ ఇచ్చేశాడు పళ్ళికిలిస్తూ.

"ఓహో మనిద్దరిదీ ఒకే క్యాబిన్ అనుకుంటానే" అన్నాను అసహాయంగా.

"అది నిజంగా అదృష్టమే అనుకోండి (నాతో తను ప్రయాణం చెయ్యడం కాదట! తనతో నేను ప్రయాణం చెయ్యడం అట!)—బహుశః మీకెరగరు....మీరు ప్రయాణం చేసేది ఎంతటి గొప్పవాడితోనో....నాతోటి

ప్రయాణీకుడు కూడా ఇంగ్లీషు దొరగారే అని వినగానే చాలా ఆనందం కలిగింది. "ఏదేశమేగినా ఏ ఓడలో ప్రయాణించినా....ఇంగ్లీషు వారంతా కలసి మెలగాలి" అనేదే నా సిద్ధాంతము "నా ఉద్దేశ్యం మీకు అర్థమైనట్టు లేదు...."

గుడ్లు మిటకరించి "మీరింతకీ ఉద్ధరించడానికి ఉద్భవించిన మహా మహితాత్ములన్నమాట" అన్నట్టు చూశాను. చూడ్డమేమిటి పొరపాటున అనేశానేమో కూడా.

"అవునుసర్! అయితే నన్ను చూసిన వాళ్ళంతా నన్ను అమెరికన్‌నని పొరబడుతుంటారు." అమెరికన్‌లా కనబడటం ఏదో ఘనకార్యం అయి నట్టు....నేను ఆయనగారు ఇంగ్లీషువాడు కాడని అనుమానిస్తున్నానేమో అన్నట్టు తన ప్యాస్‌పోర్టు జేబులోంచి తీసి నా కళ్ళముందు ఇటూ అటూ ఇటూ ఊపుతూ చూపించాడు. (ఎవరేనా పరధ్యాన్నంగా కూర్చున్నప్పుడు-నిద్రపోతున్నావా మెలకువగా ఉన్నావా అన్నట్టు మనము అరచేతినిచాచి కళ్ళ ముందుపెట్టి ఇటూ అటూ ఊపుతాం చూడండి సరిగ్గా అలాగన్న మాట).

జార్జిరాజుగారి (ఆ రోజుల్లో ఇంగ్లండ్ రాజుగారి పేరు) ప్రజల వేషాలు "వెర్రికి వెయ్యి విధాలు" అన్నట్టు వుంటాయి—కెలడా ఒక విల క్షణమైన వ్యక్తి. పొట్టిగా వుంటాడు. స్థూలకాయం, నున్నగా గీసుకున్న గెడ్డం. నలుపుదేరిన ఎర్రచర్మం. మెరుస్తోన్న కళ్ళు—వెనక్కి దువ్వు కున్న నల్లటి ఉంగరాల జుత్తు, ధారాళంగా మాట్లాడేస్తున్నాడు. అయితే మాటలప్పుడు తప్ప అందులో ఇంగ్లీషువారి లక్షణాలు మచ్చుకైనా కన బడవు. నా అనుమానం అతడు ప్యాస్‌పోర్టులో చూపిన దానికంటే విలక్షణ మైన మరీ ముదురు నీలపు ఆకాశం క్రింద జన్మించాడేమోనని. (దొంగ ప్యాస్‌పోర్టేమోనని) అనుమానం అన్నమాట.

"ఏం తీసుకుందాం?" అని అడిగేడు.

నేను విత్తరుణ్నయి—నిర్ఘాంతపోయి చూశాను — ఎందుకంటే

అప్పుడు (ఇప్పుడు మనకున్నట్టే) అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో మద్య పాన నిషేధం అమలులో వుంది. దాహంలేనివాడికి ఏ ద్రవమైనా రుచి ఒక్కటే కదా!—అది అల్లపు రసమా? నిమ్మరసమా? బత్తాయిరసమా? అనేది ముఖ్యంకాదు. నా స్థితి గమనించినట్టున్నాడు కెలడా – అందుకే ఓ చిరునవ్వుని నా మీద విసిరేసి—డ్రైమార్టిన్ — సోడా కలిపిగాని విస్కీతో సోడాగాని....ఏదో ఒక్కటి చెప్పెయ్ చాలు" అన్నాడు. ఎక్కడ సంపాదించాడోగాని రెండు జేబుల్లోంచీ రెండు సీసాలు పైకి తీశాడు. ఒక ఐస్ ఫ్లాస్క్ రెండు గ్లాసులూ తెమ్మని వెయిటర్‌కి చెప్పాడు.

"ఓ! మంచి కాక్ టైల్ తయారయేలా వుందే!" అన్నాన్నేను.

"అబ్బే ఇవేనేంటి—నా దగ్గర ప్రపంచంలో — ఎన్ని రకాల డ్రింకులు వున్నాయో....అన్ని రకాలూ రెడీ స్టాక్‌లో వుంటాయి—ఓడ ప్రయాణీకుల్లో ఎవరికేనా ఏమైనా కావలిస్తే—వాళ్ళకి చెప్పు .... ఇక్కడ ఎవరికేం కావలిస్తే అది సప్లై చెయ్యడానికి ఈ కెలడా వున్నాడని"వాగుడు, వాగుడు, ఒకటే వాగుడు—మాట్లాడ్డానికి అతనికి విసుగనిపిస్తోందో లేదో కాని....వినే నాకు మాత్రం చిర్రెత్తు కొస్తోంది. న్యూయార్క్ గొడవలు, శాన్‌ఫ్రాన్సిస్కో వింతలు, నాటకాల్లో విశేషాలు, సినిమాలూ, రాజకీయాలు ఒకటేనన్నమాటేమిటి? పైగా దేశభక్తిమీద లెక్చర్లు—నిజానికి యూని యన్ జాక్ (బ్రిటిష్ ప్రభువుల జండా)లాటి అందమైన జండాయే. అయితే బీరూట్‌లోనో అలెగ్జాండ్రియాలోనో....అక్కడ వుండే స్థానికుడెవరేనా దాన్ని ఆవిష్కరిస్తోంటే దాని అందానికి వన్నెతగ్గినట్లు దేశభక్తిని గురించి కెలడా దొరగారు లెక్చరిస్తోంటే నాకు సరిగ్గా అలాటి ఏవగింపు కలిగింది. నా పేరును అపరిచితుడైన వాడెవడేనా అమర్యాదగా "సర్" అనో "గారూ" అనో చేర్చకుండా "ఏమోయ్" అన్నట్టుగా పిలిస్తే నాకు ఇష్టం వుండదు. ఒళ్ళంతా చీమలూ, జెర్రులూ పాకినట్టు అనిపిస్తుంది. అతిగాడికి

అలాటి పట్టింపులు ఏవీ వున్నట్టు లేవు—ఇంకో గంట మాట్లాడితే "ఒరేయ్" స్థాయిని కూడా దాటిపోయి "ల"కార ప్రయోగంలోకికూడా దిగిపోతాడేమోనని అనిపిస్తోంది. కెలడా అంటే నాకు చచ్చేంత ఏవగింపు కలుగుతోందన్న యధార్థాన్ని నేను దాచుకోలేను. అదే అదే పేక దస్తారిన్ని బొత్తిపెట్టి, పెట్టెలో తిరిగి పెట్టేసి జేబులో వేసుకుంటే చాలు నేనతనిపట్ల గల ఏహ్యభావాన్ని తెలియజెప్పడానికి, అయితే అది అతనిమీద పనిచేసే ట్రిక్కుకాదని స్పష్ట పడడంతో—నా ఆటనికొనసాగిస్తేనే సరిపోతుందని, ఆ పనికి ఉపక్రమించాను.

"ఆ! ఆ మూడుమీద నాలుగు వెయ్యి" అంటూ తనంతట తానే సూచనలివ్వడానికి దిగిపోయాడు.

"పేషెన్స్" అనే ఆట ఎవరికి వారు మనశ్శాంతికోసం రిలాక్సింగ్గా ఆడుకునే ఆట. దీన్లో గెలుపు ఓటముల ప్రశ్నగాని, తొందరగా గేమ్ ముగిసిపోవాలనే నిబంధనలు గాని లేవు - ఇది కేవలం కాలక్షేపం ఆట. దీన్లో పిలవనిపేరంటంగా ఎవరేనా వేలుపెడితే ఎలా వుంటుందో నేచెప్పక్కర్లేదని అనుకుంటాను. పైగా ఒక్కొక్క కార్డు తిప్పినప్పుడల్లా "వచ్చేస్తోంది.! వచ్చేస్తోంది - మనక్కావలసిన పేకముక్క - క్విక్ - క్విక్" అంటూ కేరింతాలు కొడుతున్నాడు. సభ్యత అన్నది అడ్డురాకపోతే గూబ్బద్దలు కొట్టాలని అనిపించేటంత జుగుప్సాకరంగా వుంది - అతని ప్రవర్తన. బొత్తిగా సభ్యత వున్న ఇంగ్లీషు వాణ్ణి కావడం - ఎంతటి దౌర్భాగ్యమో ఇప్పుడు నాకర్థమైంది. మొత్తానికి "పేషెన్స్" ఆట నా "ఇంపేషెన్స్"తో ముగిసింది - నేనుపేక దొంతరని జేబులో వేసుకునే ప్రయత్నం చేస్తూండగానే - చనువుగా పేక దొంతరని దొరక పుచ్చుకున్నాడు.

"నీకు పేకమేజిక్కులు ఇష్టమేనా?" అన్నాడు.

"అవి అంటే నాకు పరమ అసహ్యం" అన్నాను - ఆయనగారు నా జవాబుని వింటేకదా!- విన్నా పట్టించుకుంటే కదా.

"ఈ పేకతో నేచేసే మేజిక్కు చూడు" అన్నాడు.

ఓ "మూడు" ముక్కని తీశాడు.

"భోజనం టైం అయింది - మళ్ళీ సీట్లు కాళీవుంటాయో లేదో నే వెళ్ళాలి" అన్నాను.

"అబ్బే-మరేంపర్లేదు-మనిద్దరికీ రెండు సీట్లు ముందే రిజర్వు చేసి వుంచాను - డోంట్ వర్రీ" అన్నాడు

బాబోయ్-వీడంటే నాకు అసహ్యత మరీ పెరిగిపోతోంది. అయినా ....ఇది భగవంతుడి లీలకాకపోతే మరేమిటి? (మాం-కి భగవంతుడంటే నమ్మకంలేదు- ఈ వాక్యం అనువాదకుని స్వేచ్ఛకు నిదర్శనం) ఇష్టంలేని వాడితో ఒకే క్యాబిన్‌లో పధ్నాలుగు రోజుల సహజీవనం - ముప్పూటలా ఒకే టేబుల్ దగ్గర భోజనం పైగా నేను ఎక్కడ తిరుగుతోన్నా "నక్షత్ర కుడిలా" వెంటపడుతూండడం - ఈ బాధ ఎవరితో చెప్పుకోను? అతడిబారి నుండి నన్ను కాపాడే వాడులేరని తేలిపోయింది. నన్ను వీడు అసహ్యించు చుకున్నాడన్న సంగతిని - అతగాడు పట్టించుకునే స్థితిలోలేడు. మూడ్రో జుల్లో అందరికీ ఇతగాడు తెలిసిపోయాడు. అన్నీ తనై విజృంభించాడు. పారిశుద్ధపు పనిని తనికీచేసే బాధ్యత తనమీదే వేసుకున్నాడు, వేలంపాటలు వేసే కార్యక్రమాన్ని నిర్వహించాడు. క్రీడోత్సవాలు, సాంస్కృతిక కార్యక్రమాలు, ఫేన్సీడ్రస్సులు, ఓహ్! ఒకటేమిటి.... తన విరాట్స్వ రూపంతో విజృంభించాడు - అయితే ఇతని ధోరణికి ప్రతి ఒక్కడూ అతన్ని చూసి చికాకుపడేవారు, అయితే ఇవన్నీ అతని విషయంలో దున్నపోతు మీద వానచినుకులే-అతని సర్వజ్ఞశిఖామణి గారు అని పేరు పెట్టేరు - అలాగే పిలుస్తూండేవారు. అది కూడా తనకి ఆదాయపు ఖాతా లోనే జమ వేసుకున్నాడు. భోజనం టేబుల్ దగ్గర అతని ప్రవర్తన మరీ ఏవగింపుగా వుండేది. అతని నిద్రసమయంలో మాత్రం కొంచెం ఓడలో వాళ్ళకి ప్రశాంతత కలిగేది. సదా - హృదయ పూర్వకంగానే, సరదాగా, అతివాగుడు వాగుతూండేవాడు అన్నివిషయలూ తనకి తెలుసు అంటూండే

వాడు. వాదనకి దిగితే మొండిగా వాదించి ఎడ్డెం అంటే తెడ్డెం అంటూండే వాడు - అన్నీ నాకే తెలుసుననే అతని ఆత్మవిశ్వాసం ఎంతవరకూ పోయిదంటే - "నీకేం తెలుసు?" అని అంటే అతని అహందెబ్బ తినేది. ఎంత పనికి మాలిన - పసలేని విషయాన్నయినా - తెగవాదించి తనదే పై చెయ్యి అనిపించుకునే దాకా వదిలేవాడు కాదు. ఒక్కొక్కప్పుడు ఓడలో వుండే డాక్టర్‌గారి టేబిల్ దగ్గర ఆయన దగ్గర ఆయన స్థానంలో కూర్చుని మందులు కూడా ఇచ్చేవాడు.

డాక్టరు గారు పరమ బద్ధకస్థుడు. అంచేత ఆయన కెలడాకే తన పనిని వప్పగించి హాయిగా రెస్టు తీసుకుంటూండేవాడు. నాకు ఓడ మొత్తం మీద నచ్చిన వ్యక్తి "రాంసే" అని అమెరికన్ రాయబార కార్యాలయానికి చెందిన ఉద్యోగి- అతగాడు ఓ ఏడాది పాటు భార్యని స్వగ్రామంలో వది లేసి ఫారిన్ సర్వీస్‌లో గడిపి - ఇప్పుడు భార్యని తీసుకుని ఉద్యోగం చేసేచోటికి ప్రయాణమై వెడుతున్నాడు. వెళ్ళేటప్పుడు విమానంలో వెళ్ళినా తిరుగు ప్రయాణంలో భార్యతో కలిసి ఓడ ప్రయాణం చేస్తున్నాడు. చాలా రిజర్వ్ టైపు పెద్దమనిషి - అయితే అతనిలో మాట చమత్కారం, సుని శితమైన హాస్యం, చక్కటి ప్రవర్తనా ప్రస్ఫుట మౌతూ వుండేవి. అయితే అతనికి జీతభత్యాల ద్వారా వచ్చేరాబడి అంతంత మాత్రమే (నట), అయితే ఉన్న దుస్తుల్నే హుందాగా ధరించేది ఆయన భార్య. చూడగానే చూపర్లను ఆకట్టుకునే విలక్షణమైన అందం ఆమె సొత్తులాతోస్తోంది. అం దరి స్త్రీలలాగే అడుగడుగునా స్త్రీత్వం ఉట్టిపడుతుండేది. అంతకు మించి నది ఆమెలోని సౌశీల్యం. ఇంతేందుకు ఆమెనూ, ఆమె భర్తనూ కలిపి చూస్తే ఆమె అతని కోటు బొత్తాము స్థానంలో అమర్చిన అందమైన గులాబీపువ్వును తలపింపజేసేది.

ఒకనాటి సాయంకాలం నలుగురం కూర్చుని సరదాగా మాట్లాడు కుంటోంటే ప్రస్తావన ఒక విషయంలోంచి మరో విషయంలోకి మారుతూ "మంచి ముత్యాల విషయంలోకి" మారింది - జపాన్ వాళ్ళు ప్రపంచం వ్యాపార రంగంలో ప్రవేశపెట్టిన ఇమిటేషన్ ముత్యాలమీద చర్చిస్తు న్నారు. మామూలే కదా కెలడా మహాశయుడు రంగంలోకి దిగేడు - లెఫ్ట్

అండ్ రైట్ — ముత్యాల గురించి తెగవాగడం ప్రారంభించాడు. ఏదో సరదాగా మొదలెట్టిన విషయం కాస్తా ఉద్రిక్త స్థాయికి చేరుకుంది. టేబుల్ని గట్టిగా గుద్ది మరీ వాదించసాగేడు. ఇంతకీ అతనిని అంతగా ఉద్రేకపరచింది రాంసే చేసిన ఒక వ్యాఖ్యానం.

"నేనేం మాట్లాడుతున్నానో పూర్తి స్పృహలో వుండే మాట్లాడుతున్నాను. బహుశః మీకు తెలియదేమో! నేను ఇప్పుడు ముత్యాలవ్యాపారం మీదే జపాన్-వెడుతున్నాను. ముత్యాలను గురించి నాకన్న ఎక్కువ తెలిసిన వారు ఈ ఓడమీద మరి ఒకరు వుండే అవకాశం లేదు. ప్రపంచంలో ఏ ముత్యానికి ఎంత విలువో నాకు తెలుసు అంచేత నాతో ముత్యాలగురించి వాదించబోకండి" అన్నాడు కెలడా ఫైనల్గా.

ఇక్కడ అతనికి ఏం తెలుసన్న విషయం కన్నా ముఖ్యమైనది- అతని వ్యాపారం ఏమిటన్న చిక్కుముడి విడిపోయింది. ఇది నిజంగా వార్తే మరి! "ఏ ముత్యం ఎంత విలువైనదో కళ్లుమూసుకు చెప్పగలను" అంటూ శ్రీమతి రాంసే మెళ్ళో ఉన్న ముత్యాల నెక్లెస్ను చూపిస్తూ "ఆ ముత్యాలదంత విలువ....నే చెప్పిందానికన్నా ఒక సెంటు తక్కువ అని ఎవరేనా నిరూపించగలిగితే...." అన్నాడు మన సర్వజ్ఞ సింగ భూపాలుడుగారు.

రాంసే భార్య సిగ్గుపడి ఆ నెక్లెస్ని పైకి కనపడకుండా గౌనుచాటున దాచుకుంది. అయితే కెలడా దృఢంగా అన్నాడు- "అవి చాలా విలువైన ముత్యాలు...."

"ఔను....నిజం ఔను నిజం, నీవన్నది నిజం నిజం!" అన్నాడు కవితాధోరణిలో....రాంసే.

"బాబూ ముత్యాల ప్రజ్ఞానిధీ....అవెన్ని వేల డాలర్లు ఖరీదుంటాయో చెప్పు చూద్దాం...." అన్నాడు వెటకారంగా.

"అవేనా....పదిహేను వేల డాలర్లకు తక్కువగా వుండవు-మోజు పడినవాళ్ళు వాటికి ముప్పైవేల డాలర్లు ఇవ్వడానికి సిద్ధపడతారు" అన్నాడు

రాంసేకి నవ్వు ఆగలేదు. ఘొల్లుమని నవ్వేశాడు. కెలడా చిన్నబుచ్చుకున్నాడు.

"ఏం నవ్వుతావు? దాన్లో పొదగడానికి ఉపయోగించిన తీగ కూడా చాలా విలువైనదే"

"పందెం కాస్తావా? అవి నకిలీ ముత్యాలు-పాపం ఓడిపోయావ్" అన్నాడు రాంసే.

"ఓ ఎంత పడితే అంత పందెం-అవి అసలుసిసలైన ఆణిముత్యాలు ....నాకు తేరగా పందెం రూపంలో డబ్బువస్తే....వదులుకునే మూర్ఖుణ్ని అనుకున్నావా?"

"ఎలా విరూపిస్తావోయ్-నా భర్త చెప్పిందేరైటు....నేను నా స్వహస్తాలతో కొన్నవి....నేను చెపుతున్నాగా....అవి నకిలీ ముత్యాలే" అంది రాంసే భార్య.

"పందెం పందెమే తల్లీ. ఓసారి బయటకి తీసి నా చేతిలో పడెయ్-నేను పరీక్షించి వెంటనే తేల్చి చెప్పేస్తాను"

రాంసే భార్యకి ఈ రసభాస చికాకనిపించింది....వేళాకోళం కాస్త శ్రీకాకుళం చేస్తాడేమిటి-సభ్యత లేకుండా అని విసుక్కుంది.

"కొక్కెం బాగా బిగిసిపోయింది-అది ఊడదియ్యడం చాలాకష్టం" అంది

"మరేం ఇబ్బందిలేదు-నేను ఊడదీస్తాగా డియర్-" అంటూ రాంసే గట్టిగా బిగుసుకున్న కొక్కాన్ని బలవంతంగా ఊడబీకి కెలడా చేతిలో వుంచాడు.

కెలడా జేబులోంచి అప్పటికప్పుడే ఒక భూతద్దాన్ని తీసి రెడీగా పట్టుకున్నాడు. అతని ముఖం చిరునవ్వుతో వెలిగింది. అందరి ముఖాలకేసీ విజయగర్వంతో చూశాడు నెక్లెస్ తిరిగి ఇచ్చేశాడు. ఇచ్చేటప్పుడు రాంసే సతీమణి ముఖంవైపు చూశాడు....వేల విలువ చేసేలా కనిపించే ఈ చవక బారు నెక్లెస్-బండారం బయట పడిపోయినందుకు కాబోలు ఆమె సిగ్గుతో ముడుచుకుపోయింది. కెలడా మారుమాట్లాడకుండా "ఒప్పుకున్నాను-నేనే ఓడిపోయాను....ఐయాం సారీ శ్రీమతి రాంసే....మీ నెక్లెస్‌ని ఊడదీయించి మీకు పదిమందిలో ఇబ్బంది కలిగించాను....క్షమించండి" అని అంటూ పందెం కాసిన వందరూపాయల డాలర్ల నోటుని అందించాడు

రాంసేగారికి. అయితే వంద గోవిందా అయినందుకు చేతులు వణకడం స్పష్టంగా కనిపించింది. "ఇంతకీ దాని విలువ ఎంత నిర్ణయించావు?" అన్నాడు రాంపే విజయ గర్వంతో.

"అది పదిహేను పద్దెనిమిది డాలర్ల మధ్య వుంటుంది. ఏ పరిస్థితి లోనూ పద్దెనిమిది డాలర్లను మించి ఒక్క సెంటు అధికంగా విలువ చెయ్యవు అన్నాడు. వందడాలర్లు "గోవిందా హరి" అన్నమాట.... బహుశః మేం ఓడ ఎక్కినంతర్వాత కెలాడాకి ఘోర అవమానం జరిగింది ఈ ఒక్క సందర్భంలోనే-చెప్పద్దూ నాకు మాత్రం లోపల లోపల మహా దానందంగా వుంది. రాంసే భార్య తలనొప్పిగా వుందనడంతో ఆ పూటకి ఎవరి గదుల్లోకి వాళ్ళం చేరుకున్నాం.

ఆ మర్నాడు ఉదయం నేను సబ్బు పట్టించి గడ్డం గోక్కునే కార్య క్రమంలో వున్నాను. కెలడా విలాసంగా సిగరెట్ కాలుస్తూ మంచంమీద తలగడామీద ఆనుకుని విలాసంగా కూర్చుని వున్నాడు. ఈలోగా తలుపు సందు దగ్గర ఏదో గరగర శబ్దం ...నేనే తలుపుదాకా వెళ్ళేను-ఒక కాగి తపు కవర్ సందులోంచి లోపలకు తోయబడుతోంది-నేనే దానిని అందు కుని-దానిమీద "కెలడా"కి అని రాసి వుండడం గమనించి-కెలడాకి అందిం చాను-కెలడా కవర్ని చింపి చూశాడు-వాన్లో లెటర్లాటిది ఏదీలేదు-ఒక వంద డాలర్లనోట్ని మాత్రం జేబులో వేసుకున్నాడు అతని ధోరణి నాకు అర్థం కాలేదు.

"ముందు ఆ ముక్కల్ని బయట పారేయ్" అన్నాడు నాకు అందిస్తూ

"అసలా వంద డాలర్లు నీకెవరు అందించారు?....ఆ ముత్యాల బాపతా?...."

"యస్....అవును....జీహా....అందమైన భార్యను న్యూయార్క్ లాటి మహా నగరంలో వదలి....మారుమూల ప్రదేశాల్లో వుద్యోగాలు చేస్తే కలిగే అనర్థానికి....ఈ విలువైన "వజ్రాల నెక్లెస్ ఉదంతం" కనువిప్పు కావాలి అన్నాడు మన సర్వజ్ఞ శిఖామణి....అసలు కథేమిటో తెలివైన పాఠకులకే వదిలేద్దాం..............................................

—0—

# 5. ధనమేరా ఈ జగతికి మూలం

## (THE BET)

— ఏంటోన్ ఛెకోవ్ (రష్యా)

అది అర్ధరాత్రి. అది శరదృతువు. ఆ వడ్డీ వ్యాపారి అసహనంగా తన లైబ్రరీహాలులో పైపు పీలుస్తూ ఇటూ అటూ తిరుగుతున్నాడు. అతని మనోనేత్రం ముందు వర్తమానం కాక, పదిహేను సంవత్సరాల క్రిందట తను ఇచ్చిన ఒక పార్టీ కదలాడుతూ వుంది. ఆ రోజున ఆ పార్టీలో ఎందరో తెలివైనవాళ్ళూ, ఏ సమస్యనయినా కూలంకషంగా చర్చించ కలిగిన సమర్థులూ-వాదనా పటిమగలవాళ్లూ-స్వంత అభిప్రాయాలను నిష్కర్షగా చెప్పగలిగిన ధైర్యశాలులూ—చెప్పిందాన్ని ఆచరించ గలమనే విశ్వాసం వున్నవాళ్లూ అక్కడ చేరారు.

"పిచ్చాపాటీ"గా సంభాషణ మొదలయింది. అయితే అది చిలికి చిలికి గాలివానగా-ఒక జీవన్మరణ సమస్యగా మారుతుందని విజానికి తనూ ఊహించలేకపోయాడు. సంభాషణ "మరణ దండన ఉండాలా - కూడదా?"అన్న సమస్య మీదకి మరలింది.

అక్కడ వున్న కొందరు మేధావులు, పత్రికా రచయితలు, మరణ దండన అనాగరికం, అమానుషం, నిష్ప్రయోజనం అన్నారు—దానికి కాలం చెల్లిందని, హత్యలు ఉన్మత్తులు చేసే పనులని, ఉన్మత్తత అనే రుగ్మతకి మందు వెయ్యాలే తప్ప - లెక్క చెయ్యలేక పలకని బద్దలు కొట్టే (లేక కాగితాన్నే చింపేసే) విద్యార్థిలా హత్యచేసినవాణ్ణి ఉరితీసేసి-సమస్యని పరిష్కరిద్దామనుకోడం అవివేకమనీ అభిప్రాయపడ్డారు.

"ప్రాణహననంబు కడు సులభంబు కాని—ప్రాణమిచ్చుట మనకు సాధ్యంబు కాదు" కనుక మనము ఈయలేని దానిని హరించే హక్కు మనకు లేదన్నారు. అంతకన్న యావజ్జీవ కారాగారశిక్ష అమలు చెయ్యడం సబబు అని కూడా నిర్ణయించారు.

అయితే పార్టీ ఇచ్చిన "తను" ఈ అభిప్రాయాన్ని సమర్థించ లేక పోయాడు. ఇక్కడ ప్రాణం ఇయ్యడం — తియ్యడం. కాదు ముఖ్యం— ఏది మానవత్వం? అన్నదే ప్రశ్న. పది పదిహేను సంవత్సరాలపాటు యావజ్జీవ కారాగార శిక్ష పేరుతో ఒక వ్యక్తిని ముక్కలు ముక్కలుగా హింసించి చంపేకన్న—ఒకేసారి ప్రాణాలు లాగిన తలారే(ఉరి వేసేవాడే) ఎక్కువ దయార్ద్రహృదయు డనిపించుకుంటాడన్నాడు తను.

అయితే "నా మటుకు నేను—ఈ రెండిటినీ రుచి చూసినవాణ్ణి కాక పోయినా—పదిహేను సంవత్సరాల ఏకాంతవాసం అంటే దిన దిన మర ణమే అని నా అభిప్రాయం" అన్నాడు.

రెండూ ఒకటే—రెండూ నీతి బాహ్యమైనవే—ఎంచేతంటే ఈరెండు రకాల శిక్షల ధ్యేయమూ ఒకటే కనుక. ఈ రెండింటిలోనూ ప్రాణం తియ్యడం అనే అవలక్షణం వుంది కనుక—శిక్షలను అనుగ్రహించే జడ్జీ గారు కానీ, జడ్జీగారికి ఆ అధికారాన్ని సంక్రమింప జేసిన రాజ్యాధికారం గాని, దేవుళ్ళు కారు—కనీసం దైవ ప్రతినిధులు కూడా కారు. వాళ్ళు శవాల్లో ప్రాణాలు పొయ్యగలిగితే తప్పకుండా చంపమనండి వాళ్ళకి శిరస్సు వంచి నమస్కరిస్తాను" అన్నాడు అతిథుల్లో ఒకడు.

ఒక లాయర్ మాత్రం ఏ అభిప్రాయం చెప్పకుండా పరధ్యాన్నంగా ఆలోచిస్తూ కూర్చుండి పోయాడు.

"ఏం — యువ కిశోరమా—కిమన్నాస్తిగా వుండిపోయావ్?" ఈ బ్యాంకరే రెచ్చగొట్టేడు.

"ఎందుకులెండి – మహామేధావుల చర్చల్లో మాలాటి పిల్లకాకుల జోక్యం" అని తప్పించుకోబోయాడు.

"నో-నో-నో-నువ్వూ నీ అభిప్రాయాన్ని చెప్పాల్సిందే" అని కోరస్‌గా అరిచారు అక్కడి వాళ్ళంతా (అలా వాళ్లు అతన్ని రెచ్చకొట్ట కుండా వుంటే ఎంత బాగుండి వుండేదో—ఈనాడు అనిపిస్తోంది తనకి.) చాలా ముక్తసరిగానే అన్నాడతడు :

"రెండు సమానంగా నీతిబాహ్యలయిన శిక్షలే, అయితే ఏదో ఒకటి తప్పనిసరి అయినప్పుడు నేను రెండోరకపు శిక్షకే ఓటు వేస్తాను....ఎందుకంటే, ఉరిశిక్ష అమలు చేసిన తరువాత అతడు నిర్దోషి అని తేలినా మనం చెయ్యగలిగింది ఏమీవుండదు. యావజ్జీవ కారాగారశిక్ష అనుకోండి....ఆ తరువాత అతడు నిర్దోషి అని ఏ కారణంచేతనయినా నిరూపణ అయితే అతనికి విముక్తి కలిగించి జనజీవనంలో కలిపే ఛాన్సువుంది. పైగా మరణం కన్నా జీవించటం మేలుకదా?" అన్నాడు.

అయితే "బ్యాంకర్"గారి ఉద్రేకం కట్టలు తెగింది "నో....నే ఒప్పుకోను. రెండు మిలియన్ల రూబుల్సు పందెం....పదిహేనుకాదు ఐదు సంవత్సరాల పాటేనా....ఏకాంతవాసం చెయ్యడం మరణంకన్న దుర్భరం, మరపురాని గతముకన్నా మరణమే మేలు...." అన్నాడు గట్టిగా టేబుల్ మీద గుద్దుతూ.

"నువ్వు దీనిని ఏదో మాటవరసకంటున్నావా....లేక సీరియస్‌గానే అంటున్నావా?" అన్నాడు యువ లాయర్....

"చాలా సీరియస్‌గా అంటున్నాను"

"ఎన్ని సంవత్సరాలు ఏకాంతంగా వుండవచ్చు"

ఐదు సంవత్సరాలుకూడా వుండలేవు—అంటున్నాను"

"ఐదు సంవత్సరాలు కాదు—పదిహేను సంవత్సరాలూ వుంటాను పందేనికి నిలబడతావా?"

"ఓ యస్"

"డన్ ?"

"డన్...."

ఆ విధంగా ఆ యువలాయర్‌తో తను పందెంకాసి రేపటికి పదిహేను సంవత్సరాలవుతుంది- అది ఈ రోజు బ్యాంకరుగారు-లైబ్రరీ హాలులో ఆందోళనపడుతూ పచారీలు చెయ్యడానికి కారణం.

"అసలు నేనేల ఈ పందెం కాయవలె ? కాసితిని బో—అతడేల రెచ్చిపోవలె? రెచ్చిపోయెను బో....నేనేల దానిని వేళకోళపు వ్యవహార

ముగా తీసిపారవేయక ఛాలెంజీగా స్వీకరించవలె....? ఇదంతా రబ్బిష్ అనవసరంగా పెంటమీద ఉన్న విప్పను ఇంటిమీద పెట్టినట్లు అయింది నా పని..." అనుకున్నాడు. అతని దృష్టిలో రెండు మిలియన్లరూబుళ్ళు అతని ఆదాయంలో ఓ తల వెంట్రుకంత చిన్న మొత్తం....? కాని ఆ యువ లాయర్‌కి బంగారంపట్ల వున్న కాంక్షకి ఆ బ్యాంకరుకి ఆశ్చర్యం కలిగింది. కేవలం ఆఫ్టరాల్, రెండు మిలియన్ల రూబుళ్ళకోసం ఖచ్చితంగా ఏకాంతవాసం చెయ్యడానికి సిద్ధపడ్డాడంటే "ధనమేరా ఈ జగతికి మూలం" అనేది ఎంత యదార్థమో తెలియవచ్చింది, ధనాన్ని మనిషి సృష్టించాడా? మనిషిని ధనం సృష్టించిందా?....తను సృష్టించినదానికి తానే బానిసగా మారడం-బహుశః మనిషికొక్కడికే ప్రత్యేకమైన శాపమేమో....డబ్బు కోసం గడ్డన్నమాటేమిటి....ఏ పనిపడితే ఆ పని చెయ్యడానికి మనిషి సిద్ధపడతాడనేందుకు—ఈ యువలాయరుగారి కక్కుర్తే ప్రతీక....సరే ఈ అప్రస్తుత ప్రసంగానికి ప్రస్తుతానికి కామాపెట్టి....ఒక్కసారి ఈ పదిహేను సంవత్సరాల చరిత్రనీ అవధరిద్దాం.... డన్! !

ఆ రోజు మొదలు....ఆ యువ లాయర్‌కి ఐచ్ఛిక శ్రీకృష్ణజన్మస్థానం ఒకతోట....చాలా కచ్చితంగా ఏకాంతవాసం చెయ్యాలి....అదీ పదిహేను సంవత్సరాలపాటు ఒక్క పదినిమిషాలుకూడా కన్సెషన్‌లేదు అతనికి తెలియకుండానే అతని చర్యలు వేయికళ్ళతో గమనించబడతాయి. ఆ తోట బ్యాంకరుగారి దొడ్డిలోనే వుంది. ఆషాఢమాసంలో అత్తాకోడళ్ళ నియమంలా ఇంటి గుమ్మం దాటరాదని నియమం. మనుష్యులముఖాలు చూడరాదని మరో నియమం, మనుష్యుల గాత్రాలను వినరాదు. (పాటలనేకాదు—అసలు మనుషుల గొంతే వినబడదు) పేపర్లు చదవరాదు. ఆ రోజుల్లో రేడియోలూ, టీవీలూ లేవు. ఉండివుంటే అవీ నిషిద్ధాలై వుండేవి. అయితే పుస్తకాలు?? చదువుకోవచ్చు, ఉత్తరాలు స్వీకరించ రాదుకానీ వ్రాసుకోవచ్చు. త్రాగుడు? ఓ పీపాలకొద్దీ త్రాగు మా కభ్యం

తరంలేదు. సిగరెట్లు?? నీ యిష్టం....బయట ప్రపంచంతో పొత్తిగా సంబంధాలు తెగతెంపులు చేసుకోవాలా?....అబ్బే అలాంటిదేంలేదు. అత నికి ఏర్పాటు చేసిన ఒక కిటికీలోంచి సంజ్ఞలుచేసి తనకి ఏంకావాలో తెలియ జేయవచ్చు...ఎట్టొచ్చీ మాట్లాడరాదు—ఎవరూ కనబడరు. ఏ మనుష్య శబ్దంవినబడదు. అయితే అతని సంజ్ఞలు గమనించబడతాయి. అతనికి ఏమికావాలో సమకూర్చబడతాయి. సంగీత సాధన చేసుకో పాడుకో, ఆడుకో, పడుకో, ఆడుకో, చదువుకో, ఏమయినా చేసుకో నీ యిష్టం— అంటూ ప్రతి విషయాన్ని వివరంగా పొందుపరచి ఎగ్రిమెంటు తయారు చేశారు. పధ్నాలుగు నవంబరు 1870 మిట్టమధ్యాహ్నం సరిగ్గా పన్నెండు గంటలకు మొదలయిన ఈ పందెం....1885 నవంబరు మిట్టమధ్యాహ్నం సరిగ్గా పన్నెండు కొట్టేసరికి (పన్నెండవ టాంగ్ పూర్తికావాలి) పందెం పూర్తి అవుతుంది. ఆ లాయరు జన స్రవంతిలోకి విడుదల అవుతాడు. రెండు మిలియన్లరూబుళ్ళు అతని జేబులో పడతాయి.

మొదటి సంవత్సరం .... అతడు వ్రాసి బయటపడేసిన చీట్ల ద్వారా అర్థమయింది ఏమంటే ఒంటరితనంతో కృంగిపోతున్నాడు.... మరో జీవితం గడపనందుకు కుమిలిపోతున్నాడని. అయితే రాత్రి తెల్ల వారిందాకా అతని గదిలోంచి పియానో, వయొలిన్ లాంటి సంగీతపు శబ్దాలు కట్టలు తెంచుకు ప్రవహించేవి. అయితే త్రాగుడు, పొగత్రాగడం లాంటివి బాగా తగ్గిపోయాయి. "వైన్" త్రాగడం గురించి అతను వ్రాసిన చీటీలో ఇలా వుంది.

"త్రాగుడు వ్యసనం - కోరికల్ని పెంచుతుంది. కోరికలనేవి ఖైదీకి ప్రథమ శత్రువులు. పైగా ఒక్కడే కూర్చుని త్రాగడం శుద్ధ బోర్. పొగ త్రాగడం వల్ల గదంతా పాడువాసన కొట్టి ప్రశాంతతను పాడు చేస్తుంది.

మొదటి సంవత్సరమంతా హాస్య సంభరితమైన కామిక్సు - తేలిక పాటి కాలక్షేపపు నవలలూ ఎక్కువగా చదివేవాడు. అయితే ఎక్కువ

రొమేంటిక్‌గా వుండే పుస్తకాలు చదివేవాడు. రెండవ సంవత్సరంలో సంగీత సాధన పూర్తిగా తగ్గింది. పియానో మోత వినబడటం మానేసింది. ఇప్పుడు పురాతన గ్రంధాల్నీ - వైదాంతిక విషయాలున్న పుస్తకాల్నీ అడగడం ప్రారంభించాడు. ఐదవ సంవత్సరంలో కాబోలు - మళ్ళీ సంగీతం వినబడసాగింది. ఇప్పుడెందుకో వున్నట్టుండి వైన్ కావాలంటూ చీటీలు పంపడం మొదలెట్టేడు. అతనిని గమనించే గూఢచారులు చెప్పిందాన్ని బట్టి ఆ సంవత్సరమంతా అతనికి తినడం, త్రాగడం, పడుకోవటం తప్ప మరో వ్యాపకం లేనట్లు తోస్తుంది. ఆవలిస్తూ తనలో తనే ఏదో కోపంతో చిందులు త్రొక్కుతూ మాట్లాడుకునేవాడట. అర్ధరాత్రి లేచి ఏదో రాత కూడా మొదలెట్టేవాడట! ఓ రెండు మూడు గంటలు వ్రాసుకున్నాక వ్రాసిన కాగితాలన్నీ చింపి పోగులు పోసేవాడట — చాలాసార్లు భోరుమని ఏడవడం కూడా వినిపించేదట!

ఆరవ సంవత్సరంలో ఉత్తరార్ధంలో కాబోలు ఆ లాయర్ రకరకాల భాషల్ని అధ్యయనం చెయ్యటం ప్రారంభించాడట! చరిత్రనీ, వేదాంతాన్నీ క్షుణ్ణంగా చదువుతూ వుండేవాడట! అతగాడు ఈ పుస్తకాలను ఎంత తీవ్రంగా చదివేవాడంటే.... అతను కోరిన పుస్తకాలను అందించడం ఈ బ్యాంకర్‌కి పెద్ద సమస్యగా మారిందట .... ఎంత పెద్ద పుస్తకాన్నైనా ఓ గంటలో చదివేసి ఫలానా పుస్తకం కావాలని చీటీ పంపేవాడట! నాలుగు సంవత్సరాల కాలంలో ఈ వ్యాపారి ఆలాయర్ కోసం ఆరు వందల వాల్యూముల పుస్తకాల్ని కొని సప్లై చేయాల్సి వచ్చిందంటే ఆలోచించండి మరి!

ఆ రోజుల్లోనే వ్యాపారికి లాయర్ దగ్గరనుంచి ఈ ఉత్తరం అందింది. "జైలర్‌గారికి (వ్యాపారిని అలాగే సంబోధించేవాట్ట) నేను ఈ ఉత్తరాన్ని ఆరు భాషల్లో పండితులైనవారికి నీ యిష్టం వచ్చిన వారికి భ్యంతరంగా ఈ ఉత్తరాల్ని చూపించుకోవచ్చు. వాళ్ళు దాన్లో ఒక్క తప్పులేదని, అవి నిర్దుష్టంగా వున్నాయని అభిప్రాయపడితే - మీ తోటలో

ఒక తుపాకీని పేల్చవలసిందని మీవారికి ఆదేశించు. ఆ శబ్దాన్ని బట్టి నేను ఇన్నాళ్ళు పడ్డ శ్రమ వృధాకాలేదని భావిస్తాను. నేను ఈ భాషాధ్యయనం వల్ల గ్రహించినది ఏమంటే - ప్రపంచంలో మేధావులందరి ఆలోచనలూ ఒకేలా సాగుతాయని. అందరిలోనూ జ్వలించే అంతరాత్మ- నాడీ - వేడీ - వాడీ - ఒకటేనన్న పరమ సత్యాన్ని. నేను ఇప్పుడు పొందుతోన్న ఆమ రానందాన్ని నువ్వు గ్రహించిందీ లేనిదీ నీ ప్రతిస్పందనని బట్టి నేను అర్థం చేసుకోగలను.'' అతడుకోరినప్రకారమే - ఆ ఉత్తరాలలోని భాషల్ని నిపుణులచేత పరీక్ష చేయించాడు. నిర్దుష్టంగా వున్నాయని ఏక గ్రీవంగా పరీక్షకులంతా అభిప్రాయబడ్డారు. అతని కోరిక ప్రకారం తోట రెండుసార్లు తుపాకుల మోతతో ప్రతిధ్వనించింది.

పదవ సంవత్సరంలో ఈ ఖైదీ (లాయరు) కదలకుండా టేబిల్ దగ్గర కూర్చుని బైబిల్ (న్యూటెస్టమెంట్) మాత్రం చదువుతూ కూర్చుం డిపోయేవాడు. నాలుగు సంవత్సరాల కాలంలో ఒకమనిషి అతి జటిలమైన నాలుగు వందల బృహద్గ్రంథాల్ని చదివాడన్న సత్యాన్ని జీర్ణించుకోలేక అబ్బురపడిపోయాడా? అంతకంటే ఆశ్చర్యం! ఒకే పుస్తకాన్ని (అదే బైబిల్ని) పిడిచి పెట్టకుండా ఏకాగ్రతతో ఏడాదిపాటు చదవడం పోనీ బైబిల్ ఏమన్నా బుర్ర బద్దలుకొట్టుకున్నా అర్థంకాని కఠినమైన గ్రంథమా? కాదే!.... అంత సులభమైన పుస్తకాన్ని తదేక దీక్షతో ఏడాది పాటు చదవడం ఏమిటో జుత్తు పీక్కున్నా అర్థంకాలేదు ఆ బ్యాంకర్కి (ఈ లాయర్గారి దెబ్బకి ఇదివరకే అంతంత మాత్రంగా వున్న శిరో జాలు పూర్తిగా ఊడిపోయి బట్టతల అయిపోయింది - అది వేరే సంగతి)

ఇంక రెండు సంవత్సరాలు మాత్రం మిగిలేయి. ఈ కాలవ్యవధిలో అతగాడు పుస్తకాలు దీక్షతో కాక కోడి కెక్కరించినట్లు సగం సగంగా చదువుతూన్నట్టు గమనించబడింది. కాసేపు నేచురల్ సైన్సు - కాసేపు షేక్స్పియర్ నాటకాలు - మరికొంతసేపు బైరన్ మహాకవి కవిత్వం - ఇలా సాగింది అతగాడి గ్రంథపఠనం. నాకు రసాయన శాస్త్రం మీద పుస్త

కాలు కావాలని ఒకసారి, వైద్యశాస్త్రం మీదవి కావాలని మరోసారి, వేదాంత గ్రంథాలని ఒకసారి నీతిశాస్త్రం మీద ఫలానా పుస్తకం లభ్యమైతే పంపండని మరోసారి .... ఇలా వస్తుండేవి అతని దగ్గర నుంచి ఉత్తరాలు. గ్రహించిందేమంటే ఓడ ప్రయాణంలో ఓడ నడిసముద్రంలో బద్దలైతే ఈత కొట్టేవాడి స్థితిలో వున్నాడన్నట్టు వుంది అతని వ్యవహార సరళి. ఎలాగో అలాగ ఏదో ఒక ఒడ్డుకు చేరుకుని బతకాలనే తపన లాటిది అతని చేష్టల్లో వ్యక్తమవుతోంది.

ఇవి యీనాడు లైబ్రరీలో, నోట్లో ఆరిపోయిన పైపు పెట్టుకుని, అసహనంగా అటూ ఇటూ తిరుగుతోన్న బ్యాంకర్ మహాశయుణ్ని ఉక్కిరి బిక్కిరి చేస్తున్న ఆలోచనలు.

రేపటిరోజు మధ్యాహ్నం సరిగ్గా పన్నెండు గంటలు కొట్టడం పూర్తయ్యేసరికి పందెం పూర్తవుతుంది - పణం అతగాడికి ఇచ్చుకోవాలి. తను ఓడిపోయినది ఖాయం. ఇన్నాళ్ళు - తనని క్షోభపెట్టి హాయిగా జైలు (ఐచ్ఛికంగానే) అనుభవించి తనకే దానిని శిక్షగా మార్చిన యీ ఘటికుడికి ఓ పన్నెండు గంటలు గడపడం గగనం కాదు. అయితే .... ఈ పదిహేను సంవత్సరాల కాలంలో బ్యాంకర్‌గారి జీవితంలో తగిలిన ఎదురు దెబ్బల్ని - విస్మరిస్తే - లేక పందెం కాసిననాడు ఉన్న బ్యాంకర్ గారి ఆర్థిక స్థితి - అప్పటికీ - ఇప్పటికీ ఆలాగే వుండివుంటే .... వుంటే? .... యీ రెండు మిలియన్ల రూబుళ్ళు - సముద్రంలోని నీటి బొట్టంత ప్రమాణానివి. కాని ఈనాటి పరిస్థితి వేరు.

అప్పుడు ఉన్న రూబుళ్ళని లెక్కపెట్టడం సమస్య అయితే.... ఇప్పుడు అప్పులెక్కువా తనదగ్గరవున్న ఆస్తి ఎక్కువా అన్నది సమస్యగా తయారయింది.

కర్ణుడి చావుకి ఎందరో కారకులన్నట్టు ఈ తన ఆర్థిక దుస్థితికి— లాయర్ ఒక్కడే కారకుడు కాదు. ఆర్థిక మాంద్యం—వ్యాపారంలో విపరీతమైన పోటీ, తన నిర్లక్ష్యం—కుటుంబంలోని విపరీతమైన ఖర్చులు,తన

వృద్ధాప్యం....ఇవన్నీ చాలవన్నట్టు రేపు తాను ఇచ్చుకోవలసిన రెండు మిలియన్ల రూబుళ్ళు....తలుచుకుంటేనే తల తిరిగిపోతోంది.

ఎందుకీ తలకిమాలిన తద్దినాన్ని కొనితెచ్చుకున్నానా అని వ్యాకుల పడిపోతున్నాడు. ఈ పదిహేను సంవత్సరాల్లో వాడు చచ్చివుంటే నా పీడ విరగడై పోను కదా అనే దుష్టపు ఆలోచనా కలిగింది. రేపు రెండు మిలియన్లు పట్టుకుపోతాడు—చంకలు గుద్దుకు మరీ హుషారుగా బయటకు వస్తాడు. హాయిగా పెళ్ళి చేసుకుంటాడు, జీవితమంతా మహారాజులా కాలు మీద కాలు వేసుకుని గడిపేస్తాడు. తాను పూలమ్మినచోట కట్టెలమ్ముకుని....కట్టెలూకాదు....ముష్టెత్తుకు జీవించాల్సివస్తుంది. అయితే మనసుంటే మార్గం వుండకపోదు....ఈ మనిషిని చం....పే....స్తే....

అదే మంచి ఆలోచనగా తోస్తోంది. గడియారం....బ్యాంకర్‌గారి ఇనపెట్టెమీద ఎవరో సుత్తితో తాళాలు బ్రద్దలు కొడుతున్నంత భయంకరంగా ఠాంగ్—ఠాంగ్ మని మూడు గంటలు కొట్టింది....బయట చీకటిగా వుంది. బ్యాంకర్ భాయీ ఒక నిశ్చయానికి వచ్చేశాడు. కోటువేసుకున్నాడు పిల్లిలా అడుగులేసుకుంటూ తోటలోకి వెళ్ళేడు.

తోటంతా నిశ్శబ్దంగా వుంది—వెన్నెల పిండి ఆరబోసినట్టు వుండి—మంచుముక్కలమీద తళతళలీనుతూ నేలంతా వింతకాంతు లీనుతోంది. అయితే బ్యాంకర్‌గారు ఈ మైమరపించే ప్రకృతిని చూసి తన్మయీ భావం చెందే స్థితిలో లేడు. అతని బుర్రలో వేరే ఆలోచన లున్నాయిగా! — నేను అనుకున్న పనిని నిర్విఘ్నంగా నిర్వర్తించే ధైర్యాన్ని నేను పుంజుకుంటే?....కనీసం శేషజీవితాన్నైనా తృప్తిగా విశ్చింతగా అడుక్కోకుండా బ్రతకవచ్చు — అదీ ఇప్పటి అతని జీవన్మరణ సమస్య.

"వాచ్‌మన్—వాచ్‌మన్" అని కేకేశాడు. చలికి భయపడి వాడెక్కడో త్రాగి హాయిగా పడుకుని వుంటాడు.

ఇప్పుడు ఈ లాయర్ ప్రాణానికి ముప్పువస్తే—తనను ఎవరూ అనుమానించరు-అనుమానం వాచ్‌మన్ మీద పడుతుంది—పైగా వాడు విద్యుక్తధర్మాన్ని సరిగా నిర్వర్తించనందుకు తనే వాణ్ణి శిక్షించగలడు. ఇలా ఆలోచిస్తూనే లాయర్ ఖైదీవుండే గదిలోకి వెళ్ళాడు—కళ్లు చించుకున్నా కనపడని కటిక చీకటి. అగ్గిపుల్ల గీసి ఆ వెలుతురులో గదినంతా కలియజూశాడు. ఆ గదిలో కాళీ మంచం, కనీసం దుప్పటి ఐనా లేకుండా వుంది గదంతా చిందరవందరగా వుంది. అయితే లైబ్రరీ గదిలోంచి ఏదో గుడ్డి వెలుతురు కనబడుతోంది.

కిటికీలోంచి తొంగి చూశాడు-అతనికి కనబడిన దృశ్యం ఏమిటి? అతని శిరస్సు వెనక భాగం కనబడుతోంది. అతని చేతులు కొంత భాగం కనబడుతున్నాయి. బల్లనిండా తెరచిన పుస్తకాలు గుట్టలు గుట్టలుగా పడి వున్నాయి.

ఐదు, పది, పదిహేను నిమిషాలు గడిచాయి— కుర్చీలో కూర్చున్న లాయర్ నిశ్చలంగా కూర్చుని వున్నాడు. కదలకుండా కూర్చోడం అతనికి పదిహేను సంవత్సరాల నుంచీ అలవాటై పోయినట్లుంది. బ్యాంకర్ కిటికీ తలుపుమీద తట్టి చూశాడు—కుర్చీలో చలనం లేదు.

బ్యాంకర్ నెమ్మదిగా తాళాలకు వేసిన సీళ్ళు తొలగించి—జేబులో వున్న తాళం చెవినితీసి తాళం కప్పని తీశాడు. తుప్పుపట్టిపోయిన ఆతాళం కప్ప గుర్రు గుర్రుమనే మోతతో మొత్తానికి ఊడి వచ్చింది. తలుపు తొయ్యబోతే కిర్రుమంటూ భయంకరమైన శబ్దాన్ని చేసింది. బ్యాంకర్ గదిలోనించి కంగారుగా వెయ్యబోయే "కెవ్వు"మనే కేకను ఊహించాడు. మూడు, నాలుగు, నిమిషాలు గడిచాయి—అయితే బహుశః అతనికి ఈ పదిహేను సంవత్సరాలలోనూ బ్రహ్మ చెముడు వచ్చుండవచ్చునో మరో కారణమో తెలియదు కాని....ఏమీ చలనం కలగలేదు. లోపలికి వెళ్ళి అతని ఎదురుగా నిలబడి చూశాడు. అతడు అస్థిపంజరంలా వున్నాడు. బుగ్గలు లోతుకు పోయి వున్నాయి.

అతని కేశాలు స్త్రీ కురుల్లా వీపుమీద జీరాడుతున్నాయి. అతని చేతులు మునక్కాడల్లా సన్నగా పొడుగ్గా వున్నాయి. జుత్తు గ్రేకలర్‌గా తెల్లతెల్లగా నెరసిపోయి వుంది. అతని పసుపు వర్ణపు దేహాన్నీ—అతని ప్రస్తుతపు అవతారాన్నీ చూసిన వాళ్ళెవరూ అతనికిప్పుడు కేవలం నలభై ఏళ్ళ వయస్సేనంటే నమ్మరు (40-15=25). అతడు శిరస్సు టేబిల్ మీద ఆన్చి పడుకుని యోగ సమాధిలో వున్నట్టున్నాడు. అతని తలదగ్గర చిన్న చిన్న సైజు అక్షరాల్లో రాసిన కాగితం ఒకటి వుంది.

పాపం, వెర్రి నాగమ్మ .... బహుశః కలలో రేపు తన ముందు కురవబోయే మిలియన్ల వర్షాన్ని గురించి పగటి కలలుకంటూ వుండి వుంటాడు. తన పని ఇప్పుడు మరీ సులభం అనిపించింది బ్యాంకర్ బాబుకి. ఈ సగం చచ్చిన శవాన్ని-మంచంమీద పారెయ్యడం—ఒక తల గడని గట్టిగా ముక్కుదగ్గర పెట్టి పదే పది నిమిషాలు అదిమి వుంచడం.... ఫినిష్....సహజమైన చావు.... వాచ్‌మన్‌ని ఇరుకులో పెట్టే శ్రమ కూడా వుండదు. మొదట ఆయనగారి మరణ శాసనం(?)ఏమిటో చదువుదాం.... ఆపైన మన పని మనం పూర్తి చేసుకుపోదాం!

"రేపు సరిగా పన్నెండు కొట్టేసరికి నాకు పూర్తి స్వేచ్ఛలభిస్తుంది. నేను జన స్రవంతిలో కలవడానికి స్వేచ్ఛ కలుగుతుంది. అయితే ఈ గదిని ఈ కిటికీలోంచి చందమామని-సూర్యుణ్ణి ఆకాశాన్నీ నక్షత్రాల్నీ—మేఘాల్నీ-మారే ఋతువుల్ని చూసే అవకాశం మరి వుండదు-వీటన్నిటి సాక్షిగా నేను చెప్పదల్చుకున్నది—ఈ కాగితం మీద రాస్తున్నాను.

నా ఆత్మసాక్షిగా, నన్ను అనుక్షణం చూస్తూ ఇంతకాలం నన్ను తన దయార్ద్రమైన కన్నుల వెలుగుల్లో నడిపించిన ఆ పరమాత్మ మొహం చూసి నే చెప్పదల్చుకున్నది ఏమంటే....స్వేచ్ఛా స్వాతంత్ర్యాల పట్ల పిపాస ఈనాడు నాకు అణుమాత్రం లేదు. జీవితం పట్ల లక్ష్యంలేదు. ఆరోగ్యాన్ని నేను లెక్కించడం లేదు....పుస్తకాలు ఇచ్చే .... ఆ ఆనందాలు కూడా నేను మనస్ఫూర్తిగా ఏవగించుకుంటున్నాను.

పదిహేను సంవత్సరాలు ఐహికమైన ఆనందం ఏమిటి అన్నదాని మీద విపరీతమైన పరిశోధన జరిపాను - మనుషుల ద్వారానే కాకుండా రకరకాల మేధావులు పుస్తకాల రూపంలో అపురూపంగా పదిల పరచిన ఆనందసారాన్ని అరిచేతులతో జుర్రుకున్నాను. పాటలు పాడుకున్నాను- పాటలు రాసుకున్నాను - ఊహాలోకాల్లో విహరించాను. లేళ్ళను వేటాడేను. తివిరి ఇసుమున తైలం తీశాను, మృగ తృష్ణలో నీరు త్రాగేను - కుందేటి కొమ్మును సాధించాను - ఈ మూర్ఖపు మనస్సును - రంజింపనూ చేసుకు న్నాను. ఎంతటి అందమైన అమ్మాయిలతో విహరించానో చెప్పలేను. మబ్బులపైకి ఎగిరి వాటిపైస్వారీ చేశాను. ఒకప్పుడు నక్షత్రాలన్నిటినీ ఏర్చికూర్చి దండలుగా మెడలో ధరించి మురిసిపోయాను. నేను ఎన్నో అం దమైన కథలు చదివాను. అల్లాను, కీర్తనలుగాపాడేను - వాటిలోని మధురి మను త్రాగి ఆనంద తాండవం చేశాను, ఘెల్లుమనిఏడ్చాను.

పుస్తకాల సాయంతో ఎన్నో ఉన్నత శిఖరాల్ని ఎక్కానో ఎన్నో అగాధాల్లో ఊతలుకొట్టేను. నేను చూసినన్ని ఆకాశపు రంగులు బాహుశః ఈనరజాతిలో ఏ ఒక్కరూ చూసివుండరు - మేఘాలని గంటల తరబడి చూస్తూ అవి ఎన్ని రకాలుగా విశ్లేషింపబడతవో - ఎన్నిరకాల కాంబినే షన్లతో ఎన్నెన్ని ఆకృతులు దాలుస్తాయో చూశాను. అడవులు, పొలాలు, నదులు, సైకతాలు, నగరాలు, తుఫానులు, యుద్ధాలు, ప్రళయాలు, ప్రణ యాలు, రకరకాల పిట్టల కూతలు, జంతువుల అరపులు - రాక్షసులు, దయ్యాలు, భూతాలు....ఎన్నో....ఎన్నో....ఎన్నో-ఎన్నని వ్రాయను - అవన్నీరాయాలంటే మరో పదిహేను సంవత్సరాల ఏకాంతవాసం చాలదు.

పుస్తకాలు నాకు తెలివిని ఇచ్చాయి, విజ్ఞానాన్నిచ్చాయి, విజ్ఞతని ఇచ్చాయి: వైరాగ్యాన్ని ఇచ్చాయి; ఈ మొత్తం అన్నీ ఈ చిన్నిబుర్రలో ఇంకా చిన్నగా అంగుష్ఠమాత్రంగా ఇమిడివున్న మస్తిష్కంలో ఇమిడి పోయాయి-

ఇంతోటి విజ్ఞానానికీ ఇంతచిన్న బుర్రలో ఇమడగల ఇన్నివేల

పేజీలు వృధాచేశారా ఈ మేధావులు అన్న నిరసన భావంకూడా కలుగు తోంది. అందుకే పుస్తకాలని కూడా ఈ క్షణంనించి వదిలెయ్యడానికే నిశ్చయించుకున్నాను చదవగా చదవగా - ఒరేయ్ మేధావులూ నేనే మీ కన్న తెలివైనవాడినిరా అని చెప్పాలనిపిస్తోంది.

ఈ ప్రపంచంలో ఏ ఒక్కదాని మీదా నాకీనాడు వ్యామోహంలేదు. ప్రపంచమంతా ఒక ఎండమావి - ఎంత గర్విష్టిఅయినా - వినయశీలుడు అయినా - మేధావి అయినా, మట్టి బుర్ర అయినా, మట్టిలోనే కలుస్తారు తప్ప - మరోలా జరగదు. మరణం తథ్యం - మీ వంశ గౌరవాలు — చరిత్రలూ, ఆర్భాటాలు, అమరదీపాలై వెలగడాలు, మేధావులమనే విరగ బాటులూ - వృధాప్రయాసలు - దగాలు, ఇక్కడివి ఇక్కడే వదలి ఎక్కడికో పోవలసిన వాళ్ళం - మనకెందుకు ఈ ఆవేశాలూ, ఆయాసాలూను?

మీరంతా పిచ్చివాళ్ళు-ప్రపంచంలోని ప్రతి వ్యావృతీ ఒక పిచ్చికి ప్రతీక. అందమూ - అనాకారమూ - సత్యమూ అసత్యమూ అనే పేర్లతో పిచ్చిని రకరకాలుగా పిలుచుకునే పిచ్చివాళ్ళు మీరు. స్వర్గాన్ని భూమండలానికి తాకట్టుపెట్టిన మూర్ఖులు మీరు. నా గోల మీకెవరికీ నా ఈ రాతలలో బహుశః అర్థంకాకపోవచ్చు. అందుకే నా చేతలలో ఋజువు చేయదల్చుకున్నాను.

రేపు నాకు రెండు మిలియన్ల రూబుళ్ళు అయాచితంగా వచ్చి పడబోతున్నాయి. అయితే ఆరూబుళ్ళు నాకియ్యబోతున్న ఆ మూర్ఖవ్యాపారికి బహుశః తెలియని సత్యం ఒకటివుంది. ఆయనగారు నాకు ఇచ్చిన ఈ పదిహేనేళ్ళ అవకాశం - అతడు నాకిచ్చిన ప్రశాంతత, అవకాశం ఎన్నిమిలియన్ల రూబుల్సు విలువైనదో అతనికి తెలియదు. అతడు నా కిప్పటికే ఇచ్చిన దానికి పరిహారాన్ని అతడే కోరితే?...ఈ ప్రపంచంలోని ధనరాసులన్నిటినీ కొల్లగొట్టి అతని బాకీతీర్చినా-నేనే అంతకు ఎన్నోరెట్లు ధనాన్ని అతనికి బాకీ పడిపోతాను—నేను అతనికి ఋణగ్రస్తుణ్ణి మరింతగా కాలేను. అందుకే ఒక నిశ్చయానికి వచ్చేశాను - సరిగ్గా పదకొండు గంటల యాభై

అయిదు నిమిషాలకు నేను నా జైలు గోడల్ని బద్దలు కొట్టుకుని బయట పడి ఐచ్ఛికంగా ఓడిపోతాను — తద్వారా....నా ప్రియమిత్రుడు బ్యాంకర్ ఋణాన్ని కొంతవరకూ తీర్చుకుంటాను........

ఇదిచదివిన బ్యాంకర్ వెలవెలబోయాడు - ప్రేమ, దుఃఖం, పశ్చాత్తాపం....అతని నేత్రాలలోంచి ధారలుగా కారసాగింది. ఏడవటం ప్రారంభించాడు-ప్రేమతో అతని శిరస్సుని ముద్దుపెట్టుకున్నాడు. అయితే అతనికి నిద్రాభంగం గలగనంత సున్నితంగా ఈ పనులుచేసి.... తనగదికి తిరిగి వచ్చి తేలికైన మనస్సుతో పడుకున్నాడు.

ఆ మరునాడు అక్కడ తాను కాపలావుంచిన వాచ్‌మన్ భార్య పరుగు పరుగున రొప్పుతూ వచ్చింది. ఆగదిలో వున్నఖైదీ కిటికీలోంచి దూకి తోటలోకి పారిపోయాడని గేటుదాటి మాయమయ్యాడనీ, చెప్పింది. అయితే అతగాడు రాసిన కాగితాన్ని తానుచదవకుండా వుండివుంటే.... తన ప్రతిస్పందన ఏ విధంగా వుండేదో....చెప్పడం ఈ కలానికి సాధ్యమైవుండేది కాదు.

అయితే ఇప్పుడతడు నిర్ఘాతం పోనూలేదు - సంతోషించనూలేదు- విచారించనూలేదు. ఆ లాయర్ ఎక్కిన శిఖరాల్ని ఇతగాడు ఎక్కలేక పోయాడు కనుక; ప్రపంచంలో తను ఎక్కడ అపఖ్యాతి పాలు అవుతాడోనన్న భయాన్నించి అతడింకా విముక్తుడు కాలేదు కనుక ఆలాయర్ రాసిన ఆ ఉత్తరాన్ని ఇనపెట్టెలో భద్రంగా పదిల పరచి స్వేచ్ఛగా ఊపిరిపీల్చుకున్నాడు .

....***....

# 6. ఎవరి మేనమామ తల సర్కస్ పులిచేత కొరకబడ్డదో ఆక్షురకుడు

(The Barber Whose Uncle had his head bitter off by a Cirus Tiger)

—విలియం సారోయాన్ (గ్రేట్ బ్రిటన్)

(ఇది ఒక విషాదమయిన కథ. అయినా కదనం చాలా హాస్య స్ఫోరకంగా సాగుతుంది.ఇది అపురూపమయిన టెక్నిక్. అందుకే దీనిని మీ కందిస్తున్నాను.)

.........ఈ గోల భరించలేకుండా వున్నాను. ఇంట్లో అన్న, అమ్మ అక్క, అత్త, తాత, అందరూ ఇదే గొడవ. బళ్ళోకెడితే మిస్సూ ఇదే గొడవ. అయినా "అది" నాకిష్టంలేదు. ఇంతకీ ఏమిటట ఆ గోల? మీకు చెప్పేనా? లేదుకదూ!" బార్బరు షాపుకి వెళ్ళరాదా అట! ఎందుకు వెళ్ళ రాదు? వెళ్ళవచ్చు—వెళ్ళగలను,అయినా వెళ్ళను ఎందుకో వాళ్ళకిచెప్పను. చెప్పాల్సిన అవసరమూలేదు అయినా అన్నయ్యకు ఇంకోలా మార్చి చెప్పేను.

"శామ్సన్ గుర్తున్నాడా?" అని. అన్నయ్య తేలికగా కొట్టి పారేస్తూ............

"నువ్వు శామ్సన్‌వి కావుగా...." అన్నాడు. (శామ్సన్ బలం జుట్టులోనే వుండేదని బైబిల్ కథ.)

అసలు సంగతి మీకు చెపుతాను. నేను పోకెట్‌మనీ కోసం న్యూస్ పేపర్లు పంచుతానని మీకు తెలుసుకదా! మా ఊళ్ళో ఒక ఆసామీ వున్నాడు ఆయనకి ఆరుకార్లూ, పది భవనాలూ, మూడు ఫ్యాక్టరీలూ వున్నాయి. కాని నన్ను ప్రత్యేకంగా చూడడానికి కారుదిగివచ్చి ఉమన్స్ కాలేజీ అమ్మాయి లకు గార్డు ఆఫ్ ఆనర్ ఇచ్చే "బీట్" కుర్రాళ్లా కిళ్ళీకొట్టుదగ్గర పేపర్ చదువుతున్నట్లు నన్ను ఓరగా చూస్తూవుండేవాడు. కిళ్ళీకొట్టువాడు— "నీకున్నది ఆయనకు లేదని-నువ్వంటే ఆయనకు ఎంతో ఇష్టమట"

చెవిలో గుసగుసలాడేడు. తలెత్తి చూశాను. ఆయనది బోడిగుండూబోర్డరు క్రాపూను- చెప్పొద్దూ—గర్వమే కలిగింది. ఇంత కోటీశ్వరుడూ పేపరు ఉల్పాగా చదివి స్టాండుకి తగిలించేస్తాడట....కాని కొనడట! అది నా "ప్రిన్సిపల్" అనికూడా చెప్పాట్ట....

కలలు అందరికీ వచ్చినట్లు నాకూ వస్తాయి. మీకు ఫైటింగు చేస్తోన్నట్టు, క్లాసులో బెంచీ ఎక్కినట్టు. పాలకోవా తింటోన్నట్టు వస్తే-నాకు జాగ్రఫీలో చదువుకున్న అన్నిప్లాఖ్కా లండను, టోక్యో, న్యూయార్కు, ఢిల్లీ, కైరో, పెర్త్ వెళ్ళి ఆ వీధుల్లో తిరుగుతోన్నట్టు, అక్కడివాళ్ళతో "కాస్‌బీస్" అంటూ రకరకాల భాషలు మాట్లాడేస్తున్నట్టు కలలు వస్తాయి. అవేనా అస్తమానంరావు—పార్కులో ఆ బొగడచెట్టుక్రింద పడుకున్నట్టు మాత్రమే వస్తాయి. అందుకనే మధ్యాహ్నం క్లాసులు ఎగగొట్టి నేనుఎక్కువగా గడచెట్టుకింద పడుకుంటాను.

నా కలల ప్రత్యేకత ఏమంటే మీకు ఒకే కల అస్తమానంరాదు. నాకు మాత్రం ఒకేకల కాన్‌స్టెంట్‌గా వస్తుంది. అందుకే నేను ఆ చెట్టు క్రిందే కాన్‌స్టెంటుగా పడుకుంటూవుంటాను. అలా ఒకరోజున కలల అలలలో విహరిస్తూ ప్యారిస్ వీధులలో తిరుగుతూ వుండగా (ప్యారిస్‌లో పిచిక లెక్కువ అనుకుంటాను) కిచకిచ శబ్దానికి మెలకువ వచ్చేసింది. ఇంకా "కిచకిచ" ధ్వని వినపడుతూనే వుంది, చెట్టుమీద చూశాడు పిచ్చికలు లేవు. రొద ఎక్కువయింది. బుర్రంతా పిచ్చెక్కినట్టు వుంది. బుర్ర గోక్కోబోతే చెయ్యి చుర్రుమంది. చెయ్యి చటుక్కున తియ్యగానే ఒక పిచిక బయటకువచ్చి బయటికి తుర్రుమని ఎగిరిపోయింది. దాని వెనకాల మరో పిచిక....నా జుట్టులో పిచికలుగూడు కట్టే ప్రయత్నంలో వున్నట్టు అర్థమయిపోయింది- ఇహ మరి లాభంలేదు. అయినా మరీ ఇంత మంది గోలెడితే ఏమవుతుంది? ఘోషకి నల్లరాళ్లు బ్రద్దలవుతాయంటారు" రాళ్ళమాట నాకు తెలియదుకాని....బార్బర్‌ని చూడో-బార్బరుని చూడో....

లోకం కోద్దై కూస్తోంటే నా సొగసైన క్రాపుకి దిష్టి తగిలింది.

పిచిక రాస్కెల్సు ధర్మమా అని అర్జంటుగా బార్బరు దగ్గరకు పరిగెత్తాల్సిన పరిస్థితి ఏర్పడింది.....

ఆ వీధిలో రెండు బార్బరుషాపు లున్నాయి. ప్రతి షాపులోనూ కనీసం మూడేసిమంది (మూడేసిమందేమిటి నీ ముఖం? —ముగ్గురు అనాలి....మూడుమంది అనాలో ముగ్గురు అనాలో తెలియనివాళ్ళుకూడా తగుదునమ్మా అంటూ కథలు రాయడానికి సిద్ధం అవడందేనికో?) వెయి టింగ్‌లో వున్నారు. అయితే అదే వీధిలోవున్న ఓ బార్బరుషాపులో ఓ పెద్దమనిషి తాపీగా పైపుపీలుస్తూ న్యూస్‌పేపరు చదువుకుంటున్నాడు. ఇత గాడు ఎవడయినా కావచ్చునేమో కాని బార్బరుకాడు....కాజాలడు.... కాలేడు....కాకూడదు....కాబోడు. కాని అతగాడు బార్బరేనట ! అయితే ఇంట్లో పోరుపడలేక "ఇంటికన్న షాపు పదిలం" అన్న బాపతుప్రాణి అనిపించింది.

"ఏమండీ" అన్నాను జంకుతూ...."క్రాపు వేయించుకోడానికి వచ్చావా చిట్టితండ్రీ! ముందు కాస్త కాఫీ కాచుకు తాగుదాం....ఈలోగా కొంపలంటుకుపోవు" అని హామీ యిచ్చి కాఫీ ప్రిపరేషన్ మొదలెట్టేడు. కాఫీ మాత్రం చాలా అద్భుతంగా కలిపాడు. మరి క్షవరం ఎంత చక్కగా చేస్తాడో? కార్యక్రమం మొదలయింది. టకటకమని కొడవలితో గరికను పరికేస్తున్నట్టు నా జుట్టును నిర్దాక్షిణ్యంగా నరికి పోగులుపెడుతున్నాడు, కాఫీ రుచికికాబోలు అరమూతగా కళ్ళుమూసుకున్నాయి, "క్షవరం పూర్తయ్యేలోగా ఓ కథ చెపుతాను వింటావా?" అని నా జవాబుకోసం ఎదురుచూడక కథమొదలెట్టేడు. కథ మొదలయింది.

"మా మామయ్య గొప్పవస్తాదు. కుస్తీలు చాలా బాగా పట్టేవాడు. పెద్దపెద్ద వస్తాదులు మామయ్య చేతిలో చిత్తుగా ఓడిపోయేవారు. హాతోష్మి అనేవారు. మంచి తిండిపుష్టిగల మనిషేమో పెద్దలిచ్చిన పాతిక ఎకరాలన్నీ మూడుమేడల్నీ, ఆరు గేదెల్నికూడా తినేశాడు. ఎలాగైనా మా మామయ్య

మంచిపేరు తెచ్చుకున్నాడే. క్రమంగా ఆస్తి, పేరూ పోయాయి. ఆకలి మిగిలింది. ఉద్యోగం అడిగితే ఇచ్చేవాడు లేడు. అడుక్కోడానికి అభిజాత్యం. విధంచెడి అడుక్కున్నా అడ్డెడు బియ్యపు అన్నం, కోడిపెట్టా, పదహారు గుడ్లూ ఎవడు పెడతాడు? అంతతింటేకాని తీరే ఆకలికాదు. పిచ్చెక్కినట్లు రోడ్డుపట్టుకు తిరుగుతున్నాడు. ఎంత తిరిగినా ఆకలిపెరుగుతోందేకాని—తరగటంలేదు. గుడ్డిలో మెల్ల. సంసారం పిల్లలూలేరు. ఒకరోజున చిన్ననాటి స్నేహితుడు డేవిడ్ కనబడ్డాడు.

"హలో" అని వాడే పలకరించాడు—"ఆకలి—ఆకలి" అన్నాడు మా మామయ్య.

"ఉద్యోగం చేస్తావా?"

"ఆకలి....ఆకలి" అన్నాడు మామయ్య.

మామయ్యని హోటల్‌కి తీసికెళ్ళి కడుపునిండా భోజనంపెట్టించాడు డేవిడ్.

"అమ్మయ్య....ఇప్పుడు....ఉద్యోగం గొడవ చెప్పు" అన్నాడు మామయ్య.

"రోజుకు మూడునిమిషాలపని, మూడు పూటలా తిన్నంతభోజనం మూడువేలు జీతం చేస్తావా?"

"థాంక్యూ" అన్నాడు మామయ్య.

"నిన్ననే పోస్టు ఖాళీ అయింది. ఈవేళ మధ్యాహ్నమే జాయిను అవాలి—పద" అంటూ తీసికెళ్ళి డేవిడ్ మామయ్యని ఉద్యోగంలో జాయిన్ చేశాడు.

మామయ్య ఉద్యోగం బాగుంది. లండన్, ప్యారిస్, టోక్యో, పెర్త్ ఢిల్లీ, బొంబాయి, కైరో, మాస్కో ఇలా ఎన్నో ప్రాంతాలు తిరుగుతున్నాడు. రోజుకు మూడు నిమిషాల పని. మృష్టాన్న భోజనం. ఇంతకీ మామయ్య ఉద్యోగం ఏమిటి?— చెప్పడం మరిచాను. సర్కస్‌లో అట—సర్కస్ పని — పులి నోట్లో బుర్రపెట్టడం. వెరీ ఈజీ. ఒక్కసారి

నోరు తెరుస్తుంది. ఒక్క నిముషం గుండె దిటవు చేసుకుని పులి నోట్లో బుర్ర పెడితే చాలు. మళ్ళీ రింగ్ మాష్టర్ ఈల వెయ్యగానే బుర్ర తీసెయ్యడం. మ్యాట్నీకి ఒకసారి, రాత్రి ఫస్ట్ షోకి ఒకసారి, రెండో ఆటకి ఒకసారి. మామయ్య దేశదేశాలు తిరిగి, తిరిగి వచ్చేటప్పుడు నాకు మంచి మంచి బహుమతులు కూడా తెచ్చేవాడు.

ఒకరోజున పులి మంచి కోపంగా వుందట! అయినా నోరు తెరవాల్సిందేనని రింగ్ మాష్టర్ దాన్ని ఎడా పెడా వాయించాడట! కోపంగా నోరు తెరచిందట. అయితే ఈల మ్రోగేలోగానే నోరు మూసేసిందట - మామయ్యకేం తెలుసు ఈల మ్రోగకుండా తల బయటకు తీసేయాల్సి వుండాల్సిందని.—— అబ్బాయ్ ఇదీ కధ. అసలు ఇదివరకు ఇలా జరిగితేనే పోస్టు ఖాళీ అయి మామయ్యకు ఉద్యోగం వచ్చిందని చెప్పేడు దేవిడ్. అయితే ఆ సంగతి మీకు చెప్పడం నేను మర్చిపోయాను. ఇప్పుడేనా జ్ఞాపకం వచ్చింది కదా! పోన్లెండి.

క్షవర కల్యాణం పూర్తి అయిన వెంటనే అద్దంలోకి చూస్తే - ఎవరో మరో అబ్బాయి కనబడ్డాడు. అది నేనేనని గుర్తు పట్టడానికి పది నిమిషాలు పట్టింది. వాడు నరికి పోగులెట్టిన జుట్టు కుర్చీలో కూర్చున్న నా మోకాలెత్తు దాకా చిన్నసైజు కొండలా పడివుంది. (కుర్చీలో కూర్చున్నది మోకాలు కాదని, నేనేనని గ్రహించ ప్రార్థన)- జుట్టు పోయినందుకు బాధకాదుగాని - ఇంతమంచి కథలు చెప్పే బార్బరుగారి దివ్యదర్శనం చేసుకునే భాగ్యం ఆరు నెలలదాకా కలగదన్నదే నా బాధ....

ఇదీ నా జాలిగాథ.... (సాలోయాన్ మహాకవి శ్రీశ్రీకి చాలా ఇష్టమైన కథా రచయిత)

—o—

# ". నా బంగారు కన్నంలో వేలుపెడితే కుట్టినా "

## (THE MAN WHO SAVED PUMPLES DROP)

—డబ్ల్యూ. జె. టర్నర్ (ఇంగ్లండ్)

పంపుల్స్ డ్రాప్ ఓ ముఖ్య పట్టణం కాని ముఖ్య పట్టణం. అది సంపన్నమైన ఊళ్ళమధ్య కీలక స్థానంలో వుండడంచేత అది వ్యాపార కేంద్రమయిందికాని దానికంటూ ఒక ప్రత్యేకత ఏంలేదు. రైతులు, పళ్ళను అమ్ముకునేవారు, అనేక ఇతరమైన వ్యాపారాలు చేస్తూండేవారు. చవగ్గా వస్తువుల్లభిస్తాయని వినియోగదార్లూ - చకచకా అమ్ముడుపోతాయని అమ్మకందార్లూ ఆ పట్టణంలో వ్యాపార కార్యక్రమాలు కొనసాగిస్తూండడంతో ఆ పట్టణం ఆర్థికంగా మూడు పువ్వులూ ఆరు కాయలుగా వర్థిల్లుతోంది. అయితే అనావృష్టి కారణంగా ఆ చుట్టుప్రక్కల గ్రామాల్లో పంటలు దెబ్బతిన్నాయి. ఐదు ఆరు సంవత్సరాలుగా పంపుల్స్ డ్రాప్ నిస్తేజంగా, నిర్జీవంగా వ్యాపారం స్థంభించి బండి లాగిస్తోంది. ఆశ అన్నది మానవాళికి సహజంకదా! మంచిరోజులు రాక మానవా అన్న ఆశతో ఎదురు చూస్తున్నారు. చుట్టుప్రక్కల ధాన్యలక్ష్మి ఆనంద తాండవం చేస్తే — ఇక్కడ ధనలక్ష్మి గజ్జెల నృత్యం చేస్తుంది. అయినా ఇలాటి ఏ వనరులూ లేని పట్టణం అంత గొప్ప వ్యాపార కూడలిగా, వుండటమే ఆశ్చర్యాల లోకెల్లా ఆశ్చర్యం.

1933 సంవత్సరంలో డిశంబర్ ఐదవ తేదీకాబోలు.... ఆ రోజున ఈ పట్టణం యావత్తునూ కుదిపి వేసిన సంఘటన ఒకటి జరిగింది.

అప్పుడు ఆ శీతాకాలంలో మధ్యాహ్నం 12 అయుంటుంది. ప్రిన్సిపల్ మోటార్‌కార్ డీలర్స్ అనే బోర్డువున్న ఒకషాపుకి ఒక ఆసామీ వచ్చాడు "ప్రొప్రైటర్ ఎవరు?" అని అడిగాడు, మామూలుగా వ్యాపార లావాదేవీలు రద్దీగా వుంటే "ప్రొప్రైటర్ గారు పనిలో వున్నారు, వచ్చిన పని చెప్పండి" అనేవాడు ఏ గుమాస్తాయో. ఈగలు తోలుకుంటూ కూర్చున్న ఈ తరుణంలో అసలు పలకరించేవాడు దొరికేడు, అందుకే ప్రొప్రియిటర్‌గారికి ఈకబురు వెళ్ళింది. ప్రొప్రియిటర్ ఆదరా బాదరగా రానేవచ్చాడు.

వచ్చినాయన ప్రొప్రయిటర్‌కి తన విజిటింగ్ కార్డుని అందించాడు. ఆశ్చర్యం దేశంలోకెల్లా పేరున్న గొప్పధనవంతుడి కుమారుడట! అయితే ఆ ధనవంతుడు ఇక్కడికి సుమారు వందమైళ్ళదూరంలో నివసిస్తున్నాడు. ఈ మోటార్ కంపెనీ యజమానికి అలాంటి పెద్ద పెద్ద కస్టమర్స్‌తో వ్యాపారం చెయ్యాలని సరదా—అయితే ఇంతవరకూ అలాంటి పెద్ద పెద్ద కాతాలు తగల్లేదు. అంచేత—

"మీకు నేనేం సేవ చెయ్యాలి సర్!"అని అడిగాడు ప్రొప్రెయిటర్.

"చూడండి - క్రిస్మస్ నాటికి నాకు లేటెస్ట్ మోడల్‌వి రెండు రోల్స్‌రాయిస్ కార్లు కావాలి - చాలా అర్జంటు - దయచేసి మీ క్యాటలాగు ఇలా పడేస్తే నేనే సెలక్ట్ చేసుకుంటా" అన్నాడు.

క్యాటలాగు అయితే వుంది గాని ఈ పరిస్థితిలో రిస్క్ తీసుకుని ఆర్డర్‌చేసి షో కేస్‌లో పెట్టడానికి సాహసించలేదు ప్రొప్రెయిటర్. వృధాగా బేరం చెడగొట్టుకునే మూర్ఖుడూ కాదు తను. అందుకే కర్ర విరగకుండా పాము చావకుండా....

"రెండు మూడ్రోజులలో కన్‌సైన్‌మెంటు వస్తుంది. అందాకా...."

"ఆల్‌రైట్....మరో షాప్...."

"అహ(హ( లేద్సార్....అర్జంటుగా రింగప్ చేస్తాను....మీకంత అర్జంటయితే...."

"నాకేం అర్జంట్‌లేదు. 'క్రిస్మస్ ఈవ్' నాటి పొద్దున్న డెలివరీ ఇస్తే సరిపోతుంది. మీకు చెక్ ఇమ్మంటారా క్యాష్....ఇమ్మంటారా...."

"హ్హె హ్హె హ్హె....అబ్బే ఏదయినా పర్లేదు....ఈవేళే ఆర్డరిస్తా" అంటూ ఆ అసామీ వుండగానే కంపెనీకి రింగ్‌చేసి రెండు కార్లు బుక్ చేశాడు.

"మళ్ళీ బేరాలు వచ్చాయని మరొకరికి అమ్మేరు సుమండీ-క్రిస్మస్ నాటి ఉదయం....జ్ఞాపకం వుంచుకోండి" అంటూ కరచాలనం చేసి వెళ్ళి పోయాడు.

ఆర్డర్ ఖాయం చేస్తూన్నట్టు వెంటనే కంపెనీ నించి సమాధానం వచ్చింది. ఆనాటి ఉదయమే చెక్ ఇచ్చి ఫలానా బ్యాంక్ ద్వారా డెలివరీ తీసుకోవాల్సిందిగా సూచించారు.

ఆ ఆగంతకుడు వెళ్ళిపోగానే ప్రొప్రెయిటర్ గారు హుషారుగా ఈలేసుకుంటూ - ఇంటికి పరిగెత్తేడు. పిల్లల్ని ఆప్యాయంగా ఎత్తుకు గిర గిరా తిప్పేడు - ముద్దులతో ముంచెత్తాడు. ఉక్కిరి బిక్కిరిగా బిత్తర పోయారు పిల్లలు. భార్యామణి విషయంలోనూ అంతపని చేసి వుండేవాడే గాని ఎదురుగా తల్లిదండ్రులు వుండడంతో ఆతని సంస్కారం అడ్డు వచ్చింది....

"ఏరా అబ్బాయ్! ఏంటీ హుషార్?" అని అడిగేడు తండ్రి.

"ఆర్డర్-నాన్నగారూ ఆర్డర్! రెండు లేటెస్టు లిమోజైన్ మోడల్స్‌కి ఒక్కసారే ఆర్డర్ వచ్చింది - మనకి ఒకే దెబ్బలో ఆరువేల పౌండ్ల లాభం" ఎగిరి గెంతేసినంత పని చేసినట్టు చెప్పాడు అబ్బాయి.

"చాలా సంతోషం....బాబూ....సంతోషం" అంటూ జల జలా ఆనందబాష్పాలు రాల్చాడు తండ్రి.

"అబ్బాయ్ ప్రొద్దున్న కాస్త కాఫీ తప్ప ఏం తీసుకోలేదు—భోం చెయ్యి ముందు" అంది అమ్మ.

"ఏమండీ! క్రిస్మస్ నాటికి నాకు నెక్లెస్ చేయించి పెట్టరూ?" గోముగా అడిగింది భార్యామణి బటన్ గుండీని మెలిపెడుతూ మూతిని సున్నా చుట్టి....అది బెడ్‌రూంలో సుమండి!

అందుకే అన్నారు తల్లి ఆకలి చూస్తుందని భార్య పర్సుని చూస్తుం

దనీ. అదేమంత తప్పుకాదుగా....ఎవరి సహజ లక్షణాలు వాళ్ళవి.

"ఓ యస్. జూయలర్ షాపుకి వెళ్ళి నీ ఇష్టం వచ్చిన నెక్లెస్-మూడువేలు శాంక్షన్" అన్నాతను.

ఆమె చాలా అందంగా వుంటుంది-రవ్వల నెక్లెస్‌లో మరింత అందంగా మెరిసిపోతుంది - కలలుగంటూ నిద్రలోకి జారుకున్నాడు.

మర్నాడు భార్యామణి జూయలర్ షాప్‌కి వెళ్ళి క్యాటలాగులో మంచి మోడల్ సెలక్ట్ చేసుకుని ఓ మూడువేల రూపాయల్లో ఆర్డరిచ్చి చక్కా వచ్చింది.

ఈలేసుకుని ఇంటికి పరిగెత్తి కౌగిలించుకుని ముద్దులలో ముంచెత్తడం ఈ మాటు జూయలర్‌గారి వంతయింది. ఈ మాటు ఆయన నేరుగా భార్యామణి పనినే పట్టేశాడు - పిల్లలు స్కూల్లో వున్నారు. అమ్మా నాన్నా గదిలో నిద్దరపోతున్నారు. ఒక విధంగా మోటర్ల కంపెనీ ప్రొప్రైటర్‌గారికన్నా అదృష్టవంతుడు కదూ! మరో విధంగా కూడా అతడు అదృష్టవంతుడు. కేవలం పదిహేనువందలపౌండ్ల నెక్లెస్‌ని మూడువేలకి ఖాయం చేశాడు - ఎలాగైనా నగల వ్యాపారుల బుర్ర అమోఘం కదా!

"భార్యామణీ—నీ కొక్క వరంబొసంగెద—గైకోమ్మా!" అన్నాడు వరమిచ్చే పోజులో.

"నాకూ....నాకూ.... ఉన్నికోటుకావాలి...." అంది ముద్దు ముద్దుగా మందాకిని.

"నువ్వే ఆర్డరిచ్చుకో...." అని ఓ ఆర్డరు జారీ చేసి షాపుకి పరిగెత్తేడు - నెక్లెస్ తయారీకి ఆర్డరివ్వడానికి. ఆకాశంలో ఉరుములు మేఘాలు కనిపిస్తే వర్షాగమన సూచకమేకదా! వర్షాలు వస్తే పంటలు పండుతాయి

కదా. చుట్టుపక్కల గ్రామాల్లో పంటలు పండితే మనపంట పండినట్లే - అని వూరంతా తన భావాల్ని వ్యాపింప చేసింది.

అందరూ తమ తమ కలుగుల్లోంచి పైకి వచ్చి - భవిష్యత్తులో మాడిపోతామన్న భయం వల్ల దాచుకున్న "మూల" (నున్న) ధనాన్ని తీసి విచ్చలవిడిగా ఖర్చు చెయ్యసాగేరు, ఓహ్- పంపుల్స్ డ్రాప్ మొత్తం కలకలలాడుతోంది. హోటళ్ళన్నీ మైకుల పాటల్తో గింగిర్లెత్తిస్తున్నాయి! పిల్లలు ట్యూషన్లకి వెడుతున్నారు - పుస్తకాల షాపులు, ఫ్యాన్సీ షాపులు ఒకటేమిటి అన్నిటి షట్టర్లూ పైకి లేస్తున్నాయి. క్రిస్మస్ అలంకరణలు జోరుగా సాగుతున్నాయ్.

డిశంబర్ 24.... 24....24 అని పలవరించి పోతున్నారు.... అందరూ....

అందరికంటే ఆ రోజుముందే హుషారుగా లేచింది మన మోటార్ కార్ల కంపెనీ ప్రొప్రైటర్ గారు. అప్పటికే అతని షోరూంలో రెండు బ్రాండ్ న్యూలిమోసిన్ కార్లు తళతళలాడిపోతున్నాయి. ఈ కార్లే మొత్తం పట్టణానికి కొత్త శోభను సంతరించి పెట్టిన సంగతి ఆ పట్టణంలో ఎవరికీ తెలియదు. తెలియనవసరం లేదేమో కూడా. హతవిధీ! వస్తానన్న ఆగంతకుడిగారి దర్శన భాగ్యం ఎంతకీ కలగడం లేదు. మన కార్ల కంపెనీ యజమానిగారికి నడి శీతాకాలంలో ముచ్చెమటలూ పడుతున్నాయి. ఆయనగారు దిగబడ లేదుకాని ఆ వూళ్ళో పేరు మోసిన హార్డ్‌వేర్ మర్చంట్ గారు - హేపీక్రిస్మస్ చెవుదామని వచ్చి ఈ కార్లని చూశాడు. తనకి ఈ దగ్గరలో వున్న ఓ పెద్ద పిచ్చాసుపత్రినించి చుట్టూ ఇనపతీగలతో ఫెన్సింగ్ కట్టమని ఓ పెద్ద ఆర్డరు వచ్చిందని ఆ బిల్లురాగానే మిగతా డబ్బు చెల్లిస్తానని తనకో కారు కావాలని అడిగాడు.

ఇవి ముందేబుక్ అయిపోయాయని నెక్స్ట కన్‌సైన్ మెంట్‌లో

ఇస్తాననీ చెప్పబోయి, అసలు ఈ పిచ్చాసుపత్రి వ్యవహారం "ఏమిటని అడిగేడు.

పిచ్చాసుపత్రికి ఫెన్సింగ్ లేకపోడంచేత — ఓ పెద్దకుటుంబానికి చెందిన ఓ యువకుడు తప్పించుకు పోయాట్ట - ఆయనగార్ని తిరిగిపట్టుకు తీసుకువచ్చేసరికి వాళ్ళతాతలు దిగివచ్చారట - అందుకని ఆ కుటుంబం వారే ఎంత డబ్బైనా సరే ఖర్చుచేసి చుట్టూ ఫెన్సింగ్ కట్టీయమని హాస్పిటల్‌కి డబ్బిచారట - అంటూ ఆ కుటుంబానికి చెందిన విజిటింగ్ కార్డు ఒకటి అందించాడు - ఈ మోటార్ కంపెనీ యజమానిగారు తన జేబులోని కార్డుతీసి రెండు కార్డులూ ఒక దానిప్రక్కనుంచి చూశాడు....

ఆశ్చర్యం - అవి ఒకే విజిటింగ్ కార్డులు........

(అయితే పంపుల్సుడ్రాప్ పుంజుకుందా లేదా....అన్నది కాదుప్రశ్న ....మళ్ళీ పంపుల్సుడ్రాప్ కోలుకునే అవకాశం లేకపోలేదు - రాజుగారు, ఏడు చేపల కథలో ఒక చేప ఎండడానికీ....అబ్బాయి చీమ కన్నంలో వేలుపెట్టడానికీ ఉన్న సంబంధం లాటిదే ఎకనమిక్ ఏక్టివిటీ అన్న సత్యానికి ఈ కథ అద్దం పడుతుంది.

—:o:—

# 8. స్నేహమేరా జీవితం —స్నేహమేరా శాశ్వతం

(Friends in San Roserio)

— ఓహెన్రీ (యునైటెడ్ స్టేట్స్)

అప్పుడు సరిగ్గా ఉదయం 8-20 అయింది. ఆజానుబాహువు—అర వింద దళాయి తాక్షుడు ఔనో కాదో కళ్ళద్దాల వెనుక కనబట్టంలేదు. నల్లనివాడు కాదుకాని చేత ధరించిన బ్రీఫ్‌కేస్ నల్లగానే వుంది. రైలు దిగి తిన్నగా పెద్దపెద్ద అడుగులేసుకుంటూ స్టేషన్‌లో ఓ ఫర్లాంగు దూరంలో వున్న ఓ రెస్టారెంట్‌ని దాటి వెళుతున్నాడు. రెస్టారెంట్‌లో కూర్చుని, అప్పుడే రైలుదిగిన ప్రయాణీకులు, ఆవురావురుమంటూ టిఫిన్‌లు తిని కాఫీలు త్రాగుతున్నారు. రెస్టారెంట్‌లోంచి నాసికాపుటాల్ని తాకి నోరూ రించే సువాసనలుకూడా ఆ నరమానవుడిలో ఏవిధమైన చలనాన్ని కలి గించలేదంటే చాలా ముఖ్యమయిన పనిమీదే వున్నట్టున్నాడు గురుడు-

మూడు నాలుగు మలుపులు తిరిగి ఎదురుగా గర్వంగా నిలబడి వున్న "శాన్ రోజరియో జాతీయ బ్యాంక్" ముందు నిలబడ్డాడు—పరిశీల నగా చూశాడు. తల పంకించాడు. తన జేబులో చెయ్యిపెట్టి ఓ చిన్న విజి టింగ్ కార్డులాటిది పైకితీసి ఒకసారి పరిశీలించి—మెరిసీ మెరవని చిరు నవ్వుని బలంగా అదిమిపట్టి—కృతనిశ్చయంతో లోపల ప్రవేశించాడు. అప్పుడే బ్యాంకు సిబ్బంది కొంతమంది వచ్చారు—వాళ్ళవాళ్ళ సీట్లలో సర్దుకుంటున్నారు. మరికొందరు వస్తున్నారు. క్యాషియర్ కరెన్సీ లెక్క పెట్టుకుని కొంటరు తాళాలు తీసుకుని ఇంక కొంటరులో ప్రవేశించేందుకు సిద్ధంగా వున్నాడు. మన ఆగంతకుడుగారు కేష్ కొంటర్‌ముందు నిలబడి

---

ఓ హెన్రీ మహాశయుని వంద కథలను పరిశీలించి ఎంపిక చేసిన కథ.

సిద్ధంగా వున్నాడు. కేషియర్ విసుగ్గా మొహంపెట్టి కౌంటర్ తెరవడానికి ఇంకో పదినిమిషాలు పైముంది మహానుభావా!" అన్నాడు.

వచ్చిన ఆసామీ జేబులోంచి ఓ కార్డుతీసి కౌంటరు కన్నంలోంచి పైకి తోశాడు దానిమీద........

జె. ఎఫ్. సి. నెటిల్ విక్—
నేషనల్ బ్యాంక్ ఎగ్జామినర్

అని వుంది.

క్యాషియర్‌గారు కంగారుపడిపోయాడు.

"మీ....రా సర్!....మీరు ఇదివరకు ఎప్పుడూ ఇటు రాలేదనుకుంటాను....అందుకే మీరు ఎవరో కస్టమర్ అయుంటారనుకున్నాను. క్షమించండి....అటు తిరిగిరండి సర్....ముందు మేనేజర్‌గారిని కలవడం పద్ధతి కదా!....పరిచయం చేస్తాను" అన్నాడు భయము, నయము, విస్మయము గదుర....(జయము అనేమాటకలిపితేపసందయిన పద్యపాదం అవునుకాని ప్రాసకోసం కూసుగాడా అన్నట్టు రంగం చెడుతుంది)

బ్యాంకుమేనేజరు మేజర్ థామస్—బి. కింగ్‌మన్ మహాశయుడు—అయితే ఎంత పెద్దపేరుపెట్టినా చివరకు మిగిలేది టాం డిక్,హ్యారీలాంటిది ఏదో మిగులుతుంది. అతని పూర్తిపేరుతోకాక మేజర్‌టాం అని పిలుస్తుంటారు. పరస్పర పరిచయ్యాలు అయ్యాక

"అరె మీరొచ్చారేమిటి? మేం వస్తాడనుకుంటోన్నది శాం టర్నర్ కదా! నాలుగేళ్ళనించి ఆయనే మా బ్యాంకు ఇన్స్‌పెక్షన్ నిర్వహిస్తున్నాడు-అహ! దానికేముందిలెండి... మాది చిన్న బ్యాంక్ ఏదో గెంటుకొస్తున్నాం తప్ప మా టర్నోవర్‌కూడా అంతంతమాత్రం. కొంచెం నిదానంగానే చేతురుగాని....అసలు టర్నరయితే అసలేం చూడకుండానే వెరిఫైడ్‌అండ్ ఫౌండ్ కరక్టు అనిరాసి పారేయండి క్రింద వేలుముద్దర వేసేద్దాంఅంటాడు హ్హహ్హహ్హా!" అంటాడనికాదు-మా లావాదేవీలు అంతవిర్దుష్టంగా వుంటాయి

సుమా! అని అయితే ఆయన వెరిఫై చెయ్యకమానడు హ్హా! హ్హా! హ్హా!
అంటూ వెర్రినవ్వులాంటిదేదో నవ్వేశాడు. ఈ ఆడిటర్‌గారిది కర్రపిడి వ్యాపారం. ముఖంమీద ఏ భావాలూ పట్టుకోలేరు.

"ఇటు వాళ్ళు-అ ప్రాంతానికి ఆ ప్రాంతంవాళ్ళు ఈ ప్రాంతానికి మారి చెక్ చెయ్యాలని స్పెషల్ ఆర్డర్సు వచ్చాయి"....అని వాడివాడిగా అనేసి "క్యాష్‌కౌంటర్‌కి, స్ట్రాంగ్‌రూమ్‌కీ పదండి అన్నాడు" ప్యాంటు జేబులో చెయ్యిపెట్టుకుని స్టిఫ్‌గా లేస్తూ.

"ఆల్‌రైట్ పెర్రిడోర్ఫ్! ఈయన వ్యవహారం చూసుకోవోయ్" అన్నాడు క్యాషియర్‌వైపు చూస్తూ.

పెర్రీడోర్ఫ్ మహాకాయుడు.అతనిచేతితో చిల్లరలెక్క పెట్టేటప్పుడు చూడాలి చిన్నచిన్న తుపాకీ రవ్వల్లా మెరుస్తుంటాయి నాణేలు.

ఈ నాణేల లెక్క ప్రహసనం ఇలా జరుగుతోండగా ఓ చిన్న తమాషా — జరిగింది. టాం కింగ్‌మన్ - మెస్సెంజర్ "రాయ్"కి కళ్ళతో ఏదో సంజ్ఞ చెయ్యడం రాయ్ మెల్లిగా ప్రక్కనుంచి రోడ్డుమీదకి జారిపోడం - తిన్నగా స్టాక్‌మన్ నేషనల్ బ్యాంక్‌కి పరుగు తియ్యడం జరిగింది. బహుశా అవతల మా బ్యాంక్ ఇన్‌స్పెక్షన్ జరుగుతోందని ఉప్పు అందించమని పంపేడో లేక అక్కడ పైసలు తగ్గాయి ఎడ్జస్టు చెయ్యమని పంపేడో అనుకుంటే అది పొరపాటు. ఒకచోట ఆడిటింగ్ జరుగుతోంటే మరో బ్యాంక్‌కి ఉప్పు అందించడం వాళ్ళల్లో వాళ్ళు ఏర్పాటు చేసుకున్న ఒక అవగాహన- కేవలం అండర్‌స్టాండింగ్.

ఆ బ్యాంకు మేనేజర్ కూర్చుని ఏదో రాసుకుంటున్నాడు. ఇలా కొత్త ఆడిటర్ వచ్చి నానా పెంటా పెడుతున్నాడని విని— చిరునవ్వు నవ్వేడు బక్లీ అనే ఆ మేనేజర్. రాసే రాసే ఫైలుని ప్రక్కన పెట్టేడు—

"కూర్చోవోయ్ రాయ్— టేక్ యువర్ సీట్" అన్నాడు. "నో సర్ మళ్ళీ వెళ్ళిపోవాలి -వచ్చిన కొత్తాయన ఛండశాసనం ముండావాడిలా ఉన్నాడు".

"కాఫీ త్రాగి వెళ్ళవోయ్ - ఈలోగా ఉపద్రవాలేం జరగవు- కాఫీ కూడా "ఉప" ద్రవమే.... హ్హె! హ్హె!హ్హె" అని నవ్వేశాడు....

"కాద్సర్"

"ఏదీలేదు సర్, "తప్పదు" అని ఫ్లాస్కులోని కాఫీ కప్పులో పోసి అందించాడు- చాలా చిన్న స్థాయినించి పైకి వచ్చిన మేనే జర్లేమో— వాళ్ళెప్పుడూ తరతమ బేధాల్ని, అంతరాల్ని పాటించేవారు కారు....

కాఫీ పూర్తిచేసి "వస్తాను సర్" అని లేచాడు రాయ్. "చూడు మిస్టర్ రాయ్.... సమయానికి ఆదుకోలేనందుకు అయాం సారీ.... ఈ ఉత్తరాన్ని మీ బాస్‌కి ఇవ్వు".

"సమయానికి ఆదుకోవడం ఏమిటి సర్!" వెర్రి మొహం వేశాడు రాయ్-

"ప్రశ్నలొద్దు- నే చెప్పినట్టు చెయ్యి" అన్నాడు బక్లీ.

"పెద్దవాళ్ళ గోలలు మనకేల? అనుకుని అతడిచ్చిన కవర్‌ని జాగ్రత్తగా తీసికెళ్ళి టాంకి అందించాడు. సందేశాన్ని కూడా వినిపించాడు చెవిలో. ఈలోగా ఆడిట్ ఇన్స్పెక్షన్ చరమ ఘట్టంలోకి వచ్చింది. ఇంక "చివరి ఐటమ్ - లోన్స్ - దాంతో ఈ ఇన్‌స్పెక్షన్ పూర్తి అయిపో తుంది.... ఈ మాటు అంతా పర్‌ఫెక్టుగానే వుంది ఇంత వరకు. ఇల్లల గ్గానే పండుగ అనుకోకండి - ఎప్పటికైనా మిమ్మల్ని హ్యాండ్సప్ అని పించగలను" అంటూ లోన్ ఓచర్స్ ఫైల్‌ని గబగబా ఒకదాని తరువాత ఒకటి చకచకా తిరగేసి - తన బ్రీఫ్‌కేస్ తీసి నోట్స్‌లో అన్ని అయి టమ్స్ ముందూ "రైట్" మార్కులు పెట్టేసి ఓ లోన్ ఓచర్స్ ముందు మాత్రం " ? " పెట్టి టప్పున మూసేసి -

"థాంక్యూ మిస్టర్ కింగ్‌మన్.... సీయూ".... అనబోయి — ఒక్కసారి మీ గదిలోకి దయ చేస్తారా .... మాట్లాడాలి" అన్నాడు.

ఇద్దరూ మేనేజర్ గారి ప్రత్యేకమైన గదిలో కూర్చున్నారు. ఆడిటర్ చాలా హుషారుగా వున్నాడు. అది తాను ఆడిట్‌ను రికార్డు స్పీడులో ముగించినందుకు తనను తాను అభినందించుకుంటున్న హుషారు కావచ్చు. లేదా మరో హేతువుకు కావచ్చు. ఆయన ఏమంటాడో వింటే గాని చెప్పలేం.

"అయ్యా ఘనత వహించిన మేనేజర్ గారూ మీ బ్యాంక్ నిర్వహణ చాలా ప్రశంసనీయంగానే వుంది. "నే" అనేది గుర్తు పెట్టుకోండి. ఈ పంటలు దెబ్బతినడం మూలానా చాలా బ్యాంకులు చేతులెత్తేసిన తరుణంలో స్వల్పలాభాల్లోనా గెంటుకొస్తున్నారంటే ప్రశాంశార్హమే — మీ గుమాస్తాలంతా ఒళ్ళు వంచి కష్టపడి పని చేసే స్వభావం కలవాళ్ళే - లెడ్జర్లు, పద్దు పుస్తకాలు, కరెన్సీ నోట్ల లెక్కలు, చిల్లరతో సహా టక్ మని బ్యాలన్సయా యంటే - నేను మిమ్మల్ని అభినందించే తీరాలి.... కాని .... కాని ...."

అల్పపీడనం తాకిడినుండి తీరం బయట పడిందనుకుంటే....మళ్ళి వెను దిరిగి ముంచుకొచ్చిందేమా అని షాక్ తిన్నవాడిలా కనపడుతున్నాడు "టాం" అయితే నెటిల్‌విక్‌గారికి "కుంజర యూథంబు దోమకుత్తుక చొచ్చెన్" అన్నంత హుషారుగా వుంది.

"చూడండి మిస్టర్ టాం 40 వేల పౌండ్ల ముఖవిలువ కల కేవలం ఆరు బాండ్ పత్రాలు మీఫైల్లో కనపడటంలేదు. వాటి విజవిలువ 70 వేల వరకూ వుండచ్చు - మరి అవి ఏమయ్యాయో మరి....అవి....?"

"అదే చెప్పబోతున్నానసర్! అని ఒక్కసారి నాటకీయంగా గొంతు సవరించుకుని లేచి పైపువెలిగించాడు "టాం". నెటిల్‌విక్ విలాసంగా సిగరెట్ వెలిగించి గుండెలనిండా పొగపీల్చి రింగు రింగులుగా వదుల్తూ...వెటకారంగా.....

"ఊఁ....చెప్పండి సర్"

"అబ్బే ఏం లేదు. సర్! ఇది మా స్నేహితుడు "బాబ్"దధ-వాడు నేనూ చిన్నప్పట్నించీ ఒకే కంచం, ఒది మంచంగా పెరిగిన వాళ్ళం - ఇద్దరం పేదరికంలోంచి పైకి వచ్చిన వాళ్ళం వాడూ పశువుల్నికాశాడు – నేను కాశాను. బాగా పశువుల ధరలు పలికినపుడు నేను డబ్బుచేసి వాడు షేర్ బ్రోకర్‌గా ఎదిగాడు. నేను బ్యాంకు మేనేజర్‌గా ఎదిగాను. అయితే ఏరోజూ వాణ్ణి నేనుగాని వాడు నన్నుగాని కలుసుకోకుండా వుండే వాళ్ళం కాదు. వాడికి గుర్రప్పందేలంటే తగనిపిచ్చి........

"ఇరవై సంవత్సరాలు వెనక్కివెడితే (బాబూ ఈ పురాణం నాకెందు కట!! ఈ 70వేలకీ దీనికీ ఏమిటట సంబంధం - విసుక్కున్నాడు నెటిల్ విక్) నేను ఈ గ్రామానికి షరీఫ్‌నయ్యాను. వాణ్ణి నా శక్రటరీని చేసుకు న్నాను. ఇది మేం పశువుల బేరాల్లో సొమ్ము చేసుకోకముందే ననుకోండి. అయితే అప్పుడు షరిఫే కలక్టరుగా కూడా వ్యవహరించేవాణ్ణి - ఈ రోజుల్లో కలక్టరంటే, షరిఫంటే తేలికైపోయింది గాని ఆ రోజుల్లో అది చాలా గొప్ప. అప్పుడే నాకు ఒక గుర్తింపువచ్చి పిల్లల్నివ్వడానికి ముందు కొచ్చారు. అంతవరకూ నేను తోక తెగిన గాలిపడగలా తిరిగిన వాణ్ణే హ్హా! హ్హా! హ్హా! "అనినవ్వి చిలుముపట్టిన పైపుని దులిపి - మళ్ళీ దాన్లో టొబేకోని దట్టించి, దీర్ఘాలోచనగా అటూ ఇటూ తిరుగుతూ - ఆలోచిస్తు న్నాడు.

నెటెల్‌విక్ - రెండోద్యాంకు పనికూడా సాధ్యమైనంత తొంద రగా ముగించుకుని 11-35 ట్రెయిన్‌లో వెళ్ళిపోదామనే ఆత్రంలో వున్నాడు ఈ 70వేల పౌండ్ల కుంభకోణం ఏమిటో తేలాలి. ఆలస్యాన్నైనా సహించ గలడుగాని అవినీతి క్షమించడం తన నిఘంటువులో లేదు. "త్వరగా తెమ ల్చవయ్యా మహానుభావా!" అవి మనస్సులో అనుకోగలడు కాని పైకి తేలాడో తనుతేలికైపోతాడు - ఈలాటి టాం, డిక్, హ్యారీలు తనకి కొత్త కాదు. గ్రీన్‌విచ్ గ్రామంలో నేషనల్‌గ్రిండ్లీ బ్యాంక్‌లో క్యాష్‌టేలీ కాలేదు. తను విలదీసేసరికి క్యాషియర్ జేబులోంచి రివ్వాలరు తీసి కాల్చుకు చచ్చి

పోయాడు. అయినా తను లొంగలేదు - తగ్గిన దబ్బుని భార్యాపిల్లలు పుస్తెలూ పూసలూ అమ్మించి మరీ కట్టించి వదిలాడు. డ్యూటీ అంటే డ్యూటీయే. దాన్లో ఇక వెసులుబాట్లూ, నసుగుళ్ళూ వుండరాదు. విందాం దీనికి ఎలా మసిపూసి మారేడు కాయచేస్తాడో.

టాం హరికధ మొదలెట్టేడు "పెళ్ళంటే నూరేళ్ళ పంట....అప్పటి దాకా అనామకుడిగా వుండిపోయిన వాడికి బాధ్యతలు, బంధుత్వాలు, బంధాలూ పెరుగుతాయి. నువ్వు లేచి కాలకృత్యాలు తీర్చుకుని షేవ్ చేసుకుని పొగలుకక్కే కాఫీ తాగుతోంటే ముద్దు ముద్దుగా మీపాపా, బాబూ గుడ్ మోణింగ్ డాడీ అంటూ ఆప్యాయంగా బుగ్గలమీద ఒకపప్పీ ఇచ్చారనుకో నిజంగా ఒళ్ళు ఆనందంతో పులకించిపోదోయ్-

ఇంకోరౌండ్‌లో ఒరేయ్ - ఏరా....అని తరవాత "ల-"కారప్రయోగంలోకి కూడా దిగేలావున్నాడు-

బాబూ "టాం" గారూ ప్రాణాలు తియ్యక సబ్జెక్ట్‌లోకి రండి" అన్నాడు అసహనంగా వాచీని చూసుకుంటూ—

"ఆ ఎక్కడున్నాం? నాకు పెళ్ళయిన ఆర్నెల్లకే మా"బాబ్"గాడూ పెళ్ళాడేశాడు. షరా మామూలే వాడు గుర్రపు రేసులు మాత్రం మానడు- మా చెల్లెమ్మ అంటే ఐమీన్, మా"బాబ్"గాడి భార్యామణి మాత్రం కన్నీళ్ళు పెట్టుకుని "చూడండి అన్నయ్యగారూ.... ఈయన ఇల్లట్టకుండా ఎలా తిరుగుతున్నారో" అని తరచు బాధపడుతూండేది.

"ఏం చెల్లెమ్మా—వాడికీ రేసులూ లాభసాటిగానే వున్నాయిగా- వాడి జాతకంలో గెలుపేగాని—ఓటమిలేదు" అని ఓదార్చేవాణ్ని.

"అబ్బబ్బా!" అని నెటిల్‌విక్ చికాకు పడిపోతున్నాడు-ఒకోరౌండ్ స్పీచ్‌కొట్టి, పదేసి నిమిషాలు దీర్ఘంగా ఆలోచిస్తూ వుండిపోవడం—మళ్ళీ ఏదో జ్ఞాపకం వచ్చినవాడిలా -

"ఆఁ ఎక్కడికి కొచ్చింది కధ....యస్...." అని అనబోతుండగా

ఏదో ట్రెయిన్ దడదడ మని చప్పుడు చేసుకుంటూ వెళ్ళిపోతోంది.

"అరె 11-45 ట్రయినా?" కంగారుగా అనేశాడు నెటిల్ విక్.

"మరేం కంగారు లేదు సర్ ఇది పదీ నలభై డౌన్ ట్రెయిన్. మీది అప్ ట్రెయిన్ కదా....మరోగంటపైగా టైము వుంది. మీరు తీరుబడిగా డిన్నరే తీసుకు వెళ్ళొచ్చు."

"మరి ఆ రెండో బ్యాంకు సంగతి?"

"మళ్ళీ ఓ క్యాంపు వేసుకుందురుగాని—కంగారేం?"

"నో,నో, ప్రతీదీ అనుకున్న ప్రకారం జరగడమే నా పద్ధతి - ఇంతకీ ఆ 70 వేల పౌండ్ల సంగతి...."

"ఆ వేళ, అది శుక్రవారం, వీక్ ఎండ్ సన్నాహంలో (శని ఆది వారాల సెలవలు) బాబ్ ఇంట్లో ఉండగా మెస్సెంజర్ 65 వేల పౌండ్ల క్యాష్ తెచ్చి బ్యాంక్ కి రమ్మన్నాడు. సరే మళ్ళీ ఎవడు వెనక్కొ-స్తాడని చెప్పేసి-"బాబ్" ఐరన్ సేఫ్‌లో దాచి తాళాలు వాడికే ఇచ్చి ఇద్దరం బోట్ షికార్ ప్లాన్ చేసుకోడంలో మునిగిపోయాం. సరే ఆదివారం హాయిగా గడిపేసి సోమవారం ఉదయమే తాళాలు తీసి "క్యాష్" పట్రారా అంటే "బాబ్"గాడు నసగడం ప్రారంభించాడు. ఏరా అవి నిలదీసేసరికి దాన్ని గుర్రప్పందేల్లో పెట్టేశాననీ దురదృష్టం కొద్దీ పోగొట్టుకున్నాననీ-మళ్ళీ నెలలో తనకి రావలసిన షేర్లు వున్నాయనీ, ఎడ్జస్ట్ చేస్తాననీ...."

"సర్" అంటూ రాయ్ ప్రవేశించి ఏదో కవర్‌ని అందించి-"సర్!" అని తల వొంచి వినయంగా వెళ్ళిపోయాడు. అయితే ఎగ్జామినర్ మాత్రం-ఆ కవర్‌లో ఏమి వుండి వుంటుందో-దాన్ని జేబులో పెట్టుకునే ప్రయత్నం చేస్తేరెడ్ హ్యాండెడ్‌గా పట్టుకుందామని రెడీగా కూర్చున్నాడు.

"టాం" కవర్‌ని నిర్లక్ష్యంగా చింపి కాగితాన్ని పైకిలాగి ఆల్‌మోస్ట్ చూడకుండానే టేబుల్‌మీద పారేశాడు. కధ మాత్రం కొనసాగించాడు. ఇంతకీ "బాబ్" డబ్బు వాడేసుకున్నట్టు-రెండ్రోజుల్లో సర్దేస్తానంటే...."

"అదంతా నాకనవసరం.... ఉండాల్సిన బిల్స్....ఉండాల్సిన చోట వుండకపోవడం....పెద్ద నేరం....ఏ కాకమ్మ పిచికమ్మ కథలు నా కనవ సరం"....చాలా సీరియస్‌గానే అన్నాడు.

బిత్తరపోతాడనుకున్న "టాం" కనీసం తత్తరపాటు కూడా పడ లేదు "హ్హ హ్హ హ్హ!!" అంటూ వికటాట్టహాసం చేశాడు.

"కొంపతీసి ఏ రివాల్వరో తియ్యడు కదా....జేబులో చెయ్యి పెడు తున్నాడు" అనుకున్నాడో....అనేశాడో తెలీదు.

"అలాటి ప్రమాదం ఏమీలేదు మిస్టర్ నెటెల్‌విక్....నువ్వు ఆఫీ సులో పుట్టి ఆఫీసులో పెరిగి రూల్సుని భోంచేసి డబ్బుల గల గల మ్యూజి క్‌లో పెరిగినవాడివి!....నీకు సెన్సాఫ్ హ్యూమర్ — ప్రాక్టికల్ జోక్స్ అంటే తెలీదనుకుంటాను-ఇక్కడ మా స్టైయిల్ వేరు. నవ్వుతూ బ్రత కాలిరా తమ్ముడూ నవ్వుతూ చావాలిరా" అన్నది మా తత్వం .... ఘనత వహించిన పరీక్షాధికారిగారూ....మిమ్మల్నో ఆట పట్టిద్దామని మీరు క్యాష్ లెక్కెడుతూండగా ఆ ఫైల్‌లోంచి నేనే కొన్ని బిల్స్ మాయం చేశా.... ఇవిగో ఆ బిల్స్, స్టాక్స్, బాండ్స్, షేర్సు....హ్హ హ్హ హ్హ" అని నవ్వే శాడు....

"నెటిల్‌విట్" చేష్టలుడిగి అలా కూర్చుండి పోయాడు.

"ఆల్‌రైట్, ఆల్‌రైక్" అంటూ తను డైరీలో రాసుకున్న రిమా ర్కులు కొట్టేసి...."మహానుభావా నీ ప్రాక్టికల్ జోక్ కాదు గాని....నేను వేసుకున్న డబుల్ ప్రోగ్రాం పాడు చేశావు కదా....ఇంకా స్టాక్‌మన్ నేష నల్ బ్యాంకు పని రేపే చూస్తా — దయచేసి మీమెస్సెంజర్‌ని సాయం ఇచ్చి గెస్టుహౌస్‌కి దారి చూపిస్తారా-ఈ రాత్రికి ఇక్కడే మకాం" అని ఓ వెకిలి నవ్వు నవ్వేసి – కరచాలనం చేసి "రాయ్" వెనకాల రాగా వెళ్ళిపోయాడు.

ఇక్కడికి ఈ కథ అయిపోయినట్టే కాని....ఓ చిన్న విషయాన్ని చెప్పుకుని ముగిద్దాం.

బల్లమీద నున్న కవర్లో కాగితం మీద ఇలా రాసి వుంది.

ప్రియమైన టాం,

వేట కుక్కలు విజృంభిస్తున్నాయన్న కబురు విన్నాను. టర్న రయితే ఇబ్బంది వుండకపోను. ప్రస్తుతం మా బ్యాంకులో 22000 డాలర్లు బ్యాలన్సు వుంది. ఉండాల్సింది మరో "0" అదనం అంటే 22000 డాలర్లు స్నేహితులు రాన్, ఫిషన్లు - గొర్రెలు కొనుక్కుంటామంటే 20 వేలు అప్పిచ్చాను - మూజువాణీగా .... వెధవలు సమయానికి ఎడ్రస్ లేకుండా పోయారు.

అందుకే ఈరోజు రాత్రికి ఈ ఆడిటర్‌గాడు ఇక్కడే ఆగి పోయేట్టు చూడమని - "హరికథా కాలక్షేపాలు నీ కలవాటేగా" అని రిక్వెస్ట్ చేశాను కథా - హరికథ రంజుగానే సాగుతోన్నట్టు మీవాళ్ళు ఫోన్ చేశారు. మెనీ మెనీ థాంక్స్ — వెధవలిద్దరూ 10-45 ట్రెయిన్‌లో తగలడ్డారు - బేరాల్లో లాభం బాగానే తీశార్ట - డబ్బు రెడీ....నెటిల్‌విక్ గాడు కాదు....వాడి జేజెమ్మ కూడా .... మన పిక్కమీద వెంట్రుక కూడా పీక లేరు.

థాంక్యూ ఫర్ ది కోపరేషన్

బాబ్ బక్లీ.

టాం కవర్‌ని ముక్కలు ముక్కలు చేస చెత్తబుట్టలో పారేసి చేతులు దులుపుకున్నాడు.

....***....

# ౯. "ఇది మరీ అన్యాయం ..."

## (THE ANT AND THE GRASS NOPPER)

—సోమర్సెట్ మాం (ఇంగ్లండ్)

"ఇది మరీ అన్యాయం !!!" జుత్తు పీక్కు- మరీ వాపోయాడు జార్జీ. నేను విలాసంగా సైపుపొగ వదుల్తూ హాయిగా నవ్వేశాను. అసలీ కథ మొదలెట్టాల్సింది ఇక్కణ్నించి కానేకాదు.

0 0 0

మనం చిన్నప్పుడు "చీమ గొల్లభామ" కథ విన్నాం కదా? అదే "మిడత"ని గొల్లభామ అని కూడా అంటారు తెలుసుకదా! అందులో చీమ చాలా సిన్సియర్‌గా పని చేసేదని - వేసవికాలమంతా ఆహారం దొరకని శీతాకాలం కోసం ఆహారాన్ని సేకరించుకుని - దాచుకుని ఆహారం కొరత ఏర్పడే రోజుల్లో హాయిగా దాచుకున్న ఆహారాన్ని తింటూ సుఖపడేదని - ఒక మిడత (గొల్లభామ) మాత్రం ఆహారం దొరికే రోజుల్లో తిన్నంత తిని - ధ్వంసం చేసినంత ఆహారాన్ని మనుషులకు కూడా పనికిరాకుండా ధ్వంసం చేసి- ఆహారపు కొరత ఏర్పడితే క్షుద్బాధకి తట్టుకోలేక, ఆహారం దాచుకున్న చీమ దగ్గరకి వెళ్ళిందని

"చీమా! చీమా!! ఆకలేస్తోంది - అన్నం పెట్టవూ?" అని అడిగిందని.... అందుకు చీమకు చీమైనా కుట్టకుపోగా

"మరి ఆహార సేకరణ దినాల్లో ఏం చేస్తున్నావమ్మా బుల్లెమ్మా?" అని వెటకారం చేసిందనీ, దానికి మిడత

"పాటలు పాడుకుంటూ కాలక్షేపం చేశాను- సారీ" అని పశ్చాత్తాప పడిందని.... దానిమీద చీమ....

"ఇప్పుడు డ్యాన్సు చెయ్యి సరిపోతుంది" అని జవాబు ఇచ్చిందనీ చెప్తారు. అయితే ఈ కథ చెప్పేవారు బోధించదలచిన నీతి ఏమంటే "సరియైన అదనులో కష్టపడితే- కష్టకాలంలో సుఖపడవచ్చు" అన్నది. అయితే నాకు ఈ చీమ ప్రవర్తన అంటే చికాకు కలిగేది. జీవితానికి తిండి

- దాని సేకరణ - తినడం - నిద్రపోవడం - ఇవే సుఖానికి చిహ్నాలనీ, సంగీతం, సాహిత్యం .... ఆనందంలాంటి విషయాలు ఏవో పనికిమాలిన పనీ అనుకునే "మ్యాటరాఫ్ ఫ్యాక్టు" మనుషులంటే నాకు విపరీతమైన అసహ్యం - అందుకే మీరంతా ఆహా ఓహో అనే చీమను నేను మెచ్చు కోలేను.

నన్నడిగితే చీమంత - మూర్ఖపు కీటకం - మరి ఎక్కడా వుండ దంటాను. ఒక్క మూర్ఖురాలేకాదు. తానో పెద్ద క్రమశిక్షణగల సిపాయి నని దానికి బడాయిలావు. వరుసలు వరుసలుగా వెళ్ళిపోతున్నామా లేదా అనేదే దానికి ముఖ్యం కాని ఆ ముందు చీమలు ఎందుకు వెడు తున్నాయి? ఏం తేబోతాయి? తెచ్చిన దానివల్ల ఏం ఉపయోగం అన్నది దానికి ముఖ్యం కాదు. ఏదో వెల్తురున్నంతసేపూ హడావిడిగా తిరిగేస్తు న్నామా లేదా అన్నదే దాని దృష్టి - ఒకాయన రాస్తాడు - ఎవరైనా నేచు రల్ సైన్సు స్టూడెంట్ నోట్ బుక్కూ పెన్సిల్‌తో నిలబడి దానిని పరిశీలి స్తూంటే మరీ బడాయిగా తిరేగేస్తూందట! ఒక నిటారుగా వున్న గుట్ట లాంటిది కనబడితే.... రాబర్ట్ బ్రూసులాగ ఎక్కిజారి.... ఎక్కిజారి.... ఎలాగో కష్టపడి పైకెక్కడానికి ప్రయత్నిస్తుంది గాని, దాని చుట్టు తిరిగి వెడితే సుఖంగా వెళ్ళొచ్చన్న కనీస జ్ఞానం దానికి లేదంటాడు.... సరే ఈ చీమోపాఖ్యానం మనకెందుగ్గాని అసలు కథలోకి వద్దాం....

0 0 0

"జార్జి, టాం"లు రాంసే సోదరులు. జార్జి రాంసే కన్నా టాం రాంసే మహావుంటే రెండు సంవత్సరాలు చిన్నవాడు. అయితే ఆలోచ నల్లో, ఆలవాట్లలో జీవిత విధానాలలో, ఇద్దరివీ విభిన్న ధృవాలు. జార్జి మొదటినుంచీ "రాముడు మంచి బాలుడు. పెందలకడనే లేచి - కాలకృత్య ములు తీర్చుకుని, చలిది భుజించి బడికి పోవును" తరహాగా జీవించేవాడు. ఆతనికి రాంసే వంశంలో జన్మించడమనేది చాలా గొప్ప విషయం. కష్ట

పడి చదువుకున్నాడు. మంచి మార్కులతోనే పరీక్షలన్నీ పాసయ్యాడు. తల్లులూ, తండ్రులూ, ఉపాధ్యాయులూ - తక్కిన పిల్లల్ని" చూడండి! మీరూ జార్జిలా చక్కగా చదువుకోవాలి" అనేలాగే జీవించాడు- ఓ చక్కని ఉద్యోగం దొరికింది. చక్కని చుక్క సాహచర్యం లభించింది పొదుపుగా సంసారాన్ని చేసుకుంటూ ఇద్దరు ఆడపిల్లలతో - కుటుంబాన్ని నియంత్రించుకుని, ఇన్సూరెన్సులు కట్టుకుంటూ - ప్రపంచ పోకడల్ని వార్తాపత్రికల ద్వారా తెలుసుకుంటూ — స్నేహితులకి, బంధువులకీ తలలో నాలికలాగ - మంచి ప్రవర్తనకి మారుపేరుగా జీవించే జార్జి అంటే నాకూ అభిమానమే....

"టాం" కూడా శ్రీరామచంద్రుడికి లక్ష్మణుడిలాంటి వాడైతే అసలు కథే వుండకపోను - అన్నగారి పోరుపడలేక ఏదో చదువు అత్తెసరు మార్కులతో పూర్తి చేశాడు. అయితే స్కూలులో, కాలేజీలలో రింగ్‌లీడర్‌గా - హుషారైన గేమ్స్ క్యాప్టెన్‌గా, అనేక ఇతర రంగాల్లో టాం పేరు మోతమోగేది.

చదువు పూర్తయిన తర్వాత అన్నగారిపోరు పడలేక ఉద్యోగంలో చేరాడు. ఓ అమ్మాయిని కట్టుకున్నాడు. కాని ఇతగాడు చేసేది గుమాస్తా ఉద్యోగం అయినా ఆఫీసరుగారికంటె మంచి సూట్సు వేసుకుంటూ రోజుకో అందమయిన అమ్మాయితో రోజుకో మోడల్ కారులో ఆఫీసుకి వస్తోంటే ఆఫీసర్లకి కంటకప్రాయమయింది. అయినా "టాం"కే ఈ ఉద్యోగం నచ్చలేదు.

"వాట్సిదిస్ నాన్‌సెన్సు ?" అని ఆఫీసరుగారు విసుక్కుంటే "వాట్సిదిస్ నాన్సెస్" అని టామే రిజైన్‌చేసి చక్కావచ్చాడు.

స్వేచ్ఛా జీవనానికి ప్రతిబంధకంగా వుందని భార్యకికూడా రిజైన్ చేశాడు. (విడాకు లిచ్చేశాడు)—ఇప్పుడు "టాంరాంపే" మహాశయుడు స్వేచ్ఛావిహంగం.

ఎప్పుడేనా అన్నగారి ఇంటికివచ్చి—అన్నపిల్లలతో హాయిగా చిన్నపిల్లాడిలా ఆడేసుకుని వాళ్ళకి మంచిమంచి ప్రెజెంట్స్‌తెస్తూ స్వేచ్ఛగా జీవించేస్తున్నాడు.

జార్జిమాత్రం తన ఉద్యోగం, తన ధర్మం-తన బాధ్యతగా తూచి తూచి తన కుటుంబగౌరవానికి ఏమాత్రం భంగం లేనట్టుగా బ్రతుకును ఈడ్తున్నాడు.

"టాం" అన్నగారి ఇంట్లో వుండగా....ఎవరో ఒక అసామీ వచ్చాడు. "టాం" తో గట్టిగా ఘర్షణకి దిగేడు—టాం .... అతన్ని దూరంగా తీసుకువెళ్ళి ఏదో బ్రతిమలాడుతున్నాడు. ఆ ఆగంతకుడు నోరు మరీ పెద్దదిచేసి...."మనిషన్నవాడికి సిగ్గూ శరం వుండాలి. మళ్ళీ రాంసే కుటుంబంలో అందులోనూ జార్జి రాంసేగారిలాటి పెద్దమనిషి తమ్ముడుగా కూడా పుట్టేవు....ఛీ నీ బ్రతుకు తగలడా" అంటూ అరుస్తున్నాడు—

ఈ కేకలు జార్జి చెవిని పడనేపడ్డాయి.

"ఏమిటిదంతా తమ్ముడూ?" అని ఆత్రంగా అడిగేడు జార్జి.

"ఏం లేదన్నయ్యా....ఇది మామూలే....నీ పని చూసుకో" అన్నాడు కొంచెం సిగ్గుపడినవాడిలా.

ఆగంతకుడు ముందుకు వచ్చి....

"నువ్వూరుకోవోయ్ ! నేను చెపుతాను సర్ మీ తమ్ముడుగారి భాగోతం—నా దగ్గర 5 వేల పౌండ్లు అప్పుచేశాడు, అదిగో ఇదిగో అని తప్పించుకు తిరుగుతున్నాడు-వడ్డీతో కలిపి 8 వేలదాకా అయింది. రెండు రోజుల్లో తీర్చకపోతే జైలుకి పంపుతాననికూడా వార్నింగు యిచ్చాను. ఆ గడువు తీరింది....అదీ సంగతి"అన్నాడు.

తమ్ముడు జైలుకి వెడితే ఇంకేమేనా వుందా? రాంసే కుటుంబం పరువు బజారున పడదూ? అందుకే జార్జి ఆ అప్పులాడిని బ్రతిమాలిరెండు రోజుల టైము అడిగి ఆఫీసులో అప్పుతీసుకుని ఆ బాకీ జమకట్టేడు. ఈ సంగతి నాకూ తెలిసింది........

ఆ మరునాడు "టాం" అప్పు యిచ్చిన ఆసామీ కులాసాగా పోష్ హోటలులో పార్టీ చేసుకుంటూ కనబడ్డారు. ఒకరినొకరు కరచాలనంచేసు కుని అభినందించుకోవడంకూడా కనబడింది. ఈ విధంగా అన్నగారి బల హీనతని ఒడుపుగా "టాం" క్యాష్ చేసుకుని జల్సా చేస్తున్నాడని స్పష్టమై పోయింది. నెలకీ రెణ్ణెల్లకీ-ఇదే భాగవతం కంటిన్యూ చెయ్యసాగాడు—తమ్ముడు నాటకం ఆడుతున్నాడని తెలిసినా ఏమీ చేయలేని నిస్సహాయ స్థితిలో పడిపోయాడు జార్జి. జార్జి బాధ్యతలు మోస్తూ తమ్ముడి కుహనా రుణాలు తీరుస్తూ బరువుగా బ్రతుకు ఈడుస్తున్నాడు. "టాం" మాత్రం నాకారోగ్యం—నాకు బలం అన్నటు స్వేచ్ఛావిహంగంలా జల్సా జీవి తాన్ని గడుపుతూనే వున్నాడు. మరో తొమ్మిదేళ్ళు గడిచేపోయాయి.

ఇప్పుడు జార్జి రాంసే వయస్సు 53 సంవత్సరాలు, జార్జి జుట్టంతా రాలిపోయి, ముఖం ముడతలుపడి, పళ్ళు కొన్ని కదిలిపోయి-72 ఏళ్ళ వాడిలా తయారయ్యాడు. టాంకి 50 సంవత్సరాలున్నా ఓ ముప్పైముప్పై అయిదేళ్ళవాడిలా నవనవలాడిపోతున్నాడు. అమ్మాయిలతో కేరింతలు కొడుతూనే వున్నాడు........

ఎందుకో పనుండి జార్జిదగ్గరకు వెళ్ళాను.

"ఏమోయ్ ఈ ఘోరం చూశావా....ఇది మరీ అన్యాయంకదూ !" అన్నాడు.

నేను ఇదంతా ఏమిటో తెలియక బిత్తరపోయాను.

"అదే మా తమ్ముడు—ఇప్పుడు మల్టీమిలీమనీర్....ఆ మధ్యతన తల్లి వయస్సున్నధనికురాలైన ఓముసలి విధవ ముచ్చటపడి పెళ్ళాడిందట పెళ్ళాడిన వారంరోజులకే బాల్చీ తన్నేసింది....ఇప్పుడు మావాడు...." అని ఆగిపోయి...."ఇది మరీ అన్యాయం!" జుత్తుపీక్కు మరీపోయాడు జార్జి-

నేను పైపు పొగ విలాసంగా వదులుతూ హాయిగా నవ్వేశాను.

—★—

# [illegible]. మాతృత్వం.

## (MATERNITY)

— లిలికా నకోస్ (గ్రీస్)

"మార్సెయిల్" పట్టణపు శివార్లలో నెలరోజులలోకి పైబడి "ఆర్మే నియన్" కాందిశీకులు విడిదిచేసి ఉండడంతో అది ఒక చిన్నసైజు గ్రామ సీమగా రూపుదిద్దుకుంది. ఎవరెక్కడ చోటు దొరికితే అక్కడ స్థిరపడి పోయారు. డబ్బున్న కాందిశీకులు గుడారాలు వేసుకున్నారు. మిగిలిన వారిలో కొందరు ఊడిపోతోన్న రేకుల షెడ్లకింద కాలక్షేపం చేస్తున్నారు.

అయితే అధిక సంఖ్యాకులు మాత్రం—ఉండడానికి దిక్కుతోచక గోనె బరకాలని వెదురు కర్రల మీద ఛాందినీలా నిలబెట్టి దానికింద కాలం వెళ్ళమారుస్తున్నారు. ఏదేనా ఒకటి రెండు రేకులు దొరికి గోడల్లా ఏర్పాటు చేసుకోగలిగినవాళ్ళు మహా అదృష్టవంతులేనన్నమాట.

మనం స్వంతంగా పోష్ లొకాలిటీలో ఒక స్వంత భవనాన్ని నిర్మించుకున్నంతటి అదృష్టవంతుల కింద లెక్క. ఎవరికి ఏ పని దొరికితే ఆ పనిని చేసుకుంటూ వచ్చిందాంతో కలో గంజో తాగి కాలక్షేపం చేస్తున్నారు. పిల్లలు కూడా మరీ మల మల మాడిపోకుండా ఓ దొక్క ఎండినా ఏదో తినగలుగుతున్నారు.

అయితే అడుగుమాడిన వాళ్ళలో కూడా అతి దరిద్రులూ, దౌర్భాగ్యులో వున్నట్టే ఈ కాందిశీకుల్లో కూడా ఉన్న ఓ నికృష్టజీవి 'మికలి'. 'మికలి' పనయితే చేయలేదు కాని అతనికి కూడా అందరిలాగా "ఆకలి" వుంటుందిగా! వాళ్లూ వీళ్ళూ కనికరించి విసిరేసిన రొట్టెముక్కలు తిని కడుపునింపుకుని కాలక్షేపం చేసేవాడు.

అయితే అతని శరీర తత్వాన్నిబట్టి—ఎంత ఎంగిలి రొట్టెముక్కలు తిన్నా శరీరం తెగ బలిసిపోయింది — ఇంతకీ "మికలి"కి పధ్నాలుగు సంవత్సరాలు. అతను పని చెయ్యాలంటే, వచ్చిపడ్డ మరో ముఖ్యమైన అవరోధ ఏమంటే....వాళ్ళమ్మ కళ్ళు మూస్తో, మూస్తో వదిలిపెట్టి వెళ్ళిన

పసికందు భారం ఒకటి అతని మెడకు చుట్టుకుని ఉంది. అయితే ఈ పసికందుకు విపరీతమైన ఆకలి-ఎడతెరిపి లేకుండా గాడిద ఓండ్రపెట్టినట్టు ఏడుస్తూండడం వల్ల-అతనిని ఆ చుట్టుప్రక్కల్నించి తరిమేశారు.

నిద్రాభంగమైతే ఎంత సహృదయులైతే మాత్రం భరించగలరా?

అసలు ఈ పసికందు హోరెత్తించే ఆకలి గోలకి "మికలి"కి పేగులు తోడేసినట్టుండేది. అయితే అతని తల్లి అతని భుజస్కంధాలపై ఉంచిన బాధ్యతనీ, భారాన్నీ వదలించుకోవడం అంత సులభంగాదు కదా! ఏడుపు వినివిని,అతని బుర్ర పూర్తిగా దిమ్మెక్కిపోయి పిచ్చెక్కినవాడిలా తిరగడం మొదలెట్టేడు. తానెక్కడెక్కడ తిరుగుతోంటే ఈ చెవులుహోరెత్తించే కర్ణకఠోరమైన ఈ పిల్లాడి ఏడుపు కూడా వుంటూండడంతో అందరూ "మికలి"ని అసహ్యించుకోసాగారు. ఏడ్చిఏడ్చి ఆ పసికందు ఎప్పుడో ఒకప్పుడు "హరీ"మనాలని మనస్ఫూర్తిగా వాంఛించసాగారు.

అయితే అటువంటిదేమీ జరగకపోగా ఈ "న్యూసెన్స్" విపరీతం కాసాగింది. ఈ కొత్తగా పుట్టిన శిశువు-కరువు కాటకాలికీ, ఆకలికి వాడు విపరీతంగా ఏడ్చి ఏడ్చి బ్రతకాలని నిశ్చయించుకున్నట్టే తోస్తోంది. కరువును మించినట్టుగా భూనభాలు అదిరిపోయేలా రోదిస్తున్నాడు. ఇవన్నీ వినలేని మాతృమూర్తులు చెవుల్లో దూది కుక్కుకుని మరీ తిరుగుతున్నారు. మికలీకి ఇంచుమించు పిచ్చెత్తినట్టే వుంది — తాగినవాడి స్థితిలో తిరగసాగేడు. పాలు కొని పడదామంటే అతని దగ్గర చిల్లుగవ్వయినా లేదు.

ఏ మాతృమూర్తి అయినా దయదల్చి - తన స్తన్యాన్ని అందిస్తుందేమోనంటే ఏ తల్లికీ ఆ వాత్సల్యమూ లేదు. ఉన్నా ఆ మాత్రం క్షీర సంపదా ఉన్నట్టు తోచదు-ఇది చాలదా మనిషిని పిచ్చెత్తించడానికి ?

ఇది పనికాదని — మికలీ ఆవలి వైపున ఉన్న క్యాంపుకి వెళ్ళేడు.

అక్కడ అంటోలియన్-కాందిశీకులు ఉన్నారు. వాళ్ళూ ఆర్మేనియన్ కాంది శీకుల్లాగే ఆసియా మైనర్‌లో తురుష్కుల మూకుమ్మడి హత్యాకాండకి ఝడిసి ప్రాణాల్ని అరచేతిలో పెట్టుకుని పారిపోయి వచ్చినవాళ్ళే.

వాకబు చేయగా చేయగా మికలీకి ఆ క్యాంప్‌లో దయామయులైన తల్లులున్నారని — వారిలో దయ ఎంత నిండుగా వుందో స్తన్యం కూడా అంత ఉదారంగానూ వున్నదని, వారు అనాధలైన శిశువుల ఆకలిని తమ స్తన్యంతో తీరుస్తారని తెలిసింది- ఈ చిన్నారి పాపడిని కూడా ఆ తల్లులు అనుగ్రహిస్తే తాత్కాలికంగానైనా ఈ ఆకలి రోదన శమింపవచ్చని ఆశ పడ్డాడు మికలీ. మనిషిని జీవింపజేసేది ఆశే కదా !

అయితే ఆ క్యాంపూ ఆర్మేనియన్ క్యాంపంత హృదయవిదారకం గానే వుంది - ముసలివాళ్ళు కటిక నేలమీద పరున్నారు. వాళ్ళ కాళ్ళకి ఏ ఆచ్ఛాదనా లేదు. చిన్నపిల్లలు మురికినీటి చెలమల్లో ఆడుకుంటున్నారు. ఇతన్ని చూస్తూనే వృద్ధురాళ్ళు లేచి కూర్చుని సానుభూతిగా —

"ఏం కావాలి బాబూ?" అని అడగసాగేరు - తను వచ్చిన పనిని ముసలమ్మలకి చెపితే మాత్రం వాళ్ళేమైనా అర్చగలరా - తీర్చగలరా? అందుకే తిన్నగా మేరీమాత - గుర్తుజండా ఎగురుతోన్న ఆ టెంట్ దగ్గరికి వెళ్ళేడు. ఆ టెంటు లోపలనించి చిన్నారి శిశువుల రోదనలు శ్రావ్యంగా వినిపిస్తున్నాయి. బహుశః ఈ టెంటులోనే ఆదయార్ద్ర హృదయులైన మాతృమూర్తులుండి వుండవచ్చు, అందుకే ధైర్యం చిక్కబుచ్చుకుని

"పవిత్రమైన మేరీమాత స్వరూపాన్ని ధరించిన ఈ టెంట్‌లోని దయామూర్తులెవరో - ఈ ఆకలితో అలమటిస్తోన్న ఈ దిక్కూ మొక్కూ లేని మాతృహీనుడికి పాలను ఇచ్చి ఆకలి బాపండి తల్లీ - నేను ఆర్మేని యన్ కాందిశీకుల క్యాంప్‌నించి వస్తున్నాను" అని హృదయ విదారకంగా కేక వేశాడు మికలీ.

ఈ అభ్యర్థనకి జవాబుగా ఒక అందమైన, నల్లటి పడతి వచ్చింది. అప్పటికే ఆమె చేతులలో అరమూతగా కన్నులు మూసుకుని పాలుగ్రోలుతోన్న శిశువు వున్నది

"ఏదీ ఈ ఆకలిగావున్న శిశువును చూపించు, ఇంతకీఇది అబ్బాయా? అమ్మాయా!" దయ పుట్టిపడే మధురస్వరంతో అడిగింది ఆ పడతి.

మికలి - హృదయం ఆనంద పరవశతతో నాట్యమే చేసింది. దాహార్తితో విలవిలలాడే ఎడారి ప్రయాణీకుడికి ఒయాసిస్సు కనిపిస్తే కలిగే లాటి ఆనందం అది. ఈ ఆనందంతో అతని శరీరం గజగజావణికి పోసాగింది. చుట్టుప్రక్కల వాదుకూడా కొందరు ఆతృతగా ముందుకి వచ్చిమికలీ భుజంమీద దుప్పటిలో చుట్టబెట్టుకువున్న - ఆ ఏడ్చేశిశువును (మికలీ చిన్నారి తమ్ముణ్ణి) బయటకి తీసి చూడబోయరు....

హృదయ విదారకంగా కేకలు వేయడం ఇప్పుడు వారి వంతు అయింది. అది శిశువా? శిశువు అనేకంటే నరరూపంలో వున్న ఒక దెయ్యపు పిల్ల అంటే సరిపోతుంది. ఎముకలపోగులాటి, బక్క పల్చటి శరీరం మీద దెయ్యపుతలకాయ లాంటి పెద్దతల.... ఇప్పటిదాకా చప్పరించడానికి ఏమీదొరకక దాని బొటనవ్రేలినీ అది చప్పరించిందేమో ఆది ఈబ్బుడు పొత్రమంత సైజుకి ఉబ్బిపోయి వుంది. తన చిన్నారి తమ్ముడు ఇంత వికారంగా, జుగుప్సాకరంగా తయారయి వుంటాడని ఊహించని మికలీకే ఒక్కసారి షాక్ తిన్నట్టయింది.

"ఓయి దేవుడా! ఇది మనిషిపిల్లకాదు. ఇది మనుషుల రక్తాన్నిపీల్చే ఒకరకమైన గబ్బిలం. నిజంగా నా వక్షంనిండా పాలున్నా ఇలాటి తురుష్క జాతి గబ్బిలానికి పాలిచ్చి దైవాపచారం చెయ్యలేను...."

"అవును.... ఇది దైవాపచారమే....ముమ్మాటికీ దైవాపచారమే" శృతికలిపారు మిగిలినవాళ్ళు.

"ఏమిటేమిటి?.... ఏదీ చూడనియ్.... గబ్బిలంకాద (రా....ఇది సైతాను భూతపు మరోరూపమే.... ఒరే అబ్బాయి....వెంటనే ఈ క్యాంపు లోంచి మొహం కనబడకుండా పోతావా చితకొట్టమంటావా? నువ్వు అడు గెట్టినచోట పంచమహాపాతకాలు చుట్టుముడతాయి" అంటూ మికలీవి దూరంగా తరిమేశారు. ఏం చేయగలడు? నిస్సహాయుడు - నిరాధారుడు.... కనీసం సానుభూతి చూపేవాళ్ళేనాలేరు.... గుడ్ల నిండా నీళ్ళు కుక్కుకుని

"ఆదరించు వారే - లేరా ఈ వనిలోన....మమ్మాదరించుదాతలు లేరా ఈధరలోన" అని వాపోతూ తిరగసాగాడు. అతని ఆకలిదప్పులమాట దేవుడెరుగును? ఈ శిశువును ఆకలిరక్కసి కోరలనుండి కాపాడడం అతనికి తక్షణ సమస్య అయి కూర్చుంది.అయితే తను ఏం చేయగలడట!.... ఈ శిశువు ఏడ్చిఏడ్చి ఎంత త్వరగా మరణిస్తే.... అంతబాగుండును అనిపి స్తుంది - నాగరికులమైన మనకైతే - పాపం అతడు అజ్ఞాని.... అందుకే అతడు మనంత నాగరికంగా ఆలోచించ లేకపోయాడు. అతడు ఏకాకి— అన్నీపోగొట్టు కున్నవాడు. ఇంతసేపూ తను మోస్తున్నది - ఆకలితో అల మటిస్తోన్న ఒక చిన్నారి శిశువును కాదని.... నర రూపంలో ఉన్న ఒక దెయ్యపుపిల్లననీ అనిపించేసరికి వెన్నులోంచి వణుకు పుడుతోంది. అయినా అతనిలో లవలేశంగా నైనా మిగిలివున్న బాధ్యత, మానవత్వం — ఆ శిశువుని అలా మోయిస్తూనే వున్నాయి. ఒక షెడ్డు నీడలో చేరాడు. బయట వేడిగా వుంది - షెడ్డులోనూ వెచ్చదనం పరుచుకుని వుంది. అత నికి తన కడుపులో ఎలకలు పరిగెడుతోన్న సంగతి గుర్తువచ్చింది. వీధు లలో సగం సగంతిని పడేసిన పదార్థాలో, అవీ దొరకకపోతే - పెంట కుప్పమీద పడివున్న పదార్థాలను కుక్కలతో పోటీ పడోతినాలి. తప్పదు- అప్పుడు మొదటిసారిగా అతనికి జీవితం అతి భయంకరమైన దానిగా తోచసాగింది - తోస్తేమాత్రం.... ఏం చెయ్యగలడు!

చేతుల్ని ముఖానికి అడ్డుపెట్టుకుని వెక్కి వెక్కి ఏడవనారం భించాడు—ఎవరు వింటారు....ఈ దీనుడి ఏడుపు?.... ఎవడికి కావా లట....ఎవరు ఎలాపోతే మాత్రం?? తొందరపడి అలా అనెయ్యకండి.... సర్వసాక్షికి ఇవేమీ తెలియవనే అంటారా?....ఏమో !

మికలీ తలెత్తి చూసేసరికి—అతనిముందు ఒక చైనా యువకుడు నిలబడివున్నాడు. మికలీ అతన్ని ఆ క్యాంపులో చాలాసార్లు చూసాడుకాని గమనించలేదు, అయితే ఆ చైనీయుడు—మికలీని అతని అవస్థనీ నిత్యం చూస్తోన్నట్టే వున్నాడు, అతగాడు ఈ క్యాంపులో పేపరుతో చేసిన రక రకాల ఆటవస్తువులూ-ఏవేవో గమ్మత్తు వస్తువులు అమ్మి వ్యాపారం చేద్దా మని వస్తూండేవాడు. అయితే అతనిదగ్గర ఎవ్వరూ ఏమీ కొనేవారుకాదు- ఈ చైనావాడు చింతాకుల్లాంటి కళ్ళతో, తప్పడముక్కుతో, పచ్చగా, కుద మట్టంగా వుండడంతో క్యాంపులోని పిల్లలు ఆటపట్టిస్తూండేవారు—పైగా "పీలింగ్, స్టింకింగ్ చింక్" అని పిలుస్తూ హేళన చేసేవారు.

మికలీకేసి ఆ చైనా యువకుడు చాలా దయగా చూశాడు-అంత అంత చిన్నకళ్ళల్లోనూ విశ్వమంత విశాలమైన దయ ఉబికి ఉబికి తన్నుకు వస్తూ కనబడుతోంది.

"అలా ఏడవకూడదమ్మా అబ్బాయ్...." అన్నాడు ఎంతోసిగ్గుతో ముడుచుకుపోయినవాడిలా "రా అమ్మ రా! నాకూడారా...."

నేను రాను....అన్నట్టు తల అడ్డంగా వూపడం ఈ మాటు మికలి వంతయింది....మికలీ అక్కణ్నించి వేగంగా పారిపోదామని కూడా భావిం చాడు....ఈ ప్రాచ్యదేశస్థుల క్రూరత్వాన్ని గురించి మికలి వాళ్ళ దేశంలో వున్నప్పుడు ఎన్నో రకాల కథలు విన్నాడు. వాళ్ళ దేశంలోనేకాదు, ఈ క్యాంపులోకూడా తరచు వినబడేదేమంటే....ఈ చైనావారూ, జపాన్

వారూ క్రైస్తవ పిల్లల్ని ఎత్తుకుపోయి....యూదుల్లా వారి రక్తాన్నిపిండుకు కడుపునిండా తాగుతారట.

అయితే ఆ చైనీయుడు ఒక్క అంగుళమయినా కదలకుండా అలాగే నిలబడివున్నాడు—మునిగిపోయేవాడిలో గడ్డిపోచయినా ఆశని కల్పించినట్టు—చావుకి ఇన్నిచావులుండవుకదా అని అతనికూడా బయలు దేరి వెళ్ళాడు. పొలంగట్టుమీంచి నడిచి వెళ్ళటంతో చేతులో పిల్లాడితోసహా తూలిపడిపోయాడు మికలీ.

— అయితే చైనా యువకుడు మికలీ చేతిలోని శిశువును తానే అందుకుని తన గుండెలకు సుతారంగా హత్తుకుని ముందుకు నడవ సాగేడు.

వాళ్ళు అనేకమైన కాళీ ఇళ్ళని దాటుకుంటూ వెళ్ళారు. చివరకి ఒక తోటమధ్యలోవున్న కర్రలతో కట్టిన ఒక ఇంటిముందు ఆగేరు. తలుపుమీద సున్నితంగా రెండు మూడు సార్లు తట్టాడు-ఒక చిరుదీపం దాల్చిన ఓ చిన్నపైజు యువతి వచ్చి తలుపుతీసింది. ఈ చైనా యువ కుని చూడగానే ఆ అమ్మాయి కొద్దిగా సిగ్గుపడింది. బుగ్గలు ఎరుపెక్కాయి అయినా చిరునవ్వుతో వారికి స్వాగతం పలికింది. మికలీకి ఇది కలో నిజమో అర్థంకావడంలేదు. లోపలికి వెళ్లాలంటే భయం, ఆందోళన ఏవేవో ఉద్వేగాలు అందుకే తడబడుతూ నిలబడ్డాడు.

"సందేహంలేదు....లోపలికి రావోయ్....ఈమె నా భార్యే"....

"కానున్నది కాకమానదు" అనుకుంటూ లోపలికి అడుగేశాడు మికలి.

అది పెద్దగదే....అయితే దానిని కాగితాలు అంటింపుతో రెండు భాగాలుగా చేసారు....బీదరికం కనపడుతున్నా ఆ ఇంట్లో పరిశుభ్రత, ఆరోగ్యం వుట్టిపడుతూ వుంది, సౌజన్యం సరేసరి?

"ఇది మా పాప...." అంది ఉయ్యాలలో ఆడుకుంటూన్న ముద్దు పాపాయిని చూపిస్తూ....ఆ పాపాయి ఎంతో ముద్దుగా వున్నాడు....ఇంతటి అందోళనలోనూ మికలి ....పాపాయి దగ్గరిగా వెళ్ళి బుగ్గగిల్లి అభినందించ కుండా వుండలేకపోయాడు. కడుపునిండా పాలుతాగినట్టున్నాడు. హాయిగా నిద్రపోతున్నాడు.

భర్త భార్యను సంజ్ఞచేసి పిలిచాడు—చాపమీద కూర్చోమన్నాడు, కూర్చోపెట్టి ఈ దెయ్యపు (లాటి) శిశువును చేతికందించాడు. చూడగానే ఆమెకూడా వెర్రికేకపెట్టింది. అయితే భయంతోనో ఏహ్యభావంతోనో వేసిన కేకకాదు. దయ చిప్పిల్లివేసిన సానుభూతి చిహ్నమైన కేక-ఆ శిశువును గుండెల కదుముకుని-పాలు కుడుపసాగింది. ఆమె పాలిండ్లు ఆర్ద్రమై పాలను ఎగచిమ్మాయి. ఆకలిగొన్న శిశువు ఆవురావురని పాలు తాగసాగింది.

—0—

# __. అయ్యో పాపం పసివాడు.

## (THE OPEN W1NDOW)

—హెచ్. హెచ్. మన్రో (సాకి) గ్రేట్ బ్రిటన్

"విట్టల్ మహాశయా! మా అత్తయ్య వచ్చేస్తుంది? కంగారు పడకు" అంది. ఆ అమ్మాయికి పదిహేను సంవత్సరాల వయస్సుంటుంది. అయితే ఆ అమ్మాయి మాట్లాడే తీరులో ప్రౌఢత్వం కనబడుతోంది— "చూడు బాబూ! మా అత్తయ్య వచ్చేలోగా పాపం - కొంచెం — నువ్వు నా సుత్తిని భరించాల్సి వుంటుంది" అంది ఆ అబ్బాయిపట్ల జాలి ఒలక బోస్తోన్నదానిలా చూస్తూ.

ఫ్రాంటెన్ నట్టేల్ నామధేయుడైనా ఆ అబ్బాయి ఏదో రకంగా రాబోయే ఆ అత్తయ్యగారి ఈ మేనగోడలు గారిని మంచి మంచి పదాలతో కూర్చిన ఒక పొగడ్తతో స్తుతించే ప్రయత్నంలో .... ఆ మంచి పదాలు ఏమి దొరుకుతయ్యా అని తెగ ప్రయాస పడిపోతున్నాడు. ముచ్చెమటలూ పట్టేసి నోరు పొడారిపోతున్నదే తప్ప.... పదాలు దొరికే సూచనలు కన వడ్డం లేదు. ఆ డాక్టరుగారు ఇచ్చిన సలహా ఉచితానుచితాల విషయంలో కూడా పెద్ద అనుమానంలో పడిపోయాడు. ఇంతకీ ఆ డాక్టర్ ఏమన్నాడు? ఈ నరాల నిస్సత్తువ ....ఈ భయాందోళనలూ తగ్గాలంటే.... పది మందిలో తిరగాలి.... కొత్త కొత్త పరిచయాలు చేసుకోవాలి అని కదా! ....మరి?.... తాను ఈ వైద్య సలహాని అనుసరించే ఇదో రకం.... వైద్యంగా తాను ఈ ప్రయాణాన్ని చేస్తున్నాడా! మరి ఈ అమ్మాయితో మాట్లాడ్డానికే తనకింత నీరసం వచ్చేస్తే ముక్కూ మొఖం తెలియని ఆ అత్తయ్య అదే శాప్లిటన్ గారి సతీమణిని కలుసుకున్నప్పుడు .... తలుచు కుంటేనే గజగజ వణుకు పుడుతోంది....

"నిజమేరా! డాక్టర్ గారు చెప్పినట్టు చేశావంటే .... నీకు ఈ ఆందోళన జబ్బునయమౌతుంది.... అలాచెయ్యి.... కొత్త కొత్త గ్రామా

లకి వెళ్ళి— కొత్త కొత్త వారితో పరిచయం చేసుకో .... నీకొక్కవలసిన ధనసహాయం అయితే చెయ్యలేను కాని .... నా పరిచయస్తులు కొందరున్నారు.... వాళ్ళకి నిన్ను పరిచయం చేస్తూ ఉత్తరాలు రాసిస్తాను లేకపోతే ఇలాగే నలుగురు మనుష్యులు కనపడేసరికి ముడుచుకు కూర్చుంటావు" అంది ఫ్రాంటన్ అక్కగారు. ఆవిడగారు టీచరుగా రకరకాల ఊళ్ళలో పనిచేసి వుంది. శాప్లిటన్ సతీమణి వుండే ఊరిలో పని చేసినప్పుడు — ఆమెతో వుండే పరిచయాన్ని పురస్కరించుకుని ఓ పరిచయ పత్రాన్ని రాసి ఇచ్చింది. అది పుచ్చుకునే ఫ్రాంటన్ ఇక్కడికి వచ్చాడు. శాప్లిటన్ తన్ని ఎలా రిసీవ్ చేసుకుంటుందోనన్న ఆలోచనతో ఆందోళన చెందుతున్నాడు.

"అయితే ఈ ఊళ్ళో నీకు చాలామంది, చాలా బాగా తెలుసన్న మాట!" అంది ఆ అమ్మాయి చాలా సీరియస్‌గా.

అసలు శాప్లిటన్ గారికి అక్కయ్య గుర్తు వుండి వుంటుందా అన్నది ఫ్రాంటన్ ఆలోచన. ఉలిక్కి పడ్డాడు అబ్బాయి. మాటలు తడబడుతోండగా....

"నమ్మండి.... ఒక్కరంటే .... ఒక్కరు తెలిసుంటే ఒట్టు. మా అక్కయ్యగారు ఈ ఊళ్ళో టీచర్.... అవును టీచర్.... టీచర్‌గా పని చేసేవారండి.... అప్పుడేమో మీ అ.... అ.... అత్తయ్య గారితో ప.... పరిచయం టండి.... అందుకని మా అత్తయ్య మీ అక్కయ్య గారికి.... సారీ మా అక్కయ్య మీ అత్తయ్య గారికి ఒక ఉత్తరం రాసి ఇచ్చారు .... నన్ను ప....ప.... పరిచయం చేస్తూ.... అయితే ఈ ఊళ్ళో మరి కొందరికి కూడా రాసి ఇచ్చారనుకోండి...." అన్నాడు కంగారు పడుతూ ....అమ్మాయి ముఖం అదోలా పెట్టింది. అబ్బాయి మీద ఎంతో జాలి పడు

తోస్తున్నట్టుగా వుంది ఆమె భావ భంగిమ.... పెదవులు అదోలా పెట్టి అయ్యోపాపం....అన్నట్టు "ప్చ....ప్చ....ప్చ" అని శబ్దం చేసింది.

"అయితే మా అత్తయ్య విషయం.... నీకు కొంచెం కూడా తెలియదన్లే వుందే?" "తెలియదంటే.... తెలియక పోలేదండి....ఆవిడ పేరూ అడ్రస్సూ తెలుసండి.... ఏమండి ఇంతకీ నేను కరక్టుగా వారింటికే వచ్చానాండి?"

"అహా!"

అయితే ఫ్రాంకెన్ నబైల్ అనుమానాలు వుండనే వున్నాయి. ఆమె వివాహితురాలవునో కాదో తెలియదు. అయినచో భర్త వున్నాడో పోయాడో తెలియదు.... ఒకవేళ భర్త జీవించే వుంటే అతనితో కలిసి వుందో.... విడిగా వుందో తెలియదు.... అయితే గదిని పరిశీలనగా చూస్తే ....ఈ గదిలో "మగ" వాసనలు చాలానే కనిపిస్తున్నందున.... భర్త వున్నాడు.... కలిసే వున్నారు అన్న నమ్మకం ఏర్పడుతోంది.

ఈ విషాదమయ సంఘటన— విషాదం అంటే అలాంటి ఇలాంటి విషాదం కాదు.... వింటేనే గుండె బ్రద్దలవుతుంది.... ఆ అమ్మాయి గొంతు జీరపోయి విషాదం ధ్వనిస్తోంది...."మూడేళ్ళ క్రిందట సరిగ్గా ఈ రోజునే...." మరి ఇంక మాట్లాడలేకపోయింది ఆ పాప. నబైల్‌కి ఏమీ అర్థం కావటంలేదు. అయోమయంగా చూస్తున్నాడు.

ఆ పెద్దకిటికీ ఎందుకు అలా తెరిచి వుంచామో నీవు ఊహించి వుండవు - ఈ కిటికీని అక్టోబర్ నెలలో ఈ రోజున అలా తెరిచి వదిలేస్తాము. ఎదురుగా కిటికీ తెరచివుంది - కిటికీ నేలబారుగా వుంది. బయటవున్న పచ్చిక మైదానానికి బరాబరిగా వుంది.

"బయట వెచ్చగావుంది కనక....చలి ఆట్టేలేదు కనక తెరిచి వుంటారు" అన్నాడు నబైల్ తడబడుతూ _ కొంచెం సర్దుకుని

"…. అయితే అమ్మాయిగారూ….తెరిచి వుంచిన కిటికీకి, మీరు చెప్పే విషాదమయ గాధకీ ఏమైనా సంబంధం వుందాండి?" అన్నాడు.

"అయ్యో దేవుడా! చెప్పబోయేది అదే గదయ్యా మహానుభావా! సరిగ్గా మూడేళ్ళ క్రిందట…. ఇదే కిటికీలోంచి మా అత్తయ్యగారి భర్త అతగాడి మరో ఇద్దరు తమ్ముళ్ళు….తుపాకులేసుకుని వేటాడ్డానికి బయల్దేరి వెళ్ళేరు. రోజులు గడచినాయ్….కాని వారు తిరిగిరాలేదు. ఏదో జంతువుని తరుముతూ తరుముతూ ఒక ఊబిలో చిక్కుకుని ముగ్గురూ మరణించారట! అయితే. అది దొంగ ఊబి, మామూలు రోజుల్లో నేలగట్టిగానే వుంటుందా! వేసవిలో మాత్రం చెప్పి చెయ్యకుండా హటాత్తుగా నేల విడిపోయి వచ్చిన వాళ్ళని మింగేస్తు వుంటుంది. వారి భౌతిక దేహాలు బయటకురానే లేదు. అది ఒక భయంకరమైన అనుభవం. పాపం అత్తయ్యకు ఆ క్షణంనించి మతిభ్రమించింది. తనభర్త మరదులు మళ్ళీ వస్తారనే భ్రమతో ఆకిటికీని మూయనీయదు. వాళ్ళు ఎప్పటికైనా తిరిగి వస్తారనే ఆమె నమ్మకం. పగలంతా ఇక్కడే కూర్చుని వాళ్ళు ఎలా పాటలు పాడుకుంటూ బయలు దేరారో—ఎలాంటి దుస్తులు వేసుకున్నారో కళ్ళ కట్టినట్టు వర్ణిస్తూంటుంది. తనభర్తేమో తెల్లటి వాటర్ ప్రూఫ్ కోటు భుజాల మీద వేసుకున్నాట్ట — వాళ్ళతో పాటు ఊబిలో దిగబడిపోయిన "కుక్క" అన్నా అత్తయ్యకు ప్రాణమే. వాళ్ళ మరదిగారు రోనీ హుషారుగా పాటలు పాడేవాడట….

"బెర్టీ! ఎందుకలాపోతున్నావు!" అనేపాట పాడుతూ తరచు వదిన గారిని ఆటపట్టిస్తూ వెళ్ళేడట ఒక్కొక్కరాత్రి ఆ ముగ్గురూ బురదకొట్టుకుపోయిన దుస్తులతో తిరిగి వచ్చినట్లు ఆ తెరచిన కిటికీలోంచి లోపల ప్రవేసిస్తూన్నట్లూ భ్రమకలుగుతూంటుంది. మాకుకూడా అంటూ హృదయ విదారకంగా నిట్టూర్చిండి. నట్టెల్ కి దడఅధికమైంది. నోరు పొడారిపోయింది. ఇంక కాసేపు ఈ కథని వింటే తన నరాల నిస్సత్తువ అధికం అవడం ఖాయం. ఈ సంగతి ముందే తెలిసివుంటే అక్కయ్య తనని ఇక్కడికి

పంపించి వుండేది కాదు. అదృష్టవశాత్తు శ్రీమతి శాప్లిటన్ రానేవచ్చింది - తాను ఆలస్యంగా క్రిందకి వచ్చినందుకు నొచ్చుకుంటున్నట్టుగా అంది.

"వీరా (ఆ అమ్మాయి పేరు కాబోలు) ఇప్పటిదాకా మంచి వినోద కాలక్షేపం కలిగించిందనుకుంటాను."

ఏమిటో అర్థంకాలేదు—వెకిలిగా నవ్వుతూ....

"చాలా చెలాకీ అయిన సరదాగా మాట్లాడే పిల్ల.... హి....హి... హి...." అన్నాడు.

"ఆ కిటికీ తెరిచివుంచాము....నీకు అభ్యంతరం లేదుకదాఅబ్బాయ్" అంది. శ్రీమతి శాప్లిటన్ "ఆ కిటికీని ఎందుకు అలా వుంచామంటే...." ఫ్రాంటన్ నట్టెల్‌కి ముచ్చెమటలూ పట్టాయి. వీరా చెప్పిన మాటలు ఇంకా చెవిలో రివ్వుమంటూనే వున్నాయి....

"నా భర్త-మరదులూ షూటింగుకి వెళ్లారు. వారు వస్తూనే మళ్ళీ అలా ద్వారంలోంచి లోపల ప్రవేశించే అవసరం లేకుండా—ఒక్క దూకులో లోపలికి ప్రవేశిస్తారు. ఏమిటో ఒక్కొక్కరి అలవాట్లు ఒక్కొక్కలా వుంటాయి. ఎవరి వెర్రి వాళ్ళకి ఆనందంకదా!....పైగా బురద బురదగా వుంటారేమో....ఖరీదయిన తివాచీలు పాడుకాకుండా ఒకందుకు మంచిదేననిపిస్తోంది... ఏమంటావ్?" అంది గుండెలనిండా ఊపిరిపీలుస్తూ, శాప్లిటన్ ఇంకా మాట్లాడుతోనే వుంది. పక్షుల్ని ఎలా వేటాడుతారో ? కుందేళ్ళని కొట్టడం ఎలాగో .... వివరిస్తూ పోతోంది. ఫ్రాంటన్‌నట్టెల్ పరధ్యానంగా వింటూన్నాడే కాని ఆమె మాటలు ఒక్కటీ మనసు కెక్కటంలేదు. ఒక భయంకరమయిన చలన చిత్రం అతని కళ్ళముందు కద లాడుతూ వుంటుంది. భగవంతుడా....కోరికోరి వారి వర్ధంతినాడే ఈ ఇంటికి రావాలా? ఇది పురాకృత కర్మకాకపోతే ఏమిటి ?

"ఏం లేదండి....నాకు నరాల నిస్సత్తువ....పదిమంది మనుషుల్ని చూస్తే ఎక్కడలేని నీరసం వచ్చేస్తుంది. అందుకని మా డాక్టరుగారు

పదిమంది కొత్తవారితో పరిచయాలు పెంచుకు తిరిగితే ఈ పిరికితనం తగ్గి నా జబ్బు నయమవుతుందని చెప్పేరు.....ఈ విషయంలో డాక్టర్లంతా ఏకాభిప్రాయాన్ని ప్రకటించివా....నా ఆహారాన్ని గురించిమాత్రం డాక్టర్లు ఏకాభిప్రాయాల్ని వెలిబుచ్చలేదు" 

"లేదా?" అని ఒక్క అరుపు అరిచి లేచి నిలబడింది శాప్లిటన్. అయితే ఇది తనకి సమాధానం కాదని అర్థమయింది అతనికి. శాప్లిటన్ ముఖం జేగీయమానంగా వెలిగిపోతోంది.... 

"మొత్తానికి టీ టైముకే వచ్చేస్తున్నారన్నమాట....మరీ బురద గొట్టుకుపోయినట్టు లేరూ. బురదలోంచి కళ్ళుమాత్రమే కనపడుతున్నా యేం తమాషాగా!" అంది చిన్నపిల్లలా కేరింతలు కొడుతూ.

"నిక్టైల్ మతిపోయినవాడిలా వీరాకేసి చూశాడు. వీరా "నేనుచెప్ప లేదా....ప్రతి సంవత్సరమూ ఈ వర్ధంతినాడు ఇలా జరగడం మాకు మామూలే" అన్నట్టు కళ్ళతో, నొసటితో, మూతితో సంజ్ఞచేసి చెప్పింది- విప్పారిన కళ్ళతో బురద కొట్టుకు పోయిన డ్రస్సుతో వస్తోన్న మానవా కారాల కేసి చూస్తోంది. ఫ్రాంటన్ మెలికలు తిరిగిపోతూ కిటికీలోంచి తను కూడా తేరిపార చూశాడు. 

మసక చీకటిలో నడచివస్తోన్న మూడు మానవాకారాలు కదలివస్తూ న్నాయి....దగ్గరగా ....మ ....రిం—త....ద—గ్గ....ర....గా....వాళ్ళ భుజాలమీద బురద కొట్టుకుపోయిన క్రతుపాకులు అందులో ఒక ఆకా రం భుజంమీద ఏదో ఒక బురద కొట్టుకుపోయిన కోటు వ్రేలాడుతోంది, ఆ పక్కనే కుదుమట్టంగా వున్న స్పానియల్ జాతి కుక్క....బురద ముద్దలావుంది....ఆ ఆకారాలన్నీ తిన్నగా కిటికీవాకా రావటం అందులో ఒక ఆకారం ఇందాక మనం చెప్పుకున్న పాటకూడా పాడుతోంది. ఫ్రాంటన్‌కి ఇక భరించశక్యంకాలేదు....తొందర తొందరగా తన టోపీని చేతికర్రనీ అందుకుని పిచ్చెత్తినవాడిలా రోడ్డుమీద పరుగుతీశాడు....ఈ

వేగానికి కంగారుపడిపోయిన ఒక సైకలిస్టు....ఇతనిని తప్పించబోయి సైకిల్‌తో సహా పక్కనున్న ముళ్ళకంచెలో పడ్డాడు.

"మొత్తానికి వచ్చేశామోయ్" అంది భుజంమీద తెల్ల వాటర్‌ప్రూఫ్ కోటు వేసుకున్న ఆకారం.

అనుకున్నట్టుగా ఆ తెరచిన కిటికీలోంచే లోపలికి ప్రవేశించారు. "బురదలో తడిసిపోయాంగాని చాలామటుకు ఎండిపోయాయి మా దుస్తులు....అన్నట్టు ఎవరోయ్ మమ్మల్ని చూస్తూనే కంగారు కంగారుగా పరుగెత్తుకుపోతోన్న ఆ మనిషి ?"

"ఏమో అతగాడి ధోరణి నాకూ అర్థంకాలేదు....ఏదో నరాల నిస్సత్తువ అన్నాడు, డాక్టర్లన్నాడు, ఆహారం విషయం ఏదో మాట్లాడేడు.... వాళ్ళ అక్కగారు ఈ ఊళ్ళో పనిచేసిందంటూ పరిచయ ఉత్తరంతెచ్చాడు. ఎందుకో నాకూ తెలియదు....మాట్లాడుతో మాట్లాడుతో ఇట్టే పరిగెత్తాడు. దెయ్యాన్నిగాని చూశాడేమో?" అయోమయంగా అంది శాప్లిటన్.

"బహుశః కుక్కని చూసి భయపడివుంటాడు....ఆ అన్నట్టు మామయ్యా....ఇంతకుముందే నాతో చెప్పేడు సుమా—కుక్కలంటే తనకి తగిన భయం అని ఓసారి ఇండియా వెళ్ళినప్పుడు....గంగానది గట్టున తిరుగుతోండగా అతనిని ఒక కుక్కల గుంపు తరుముతూ వచ్చిందట- వాటికి భయపడి ఓ రాత్రంతా స్మశానవాటికలో శవంకోసం తవ్విన ఓ గోతిలో తలదాచుకున్నాడట తెల్లవార్లూ ఆ కుక్కలు గోతికాడి నక్కల్లాగా కాసుకుని కూర్చున్నాయట. ఆ కుర్రాడన్న మాటేమిటి....మామయ్య లయినా; అత్తయ్య లయినా, నేనైనా అంతేకదా?....అప్పటినుంచే అతనికి ఈ నరాల నిస్సత్తువరోగం పట్టుకుందట...."

అప్పటికప్పుడు .... అభూతకల్పనల్ని హృద్యంగా అల్లడం....వీరాకి వెన్నతోపెట్టిన విద్య....

—o—

# 2. "నేను నేనే నన్నా నా."

## (WELL IAM)

—సి.జి.యం. స్క్వాజ్ (యునైటెడ్ కింగ్డం)

"పేరు........?"

"సెయింట్ పీటర్"

"నా పేరుకాదు అడిగింది....నీపేరు."

"నేను మరణించానటగా!....నాకు పేరేమిటి?"

అదే (బతికున్నప్పటిపేరు తండ్రీ!"

"థియోడార్ క్యాస్ట్వెల్ నామధేయుణ్ణి"

"గుడ్! తమవృత్తి? తమ సరదాలు....వగైరా వగైరాలు దయ చేసి చెప్తారా!"

"థియోడార్ క్యాస్ట్వెల్ ఒక జాలరి-ఆ పనిలో విసుగు విరామం లేకుండా నిమగ్నమయేవాడు....ప్రత్యేకంగా సాల్మన్ చేపల్ని, తెల్లచేపల్ని పట్టడంలో సిద్ధహస్తుడు-అతని వలపడని చోటు మహాసముద్రాల్లో లేనేలేదు అనడం అతిశయోక్తికాదు. అయితే అతని వృత్తి అతని సరదా కూడా ఒకటే కావడం అతని అదృష్టం. అతడుపేరు ప్రఖ్యాతులతోపాటు విప రీతంగా ధనాన్ని కూడా ఆర్జించాడు-చేపల గేలాల్ని....తయారుచేస్తూ, రక రకాల కీటకాల్ని "ఎర"గా ప్రయోగిస్తూ అధికోత్పత్తి- (చేపల్ని పట్టడం ఉత్పత్తి ఎలా అయింది?" అంటారా-మీ అమాయకత్వానికో నమస్కారం) సాధించాడు. "జాతస్యదృవోమృత్యుః" కదా! విందు జీవితం ముగిసింది. థియోడార్ క్యాస్ట్వెల్ మరణించాడు. మరణానంతరం అతని "ఆత్మ" లోకాలను దాటి వెళ్ళిన తరువాత "అక్కడెక్కడో-జరిగిన సంభాషణ ఇది అని వివరించక్కర్లేదనుకుంటాను. ఇంకొంచెం ముందుకు సాగి ఏం జరి గిందో పరికిద్దాం....

సెయింట్పీటర్ ముందు ఒక బ్యాలన్స్షీట్ కాగితంలాటిది ఒకటి వుంది. దానిని పరిశీలనగా చూస్తూ దేవదూత చెప్తున్నాడు.

"ఈ పెద్దమనిషి పేరు క్యాస్ట్‌వెల్ అట....ఇతగాడు చేపలు పట్టే వాడట! ఇతడు స్థాపించిన "ఎగిరే చేపల క్లబ్" అనే సంస్థ చాలా ప్రఖ్యాత మయినదట....ఇదే అతని కార్డు మీద వుంది."

"హుం.... ఇతనికి సంబంధించిన వివరాలున్న లెడ్జర్ ఏదీ?" అందుకున్నాడు సెయింట్ పీటర్. దాన్ని పరిశీలనగా చూశాడు.

"ఇటురావోయ్" అని పిలిచాడు

క్యాస్ట్‌వెల్ మహాశయుడు హుషారుగా ముందుకు వచ్చి-ఇంగ్లీష్ స్టయిల్ కరచాలనం చెయ్యడానికి హస్తాన్ని ముందుకుచాపేడు.

"ఈ దేవదూత సోదరుడిగా...." సెయింట్‌పీటర్ తీవ్రంగా క్యాస్ట్‌వెల్ కేసి చూశాడు....ఏమిటీ అతిథోరణీ, వాగుడు? అన్నట్టు క్యాస్ట్ వెల్....తన్నితాను తమాయించుకున్నాడు....గొంతు సవరించుకుని "సర్ ....ఏదో బాగా బ్రతికినవాణ్ణి....నాకు కొంచెం ప్రత్యేకమయిన వసతి సౌక ర్యాలు కోరితే తమరు అన్యథా భావించారనుకుంటా" అన్నాడు తడ బడుతూ.

"హుం హుం....నీ జమా ఖర్చుల్ని క్రిందినించి పైకి చూస్తున్నాను కంగారు పడకు"

"నా జమాఖర్చుల్లో పాపాలు అధికంగా లేవనుకుంటాను."

"నీకన్నా ఇంకా ఎక్కువ పాపాల్ని చేసిన వాళ్ళనే చూశాం-నువ్వేమీ ఆందోళన పడనక్కరలేదు-ఇంతకీ అబ్బాయ్; నీకు ఎలాంటి వసతి ఏర్పాట్లు కావాలంటావ్?"

క్యాస్ట్‌వెల్‌కి-కొంచెం ధైర్యం కలిగింది....నదురూ బెదురూలేకుండా తన కోరికలు చెప్పుకోవచ్చునన్నంత చనువు ఏర్పడింది.

"చూడండి సర్! ఒక గ్రామకంఠంలో "వెస్ట్‌వ్యాలీ పైప్" వసతి గృహాన్ని అత్యాధునికమయిన సౌకర్యాలతో ఏమయినా ఏర్పాటు చేయ డానికి వీలవుతుందేమో చూస్తారేమిటి? అయితే సుద్దలా తెల్లగా స్వచ్ఛంగా నీళ్ళున్న చెలమలకి మరీ దూరంకాకుండా వుండేలా ఈ కాటేజీని ఏర్పాటు చేయగలిగితే మరీ సంతోషం" అన్నాడు.

"భేష్-అలాగే కానిద్దాం-అది ఏర్పాటయిందనుకో....మరి నీకు కావలసిన పరికరాలమాటేమిటి? నీ చేపల గేలాలు-"ఎర"లలాటి వాటిని భూలోకంలోనే విడిచిపెట్టి వచ్చేశావనుకుంటాను. ఇక్కడ నీకు సులభంగా ఊగిసలాడే తొమ్మిది అడుగుల పేము బెత్తం దానికి తగిలించిన ఒక తీగ దానికో గేలం-"ఎర"గా వాడేందుకు కొన్ని ఈగలు ఇస్తే...."

"ఓహ్ వండర్ ఫుల్....ఇంకింతకన్న నాకేం కావాలిసార్!" అని ఎగిరి గంతేసినంత పని చేశాడు క్యాస్ట్వెల్.

"అబ్బో దేవుడింత దయామయుడని మావాళ్ళెవరూ నాకు చెప్పనే లేదు సర్!....పైగా ఏదో మనశ్శాంతి కోసం చర్చికి వెళ్ళాం అనుకోండి-వాళ్ళు చెప్పేవీ-చదివేవి వింటూంటే....స్వర్గమంత "బోర్" మరోటి వుంటదనిపించేది.

"ఉహాఁ! అలాగా" అంటూ చిత్తావర్ణాల తణికీలో పడిపోయాడు పీటర్.

● ○ ○

మరికొంతసేపటికి క్యాస్ట్వెల్ మామూలుగా భూమిమీద తన పని చేసుకుంటూన్నట్టే—ఒక పెద్ద కఱ్ఱ దాని చివర ఫిషింగ్ రాడ్-కొన్ని ఈగలున్న ఓ బుట్టా....పట్టిన చేపలు పెట్టుకునేందుకు ఓ తట్టతో ఈల వేస్తూ చేపలు పట్టే కార్యక్రమంలో నిమగ్నమైపోయాడు. భూమి మీద కంటే స్వర్గంలో చేపలు పట్టడం సులభం అనిపిస్తోంది. అందుకేనేమో "ఇంటికన్న గుడి పదిలం"అన్నారు. పైగా ఇతని పనిలో ఇతనికి సహాయ పడడానికి ఓ సహాయకుణ్ణి కూడా ఇచ్చేరు.

ఈల వేసుకుంటూ-ఈగల్ని గుచ్చటం-గేలాన్ని నీళ్ళల్లోకి విసి

రెయ్యేడం - గేలం అమాంతం బరువుగా మెలికెలు తిరగడం - గేలాన్ని లాగడం బ్రహ్మాండమైన తెల్లటి చేప దొరకడం— క్యాస్ట్‌వెల్ ఆనందంతో గెంతుతూ —

"అబ్బ సుమారు రెండున్నర పౌండ్ల బరువుండదూ-మై గుడ్ హెవెన్స్, అద్భుతమైన చేప....అబ్బ....అబ్బ....వండర్‌ఫుల్" అన్నాడు.

"భగవాన్....నీ నైపుణ్యాన్ని చూసి సంబరపడి పోతాడు సుమా!" అన్నాడు సహాయకుడు.

క్యాస్టువెల్ చేపని బుట్టలోవేసి మళ్ళీ కొక్కానికి ఎరవి సిద్ధంచేసి మళ్ళీ విసిరేశాడు నీళ్ళల్లోకి....మళ్ళీ ఓ క్షణం నిశ్శబ్దం....గేలం బెత్తం బరువుగా నీళ్ళల్లోకి ఒంగడం.... గేలం బరువుగా మెలికెలు తిరగడం గేలాన్ని లాగడం....మళ్ళీ....బ్రహ్మాండమైన .... అదే సైజు....అదే రూపం....అదే బరువు....అదే రంగు వున్న "చేప" మళ్ళీ క్యాస్టువెల్‌లో అదే ఉత్సాహం....సహాయకుని సరిగ్గా అదే వ్యాఖ్యానం....మళ్ళీ చేపని బుట్టలో వేశాడు. మళ్ళీ గేలాన్ని సిద్ధం చేశాడు....సరిగ్గా మొదటిసారిలాగా రెండోసారిలాగా జరిగింది....మరోసారి....మరోసారి. జిరాక్స్‌కాపీల్లా.... ఓ చేప తరవాత మరోచేప బుట్టనిండి పోతోంది.

"అబ్బే ఈ వ్యవహారం .... కొంచెం చికాగ్గా వుందోయ్ సహాయకా...."

"నువ్వు ఏం గోరితే....ఎలా కావాలంటే .... అలాగే ఇచ్చారా ? ఏమైనా తేడాగా వుందా?" అడిగేడు సహాయకుడు.

"నేనడిగింది ఇదేననుకో....మరీ ఇంత త్వరత్వరగా చేపలుపడితే ఎలా....కొంచెం సస్పెన్స్....కొంచెం వెరైటీ వుండొద్దా?"

"ఓ పని చేద్దాం .... రేవు మార్చేద్దాం .... కొంచెం వెరైటీగా వుంటుంది."

"అలాటివి ఇక్కడ కుదరవయ్యా!"

"ఏం?"

"అది అంతే...."

"సరే....సరే" అంటూ ఆముదం తాగినట్టు ముఖంపెట్టి మళ్ళీ పనిలో మునిగిపోయాడు....గంటలు....గంటలు గడుస్తున్నాయి. చేపలు కుప్పలు తెప్పలుగా బుట్టలో నిండిపోతున్నాయి.

"అబ్బా!....ఎంత సేపయ్యా....ఈ చికాకు పని ?"

"చికాకా?....నీకు ఈ పని ఎంతో సంతోషదాయకం అని .... సెయింట్ పీటర్‌గారి దగ్గర అన్నావుగా !"

"అన్నానే అనుకో - మరీ ఇంతగానా? కొంచెం కూడా విశ్రాంతి లేకుండా-మధ్యాహ్నం కాస్త కునుకు తీసి....మళ్ళీ ప్రారంభిస్తే?"

"ఇక్కడ మధ్యాహ్నాలూ అపరాహ్ణాలూ వుండవ్."

"మరి సాయంకాలం ?"

"సాయంకాలాలూ వుండవు...."

"బాబూ ఇప్పటికే మూడొందలకి పైగా చేపల్ని పట్టేను...."

"నాకు బ్రహ్మాండమైన తృప్తిగా వుంది....లేలే బయల్దేరు—లాడ్జికి పోదాం...."

"బాబూ అదేం కుదరదు ముందు ఈ పని పూర్తి కావాలి."

"ఎప్పటికి....పూర్తవుతుంది ?"

"అది నాకేం తెలుస్తుంది ?"

"ఓహో రాత్రి రాగానే పోవచ్చంటావ్?"

"ఇక్కడ రాత్రులూ ఉండవ్?"

"అయితే ఇలా ఈ దరిద్రగొట్టు చేపల్ని పడుతూనే కూర్చో వాలా !...."

"అంతే...."

"ఇదేం స్వర్గమోయ్....దేవుడా !"

"ఇది స్వర్గమని ఎవరన్నారు?"

"అయితే....నరకమా ?"

"అవునవును .... ఇది నరకమే....నీకు వేసింది ఒక అందమయిన శిక్షే...."

—★—

## 3. "మేక్ డోవెల్"- కథ

## (A SICK CALL)

—మోర్లీ క్యాలహాన్ (కెనడా)

మేక్ డోవెల్-ఒక చర్చ్ ఫాదర్. అతనికి తన విద్యుక్తధర్మం-తన పుస్తకాలూ-తన ప్రవచనాలూ తప్ప....వేరుధ్యాస వుండేది కాదు. పుస్తకాలు చదువుకునేటప్పుడూ, చదివినవి మననం చేసుకునేటప్పుడూ—ఆదివారంనాడు తాను చేయబోయే ప్రవచనాన్ని ముందుగా సిద్ధపడేటప్పుడూ తనలో తాను ఏదో గొణుగుకుంటోన్నట్టుగా అటూ ఇటూ తిరుగుతూండే వాడు. వయస్సులో, శరీరపు సైజులోను పెద్దవాడిక్రిందే లెక్క. నెత్తిమీద తెల్ల వూలులా మెరిసే పల్చటి జుట్టు వెనుకనున్న అరచేయి సైజు గులాబీ రంగు బట్టతల-నిజంగా ఒకమంచి రంగుల కాంబినేషన్. అతనికి ఒక చెవి పని చేయదు. ముఖంమీద జిగ్‌జాగ్‌గా ముడుతలు కూడా అతని పట్ల మనకు పరమపవిత్ర భావాన్నే కలిగిస్తాయి. బహుశః అతడు ఎంతోమంది మరణం ముందు వారి వారి పాపకార్యాల్ని గురించిన ఒప్పుకోలు (కన్ఫెషన్స్)వినడం—వారి పాప విష్కృతికి వారిని క్షమించమని ప్రార్థనలు చేసి చేసి వుండడం చేత-ఈ రహస్యాల్ని తన మనస్సులోనే పదిలం చేసుకోడం చేత (Under the Seal of Confession) మనిషి ఎప్పుడూ అలసిపోయినవాడిలా—ప్రయాసపడి భారం మోసేవాడిలా కనిపిస్తాడు. ఇతనిమీద ప్రత్యేకంగా యువతరానికి ఎంతో విశ్వాసం. అందుకే వారిమరణవాఙ్మూలాన్ని ఫాదర్ మేగ్డోవెల్‌కే చెప్పుకోవాలని కోరుకుంటూంటారు-అతడికి ఎంతటి మహాపాపుల చరిత్రలు విన్నా కోపం, ద్వేషం, అసహ్యం కలగవు-జాలి, సానుభూతి, ప్రేమ కలుగుతాయి. ఎంత పాపి అయివుంటే....వారిపట్ల అతని అనురాగం అంత హెచ్చుగా ప్రతీతి.

ఆ రోజున ఫాదర్ మేగ్డోవెల్-తనదైన శైలిలో అలా తిరుగుతూ ఏదో మననం చేసుకుంటూండగా-ఎవరో తలుపులు తట్టినట్టయింది. ప్రసన్న

మైన వదనంతో-మేగ్డోవెల్ తలుపుతీశాడు....

"ఫాదర్-ఒక అమ్మాయి మరణశయ్యమీద వున్నదట. మిమ్మల్ని చూడాలని కోరుతోందట. బహుశః పాపాలని ఒప్పుకుని ప్రాయశ్చిత్తాన్ని అర్థించడానికేమో...."

"ప్రత్యేకంగా నన్నే తీసుకురమ్మందా? ఎవరైనా ఫర్వాలేదన్నదా?"

"ఫాదర్ మేగ్డావెల్-కాకపోతే....ఎవరూ అవసరంలేదని కచ్చితంగా చెప్పిందట"-ఫాదర్ హాలులోకి వెళ్ళి వచ్చిన అమ్మాయిని చూశాడు.

ఆ వచ్చిన అమ్మాయి-అమాయకంగా కనిపిస్తోంది. సుమారు ముప్ఫై సంవత్సరాల వయస్సు వుంటుంది. మాటిమాటికీ జేబురుమాలుతో కళ్ళనీళ్ళని తుడుచుకుంటోంది. ముదురురంగు ఉన్నికోటు వేసుకునివుంది. ఫాదర్ని చూస్తూనే

"గుడ్ ఈవెనింగ్ ఫాదర్! మా చెల్లెలికిచాలా జబ్బుగా వుంది. మీరు వచ్చి ఆవిడను ఓదార్చాలి....బహుశః ఆమె ఎక్కువ కాలం జీవించక పోవచ్చు."

"కంగారుపడకమ్మాయ్! ఏమిటి సంగతి? కొంచెం గట్టిగా మాట్లాడు నాకు కాస్త చెముడు...."

అప్పుడా వచ్చిన అమ్మాయి కొంచెం గట్టిగా....

"మా చెల్లాయికిన్యూమోనియా....డాక్టర్గారు గంట గంటకీ వచ్చి చూసి వెడుతున్నారు. ఈలోగా మీరు వచ్చి అమ్మాయికి దైవ ప్రసాదంగా ....హోలి ఆయిల్ను తలపై పోసి....పవిత్రురాలిని చేయాలని కోరుతున్నాను" అంది.

"నువ్ చెప్పిందాన్ని బట్టి-పూర్తిగా మరణ సమయం రాలేదు. ఇలాటి పరిస్థితిలో-ఈ తైల సంస్కార కార్యక్రమం అవసరం వుండదు-కేవలం ఆమె వాఙ్మూలం వింటే సరిపోతుంది"

"అది కాదు ఫాదర్, మీకో ముఖ్యమైన సంగతి చెప్పాలి-మాబావకి ఈ మతపరమైన సంస్కారాలంటే బొత్తిగా ఇష్టం వుండవు. అతగాడు క్యాతలిక్ క్రిస్టియన్‌కాదు. మా చెల్లిల్ని ఏనాడూ చర్చికి కూడా పంపేవాడు కాదు. అసలు మిమ్మల్ని లోపలికి రానిస్తాడోలేదో కూడా అనుమానమే.

"నా విషయంలో నీకేం బెంగలేదమ్మాయ్....నేను అతనిని ఎలా లొంగదీసుకోవాలోనాకు తెలుసు...పద,ప దా నీకా బెంగేంవద్దు...." అంటూ ముందుకి నడిచాడు మేగ్డోవెల్. ఆ అమ్మాయి పేరు. జేన్‌స్టైన్‌హోప్. వాళ్ళ చెల్లెలు వాళ్ళ ఇంటికి నాలుగు వీధులుదాటి వుంటోంది.

"సరే సరే మనం నడుస్తూ మాట్లాడకుందాం....పద అన్నాడు నెత్తిమీద టోపీ గురిచేసుకుంటూ.

o o o

ఫాదర్ మేగ్డోవెల్ - వయో భారం చేత తడబడుతూ నడుస్తోండ డం చేత మిస్ స్ట్యాన్ హోప్ త్వరత్వరగా అడుగులెయ్యలేక పోతుంది.

"చెప్పుచెప్పు....మీ చెల్లెలి విషయం" అన్నాడు నిజానికి చెప్పడా నికి ఏమీ వున్నట్టుతోచదు - జాన్‌విలియమ్స్ అనేఅబ్బాయితో రెండేళ్ళయి కాపురం చేస్తోందని, అతడు చాలా మంచివాడని, కష్టపడి పైకివచ్చినవాడు అతనిలో వున్న ఒకే లోపం చర్చినీ, మతపరమైన విషయాల్ని ద్వేషించ డం ఒకటే.

"ఎల్సో - విలియంని పెళ్ళి చేసుకున్న తర్వాత మా కుటుంబం ఎల్సాతో పూర్తిగా తెగ తెంపులు చేసుకుంది. అయితే నేనే మనసొప్పక అప్పుడప్పుడు చెల్లాయిని చూడ్డానికి వెళ్తూ వుంటాను" ఇదంతా గట్టిగానే మాట్లాడాల్సి వస్తోంది - ఫాదర్ చెవిటివాడు కావడంవల్ల.

"ఆవిడ భర్తతో సుఖంగా జీవిస్తోందా?"

"దానికి లోటులేదు.... అదిమాత్రం కాదనడానికిలేదు" "ఇప్పుడు అతనెక్కడ వున్నాడు?"

"నేను వచ్చేటప్పటికి చెల్లి మంచాన్నే అంటిపెట్టు కూర్చున్నాడు. వెక్కివెక్కి ఏడుస్తున్నాడు కూడా. అంతఏడుపులోనూ చర్చిఫాదర్ని తీసు కొస్తేమాత్రం - మర్యాద దక్కదన్నాడు - పైగా వచ్చిన "ప్రీస్ట్" బుర్ర బద్దలుకొడతానని కూడా హెచ్చరించాడు.

"మరేం ఫర్వాలేదు.... మీ చెల్లెలు నన్ను చూస్తానందా?"

"ప్రీస్ట్ని తీసుకురమ్మని నాకు రహస్యంగా చెప్పింది కాని ఈ విష యం - జాన్కి తెలియకుండా చెయ్యమంది."

0 0 0

వాళ్ళు ఒక ప్రక్కసందులోకి తిరిగేరు - అది ఎపార్ట్మెంట్సు ఉన్న ఒక పెద్ద భవనం. స్ట్యాన్ హోప్ వెనకలే తడబడుతూ మెట్లు ఎక్క సాగేడు ఫాదర్ మేగ్డొవెల్. నాలుగేసి మెట్లెక్కి ఒగురుస్తున్నాడు.

"అమ్మాయ్ వచ్చేకాలమేకాని....ఒక్కరోజు కూడా వెనక్కివెళ్ళ ....యువకులం కాలేముకదా.... నువ్వేం కంగారు పడకు అన్నాడు నవ్వుతూ.

జేబురుమాలుతో పట్టిన చెమటని తుడుచుకుంటూ ముందుకు అడు గేస్తున్నాడు.... చివరికి ఒక తలుపుముందు నిలబడింది స్ట్యాన్హోప్. తలుపు తట్టేడు ఫాదర్. ఈలోగా ఫాదర్కేసి తిరిగి "ఇక్కడ ఏమి అవ మానాలు జరిగినా పట్టించుకోకుఫాదర్" అన్నట్టు దీనంగా చూసింది స్ట్యాన్ హోప్. "అవన్నీ నాకొదిలెయ్" అన్నట్టు చిరునవ్వు నవ్వేడు మేగ్డొ వెల్.

తలుపు తెరుచుకుంది. అతడు చాలా చికాకుగా వున్నట్టు కనపడు తున్నాడు. అతనుతొడుక్కున్న చొక్కాకి కాలర్ లేదు తీవ్రమైన ఉద్వేగం తో మరదలుకేసి తిరిగి

ఇలాటి పిచ్చిపనిఏదో చేస్తావని నాకు తెలుసు. అందుకే ముందుగా చెప్పాను.... ఎవరినైనా చర్చి మనుషుల్ని పిలిస్తే నీ మర్యాద నీకుదక్కదని. ఫాదర్....సారీ....ఇప్పుడు నాభార్యకి మీ అవసరం ఏమీలేదు - ఆమె ఎవ్వరినీ చూడదు.

"ఏమిటి మీరంటున్నది - కొంచెం గట్టిగా మాట్లాడండి.... నాకు ఒక చెవి వినబడదు"....

అసలే తిక్కమీద వున్నాడేమో....మరింత చిర్రెత్తుకొచ్చింది జాన్ విలియంకి. ఈ అనుకోని ఫాదర్‌గారి చెముడు జాన్‌ని హతాశుణ్ణి చేసింది. అవును.... మనం ఒకరిని తిట్టినప్పుడు అవతలవాడు రెచ్చిపోయి తిరిగి తిడతాడనీ అప్పుడు మనం మరీమరీ రెచ్చిపోవచ్చనీ "రిహార్స్" వేసుకున్న అంచెనా అడ్డం తిరిగితే హతాశులం కాక ఏంచేస్తాం?

"ఫాదర్.... మా బావతో మీరే నేరుగా మాట్లాడండి...." అంది స్త్యాన్ హోప్. ఫాదర్‌కి ఇదీ వినపడినట్లు లేదు....

"మీరు ఏమీ అనుకోకపోతే ఒక్కక్షణం లోపలికి వచ్చి కొంచెం ఆయాసం తీర్చుకుంటాను, వచ్చింది దైవకార్యం మీదే అయినా శారీరక బాధలు అందరికీ సమానమేకదా!" అన్నాడు ఫాదర్.

జాన్‌కి ఈధోరణీ నచ్చలేదు. అందుకే మరింత గట్టిగా

"మీరు ఇక్కడ వుండడానికి ఎంతమాత్రం వీలులేదు" అన్నాడు

"అది సరేనయ్యా.... కోపం వద్దు.... నేనా ముసలివాణ్ని....నీతో వాదించడానికీ, నీ మీద కోపతాపాలు చూపించడానికి ఓపికాలేదు - అది నావృత్తికీ తగదు.... ఇంతకీ నీ భార్య ఎక్కడ వున్నట్టు?

ఏం చేస్తాడు జాన్? "నేను అనుమతించను - అవసరంలేదు - మీరి క్కడ ఒక్క క్షణం నిలవడానికి వీల్లేదు అంటూంటే ఏమిటీ మంకుతనం" అంటూ ఫాదర్ జెబ్బని పట్టుకున్నాడు - కోపంతో పళ్ళు పటపటలాడిస్తూ.

మిస్ స్టాన్‌హోప్ ఈ అమర్యాదకి హతలాకుతలం అయిపో తోంది.

"జాన్.... జాన్.... కొంచెం మర్యాదగా ప్రవర్తించు.... కొంచెం మర్యాదగా ప్రవర్తించు" అని అరుస్తోంది నిస్సహాయంగా .... లోపలి నుంచి ఓ సన్నమూలుగు వినిపిస్తోంది. తన జెబ్బలు జాన్ ఉక్కు పిడి కిలో బిగుసుకు వున్నాయన్న సంగతిని కూడా విస్మరించి

"నీవేమీ అనుకోకపోతే నీ భార్యని నేను వెంటనే చూడాలయ్యా జాన్" అన్నాడు మేగ్డోవెల్. అనడమేకాక ఏమరపాటుగా వున్న జాన్ చేతిపట్టుని విడిదీసుకుని ఆ మూలుగువచ్చే గది తలుపు తోసుకుని లోపలికి ప్రవేశించాడు.

"అరే ఏమిటీ దౌర్జన్యం .... నేను నిన్ను అనుమతించనన్నా మీకు సిగ్గూ శరం వున్నట్టు తోచదే" అంటూ అడ్డుపడబోయాడు జాన్ విలియం.

మొత్తానికి ఫాదర్ మంచం మీద మూలుగుతోన్న ఎల్సా పక్కకి వెళ్ళి నిలబడ్డాడు.-

"గుడ్ ఈవెనింగ్ ఫాదర్" అంది ఎల్సా. ఫాదర్‌ని చూడగానే తనకి చరమ గడియలు వచ్చేశాయన్న భావన కలిగిందో ఏమో మరింత నీరసంగా తయారయింది ఆ ముఖం. ఆమె భావాన్ని గ్రహించినవాడిలా.

"లేదు తల్లీ.... నువ్వు తప్పక బాగవుతావు అన్నాడు చిరునవ్వుతో ఆమె తలను నిమురుతూ....

జాన్ కూడా.... హటాత్తుగా భార్యమీదకి వంగి ఆమె చేతిని తన

చేతిలోకి తీసుకుని ముద్దాడేడు. ఆమెతలను ఆప్యాయంగా నిమురసాగేడు.

"కుమారా! నువ్వు మరోలా అనుకోనంటే.... నీ భార్య రహస్య ముగా ఏమి వాఙ్మూలం ఇస్తుందో వింటానయ్యా.

"వాఙ్మూలం లేదు- గోంగూరా లేదు- మిమ్మల్ని అసలిక్కడికి రమ్మన్న వాళ్ళెవరు? .... మమ్మల్నిద్దర్నీ.... ఇలా విడదియ్యాలని ఎందుకు అనుకుంటున్నారు? మేం ఆనందంగానే జీవిస్తున్నామయ్యా మహా నుభావా!.... ఏదో మా కర్మకాలి ఓ జబ్బుచేసింది — సరైన డాక్టర్‌నే పెట్టాను.... మళ్ళీ వారం రోజుల్లో మామూలు మనిషై తిరుగుతుంది. బతి కుండగానే.... ఎందుకు హడలగొట్టి చంపేస్తారు - అందుకే నాకు ఈ మతాలూ — ఆచారాలూ అంటే మంట"

భగవంతుడు నిన్ను ఆశీర్వదిస్తాడులేవయ్యా.... కొంచెం జ్ఞానంతో ప్రవర్తించు. నన్ను ఓ పది నిముషాలు ఏకాంతంగా ఈ రోగి దగ్గరవదులు ఆమె ఇచ్చే వాఙ్మూలం నేను వినితీరాలి. ఇది నా విద్యుక్త ధర్మం."

"నేనూ ఇక్కడే వుండి తీరతాను - నా భార్యకూ నాకూ మధ్యగా ఎవ్వరూ అడ్డు రాలేరు— ఎలీసా! ఏమిటి నీ సమస్య.... నేను నిన్ను జీవి తంలో ఎప్పుడైనా- ఏ విషయంలోనైనా బాధ పెట్టేనా.... అంత రహస్య ముగా ఇవ్వడానికి నీదగ్గర ఏం వాఙ్మూలం వుంది. నన్ను వెళ్ళిపొమ్మ నడం నీకు ధర్మం కాదు- న్యాయం కాదు - మనమధ్య రహస్యాలేమిటి? .... నో నో.... నేను నిన్ను విడిచి వుండను - నేను బ్రతకలేను" చిన్న పిల్లవాడిలా రోదించసాగేడు జాన్ విలియమ్స్. ఫాదర్ కేసి తిరిగి

"ఏమయ్యోయ్.... ముసలాడా! ఇచ్చినంతసేపూ మర్యాద ఇచ్చాను ఇంక నావల్లకాదు.... నువ్వు తక్షణం ఈ చోటు విడిచిపోకపోతే....నేనేం చేస్తానో నాకే తెలియదు" అన్నాడు ఉగ్రుడై.

"నేను అధికార పూర్వకంగా - బెదిరించైనా ఆమె వాఙ్మూలమును తీసుకొనగలను. అయినా నేను అటువంటి పనులుచేసి ఆమె మనశ్శాంతిని పాడుచేసి వాఙ్మూలం తీసుకునే ప్రయత్నం చేయను. అయినా జాన్ నువ్వంటే నాకెంతో అభిమానం కలుగుతోంది. నువ్ చాలా మంచి వాడిలా వున్నావు."

జాన్ భార్య చేతిని ఇంకా పట్టుకునే వున్నాడు. రెండు చేతివ్రేళ్ళను తన జుట్టులో దూర్చుకుని బలంగా రుద్దుకోసాగాడు.

"ఫాదర్, నా మాట కొంచెంకూడా అర్థం చేసుకోవేమయ్యా ! ఇప్పుడు నా భార్యని ఉద్ధరిద్దామని వస్తోన్న వారెవ్వరూ మా కష్టసుఖాల్లో మమ్మల్ని ఆదుకున్నవారూకారు, మా మానాన్ని మమ్మల్ని వదిలేసారు. ఇప్పుడు తగుదుమమ్మా అంటూ సిద్ధమయి మమ్మల్ని చెరో దారికీ లాగేసి విడదీద్దామని చూస్తున్నారు ఫాదర్—నా భార్య నా సాహచర్యంలో ఎంతో తృప్తిగా బ్రతికేసింది. ఏమి చెపుతుంది, ఆమె ఏ పాపమూ చేయలేదు. ఇక పశ్చాత్తాపం-పాప పరిహారానికి ప్రార్థనలు-ఏమిటి ఈ మూర్ఖత ?.... దయచేసి మా మానాన్ని మమ్మల్ని బ్రతకనీయండి—ప్లీజ్....ప్లీజ్...." దీనంగా రోదించాడు జాన్.

"మిష్టర్ జాన్....మమ్మల్ని కాస్త వంటరిగా వదలివేయాలి ఆమె చెప్పేది వినాలి....ప్లీజ్...."

"ఫాదర్, ఏమిటి మీరనేది ?"

"మీరు ఒక్కసారి బయటకి వెళ్లాలి....తప్పదు"

"నేను వెళ్ళమగాక వెళ్ళను"

విలియమ్స్ తలగడమీద తన తలను ఆన్చి పడున్నాడు.

"నా కోసం ప్రార్థించండి ఫాదర్" అంది నీరసంగా శ్రీమతి విలియమ్స్.

ఫాదర్ మాగ్డోవెల్ మంచం ప్రక్క మోకరిల్లి ప్రార్థనని ప్రారంభించాడు—విలియమ్ సక్రమంగా ఆలోచించడం నేర్చుకోవాలనీ, శ్రీమతి విలియమ్స్ ఆరోగ్యం కుదురుబడాలని హృదయాంతరాళాల్లోంచి ఆ ప్రభువుని ప్రార్థించసాగాడు. ఆయన ఎదురుగా ప్రార్థనల గ్రంథాన్ని వుంచుకుని ఆపవిత్ర గ్రంథంలోని భాగాల్ని చదవసాగాడు-

ఈ ముసలి ఫాదర్ ఓర్పు-పట్టుదల విలియమ్స్‌ని నిరుత్తరుణ్ణి చేయడమేకాక అతని మతిని పోగొట్టేస్తున్నాయి.

అతని తెల్లటి పట్టులా మెరుస్తోన్న తెల్లజుట్టుమధ్య అరచేతి అంత సైజులో గులాబీరంగులో మెరుస్తోన్న బట్టతల ఒక దివ్యమయిన వెలుగు కలిగిన చక్రంలా తోస్తోంది.

"అయ్యో....ఫాదర్‌గారూ....ఎన్ని వందలసార్లు మీకు చెప్పాలి? మాకు పొరపొచ్చాలులేవు-ఎంతో సంతృప్తికరమయిన జీవితం నాభార్యది. మమ్మల్ని మామానా బతకనీయండి....దయచేసి మమ్మల్ని వదిలేయండి !!

ఈవేమీ పట్టించుకోకుండా ఫాదర్ మేగ్డొవెల్ మోకరిల్లి ఏవేవో చదువుతూ ప్రార్థిస్తూనేవున్నాడు. జాన్ మతిపోయినవాడిలా "మమ్మల్ని మామాన వదిలేయండి....నా భార్యని నేనేమీ కష్టపెట్టలేదు. ఆమె కాని పనేమీ చెయ్యలేదు" అంటూ అరుస్తూనే వున్నాడు—

"అమ్మాయీ! నీ భర్తకోసం నువ్వన్నీ త్యాగం చెయ్యడానికి సిద్ధంగా వున్నావా?

"ఉన్నాను ఫాదర్"

"భగవంతుడి సాక్షిగా....నువ్వేం చేస్తున్నావో నీకు తెలియదంటాను"

"మేము ఒకరినొకరు ప్రాణాధికంగా ప్రేమించుకున్నాం ఫాదర్-మేము ఇంతకాలం హాయిగానే జీవించాం" అంది ఆ అమ్మాయి.

"ఇంతకాలం సరే! వర్తమానంలో .... కూడా అదేమాట అంటావా?"

"ఫాదర్—వర్తమానంకన్న భవిష్యత్తును....అదే ఒకవేళ నేను ఏమయినా అయిపోతే....అదేకదా నేను మధనపడేది...."

"అదీ పాయింటు...." నిట్టూర్చాడు ఫాదర్. "ఇంతకీ మీ వివాహం చర్చిలోనే భగవత్సాక్షిగా జరిగింది కదూ?"

"లేదయ్యా లేదు....ఎక్కడో ఒకచోట అయింది....చర్చిలో పెళ్ళాడిన పెద్దమనుషులందరికన్నా—నేను ప్రేమాభిమానాలతోనే చూసుకుంటున్నాను....నీకు చెముడొకటి ఖర్మ....ఈ రహస్య వాఙ్మూలాలు మూడు వాడలకి వినిపిస్తున్నాయి"

ఫాదర్ మాగ్డోవెల్ పరమ ప్రశాంతంగా—

"నేను చెమిటివాణ్ణవడం ఒక ప్రారబ్ధం—కొంచెం గట్టిగా మాట్లాడాల్సి వస్తోంది....అంతేకదా?"

"హూఁ" అని నిస్సహాయంగా గోం[డించాడు విలియం.

"జాన్-అయాసంగా వుంది—ఒక గ్లాసుతో నీళ్ళుతెచ్చి పెడతావా?"

జాన్ విలియమ్స్-ఒక సందిగ్ధంలో పడిపోయాడు. ఆయాసపడుతూన్నవాడికి ఒక గ్లాసెడు మంచినీళ్ళు తెచ్చి ఇవ్వనంత క్రూరంగానూ

వుండలేదు. అలాగని తన భార్యని ఒక చర్చి ఫాదరుతో ఒంటరిగా వదలి మరణ వాఙ్మూలానికి అవకాశమూ ఇవ్వలేదు.

అయితే పవిత్రమైన చర్చి నిర్వాహకుడు....తనని మోసగిస్తాడా అనే ధైర్యంతో - "అలాగే తెస్తాను గాని ఫాదర్....ఈలోగా కన్ఫెషన్స్ గట్రా అంటూ నా భార్యని హడల కొట్టకు" అంటూ అయిష్టంగానే లోపలికి దారి తీశాడు.

o o o

జాన్ అలా వెళ్ళగానే తొందర తొందరగా రోగి మంచం దగ్గరికి వచ్చి "అమ్మాయీ! నేను కొన్ని ప్రశ్నలు గబగబా అడిగేస్తాను. నీవు వాటికి ముక్తసరిగా జవాబులు చెప్పు—మనస్సులో ఒక సత్సంకల్పాన్ని—నీవు చేయదల్చుకుని చేయలేకపోయిన సత్కార్యాన్ని....మననం చేసుకో నీ తరపున పాప పరిహారానికి నేను ప్రార్థిస్తాను" అన్నాడు.

మంచి నీళ్ళ గ్లాసుతో జాన్ గదిలోకి అడుగుపెట్టేసరికి-మాగ్డోవెల్ ఎల్సా మీదికి వంగి ఏవో రహస్యాలు వింటూన్న దృశ్యం కనబడింది-

"అంటే మాగ్డోవెల్ నిజంగా చెమిటి వాడు కాదా....ఆయన గారికి నిజంగా దాహం వేయలేదా?.... పవిత్రమైన చర్చి నిర్వాహకుడు కూడా విధి నిర్వహణ కోసం వక్రమార్గాన్ని అనుసరించి, మోస పూరితంగా ప్రవర్తించాలా?" లాటి అనుమానాలొచ్చాయి జాన్‌కి.

చాలా దూకుడుగా ప్రీస్ట్ మీద మీదకి వచ్చాడు.

"అంత దూకుడుగా రాకయ్యా....మిష్టర్" అన్నాడు మాగ్డోవెల్.

"దూకుడేం కాదు .... మోసగించబడ్డాననే బాధ" పళ్ళు పట పట లాడించాడు.

ఏమైతేనేం ఫాదర్ మాగ్డోవెల్ వచ్చిన పని పూర్తయింది.

తృప్తిగా గాలిపీల్చి బరువుగా అడుగులేసుకుంటూ మెట్లుదిగ సాగేడు.

క్రింద హాలులో ఫాదర్ మాగ్డోవెల్ కోసం వేచివున్న స్త్యాన్ ఫోన్ -

"ఫాదర్—మా బావ చాలా మొరటువాడు-మిమ్మల్ని ఎలా మాట లతో హింసించి వుంటాడో నేను ఊహించగలను-అయామ్ వెరీ సారీ!" అంది.

"నిజమే అది చాలా చికాకైన సన్నివేశమే. అయితే జాన్‌లాంటి ముక్కుసూటి మనిషిని కలుసుకోవడం చాలా సంతోషాన్ని కలిగించింది. అతడు క్యాతలిక్ కాకపోవడం ఒకటే దురదృష్టం. అయితే క్యాతలిక్‌ని అయిన నేను నిజమైన క్యాతలిక్‌లా ప్రవర్తించానా అనేదే ప్రశ్న...."

ఒగరుస్తూ మెట్లు దిగుతూ తనలో తాను గొణుగుకుంటూన్నట్టు అన్నాడు ఫాదర్ మాగ్డోవెల్.

ఇంటి బయటకు వచ్చి రోడ్డు మీదకి వచ్చిన ఫాదర్‌కి చాలా తృప్తిగా వుంది. ఒక మొండిఘటంతో తాను ఘర్షణపడకుండా విజయవంతంగా తన పనిని తాను ముగించుకోగలిగాడు. ఇదేమంత తక్కువ అంచనా వేయదగ్గ విజయం కాదు—అయితే అతని ఆలోచనా స్రవంతి అక్కడికే పరిమితం కాలేదు.

"వాళ్ళు ఏవిధంగా చూసినా ప్రాపంచికంగా ఆలోచించి చూస్తే సుఖ సంతోషాలతోనే జీవిస్తున్నారు. మరి ? ? నేను వారి మధ్యదూరి .... వారు పశ్చాత్తాపపడాలని ఉద్బోధించింది ఎందుకోసమట?"

నిజానికి అందం ఆనందం ఒకేచోట సహజీవనం చేస్తోన్న అపురూపమైన జీవితం వాళ్ళది....అయితే మన దృష్టిలో అది మతాతీత, మత వ్యతిరేక, అనాగరికమయిన సుఖమయ జీవితం వాళ్ళది ....

నిజమా ? ?....ఏమో ? .... నిజంగా సుఖపడేవాళ్ళని మతం పేర వాటికి కుహనా విలువలని అంటకట్టి-సుఖాన్ని పాపంగా మార్చి చెప్పడం ఎంతవరకూ సబబు? అన్నది ఫాదర్ మాగ్డోవెల్ తర్కానికి అందటం లేదు. అతడికి వారిపట్ల అపచారం చేశానేమోనని అనిపించసాగింది.

—§ o §—

# 4. పిల్లి మంత్రాలు

## (THE BOY WHO DREW CATS)

—లాఫ్కాడియో హెర్న్

(జపాన్ కథ)

అనగా అనగా జపాన్‌లోని ఒక కుగ్రామంలో ఒక బీద వ్యవసాయ దారుడు వుండేవాడు. అతడు అతని భార్యా చాలా మంచివాళ్ళుగా పేరు బడ్డారు. ఆ రోజుల్లో సంతానమే ఆస్తి కనుక—సంతతికి. పరిమితి ఉండేది కాదు—అందుకనే అతగాడు నిస్సంకోచంగా భగవంతుడు ఎంత కోటాగా నిర్ణయిస్తే అంతమందినీ కనేశాడు. అయితే ఆర్థిక సమస్యలనేవి అప్పుడూ ఇప్పుడూ ఒకటే కనుక తక్కువరాబడితో "కుచేల" సంతానాన్ని నెట్టుకు రావడం కష్టంగానే వుండేది. సంతానంలో పెద్ద పిల్లలు దార్ఢ్యంగా వుండ డముచేత వారిని కాయకష్టం చేసే పనుల్లో పెట్టేశాడు. ఆడపిల్లలు వంటలూ వార్పులేకాక—చేతిపనుల్లో కూడా మంచి శిక్షణ పొంది — తల్లిదండ్రులకి చేదోడు వాదోడుగా వుండేవారు—ఎటొచ్చీ ఈ కడసారి కండిగింజలాటి కొడుకుతోనే వీళ్ళకి సమస్య వచ్చిపడింది. ఒట్టి అర్భకపు ప్రాణి—శారీర కంగా దుర్బలుడైనా మంచి తెలివి-మాటకారితనమువున్నవాడు కావటం మూలాన అతనికి మతం సంబంధమైన ఉద్యోగమే సరి అయినదని చూసిన వాళ్ళు అనసాగేరు. అంచేత అతన్ని మతబోధకుడిగా తీర్చిదిద్దాల్సిందిగా ఒక దేవాలయంలోని ఒక పండిత ప్రకాండుడికి ఒప్పగించడం జరిగింది.

వయోవృద్ధుడైన ఆ పండితుడు ఈ పిల్లవాణ్ని సాదరంగా దగ్గరకు తీసుకుని అనేకమైన తార్కిక ప్రశ్నలతో ముంచెత్తేడు.ఆ అబ్బాయి ఆయన ఆశ్చర్యపోయేలాటి తెలివైన సమాధానాలు చెప్పడంతో "మీ వాణ్ని తప్పక నా అంతటి వాడిగా తీర్చిదిద్దుతాన"ని హామీ ఇచ్చాడు.

విద్యాబోధన ప్రారంభమైంది-ఎండిన దూదిలో పడ్డ నిప్పురవ్వలా—అబ్బాయి సకల విద్యల్నీ కరతలామలకం చేసుకోసాగేడు, నమ్రత, వినయ విధేయత, శ్రద్ధ, శుభ్రత, పవిత్రతాలాటి విషయాల్లో కూడా అబ్బాయి వల్ల పండితులవారికి ఏ సమస్యా కలగలేదు....అయితే....?

ఈ అబ్బాయికి చిత్రలేఖనం-చాలా ఇష్టమైన విషయం ఏదైనా వింటోన్నా, మాట్లాడుతూన్నా, ఆలోచిస్తున్నా యాంత్రికంగా పెన్సిల్‌తో ఏవేవో గీతలు గీస్తూ ఓ చిత్రాన్ని అలవోకగా గీసిపారేసేవాడు. అయితే ఆ బొమ్మ విధిగా ఒక "పిల్లి" బొమ్మ అయివుండేది. అతని గది నిండా పిల్లి బొమ్మలు—అతని మేజాబల్లమీద వున్న అన్ని కాగితాల మార్జిన్‌ల లోనూ—ఎక్కడ కాళీ కనబడితే అక్కడో పిల్లిబొమ్మ ఉండాల్సిందే....

పిల్లి—పిల్లి వెనక పిల్లి—పిల్లి ముందు పిల్లి క్రింద పిల్లి—పిల్లి నెత్తిమీద పిల్లి—పిల్లి కడుపులో పిల్లి ....ఇలా తయారయింది. ఇతని చిత్రకళాసేవ—వృద్ధ పండితులవారు—మందలించి చూశాడు— కశ్మెర చేశాడు—చాలా తీవ్రంగా వార్నింగులు ఇచ్చాడు—అయినా అబ్బాయి ధోరణి అణుమాత్రం మారలేదు—ఆఖరికి ఒక్కమండి "అబ్బాయ్! నీ వ్యవహారం ఏ మాత్రం బాగులేదు—ఈ దేవాలయ సేవకీ నువ్వెంత మాత్రం అర్హుడివికాదు....ఆఖరిసారిగా చెపుతున్నాను — నువ్వు గొప్ప చిత్రకారుడివైతే కాగలవేమోకాని, ఏ జన్మలో నీకు మత ప్రబోధకుడు అయ్యే యోగ్యతలేదు. అయితే నేను చెప్పే సలహాని మాత్రం జాగ్రత్తగా విను "పెద్ద పెద్ద ప్రదేశాలకి వద్దు - చిన్నవాటితో తృప్తిపడు."

పండితులవారి భాష ఏమో అబ్బాయికి అర్థం కాకపోయినా వారు చెప్పిన సలహాని మాత్రం మననం చేసుకుంటూ - ఇక్కడకాకపోతే మరో చోట శిక్షణ పొందవచ్చు అనుకుంటూ ఆ చోటు విడిచిపోయాడు. "ఇంటికి వెడితే తండ్రి, అన్నలూ అక్కలూ తరిమెయ్యడం తథ్యం-ఒక్క అమ్మ-

ఆదరిస్తుందేమోకాని - నాన్నకి యుడిసి....వద్దు .... ఇంటికి మాత్రం వెళ్ళను....మరి....?"....అక్కడికి దగ్గరలోనే మరో గ్రామములో ఇంత కన్నా పెద్ద గుడి వున్నదట....దానిలో పాండితీ ప్రకర్షకలిగిన పూజారులు కొలెదుమంది ఉన్నారట... "ఎవరో ఒకరు....నాకు దారి చూపించకపోరు" అనుకుంటూ ఆ గ్రామంవేపు తరలిపోయాడు.

అయితే అబ్బాయికి తెలియని ఒక విషయం వుంది.

ఆ దేవాలయం ఎప్పుడో మూత పడిపోయింది. అక్కడి పూజారులు బేజారెత్తి ఎప్పుడో ఆ దేవాలయాన్ని విడిచి పారిపోయారు....నిష్కారణంగా కాదు సుమా....? ఆ దేవాలయాన్ని ఒక విచిత్రమైన భూతం ఆవహించింది-దేవాలయానికి వచ్చేవాళ్ళని నానా హింసలూ పెట్టసాగింది-ఎక్కడివి అక్కడ వదిలేసి-ఆ దేవాలయాన్ని పాడుబెట్టి అందరూ పారిపోయారు -ఎవరైనా అతి సాహసం చేసి ఈ భూతం అంతం చూస్తామని ప్రగల్భాలు పలికి లోపల ప్రవేశించినా, వారు ఆ మరునాడు శవాలుగా మారి దేవాలయం బయట పడి వుండేవారు....దీని వెనుకాల ఇంత కథ వుందని తెలియని అబ్బాయి తలుపు ముందు నిలబడి....

"ఏమండీ....తలుపు తియ్యరూ?" అంటూ పిలవసాగేడు. అయితే లోపల నుంచి ఏ ప్రతిస్పందనా లేకపోవడంతో తలుపును ఓ గెంటు గెంటడము-దర్వాజా తలుపులు తెరుచుకోవడం జరిగింది.

లోపల దేదీప్యమానంగా దీపాలు వెలుగుతున్నాయి. అయితే గోడలకి సాలెగూళ్ళు పట్టివున్నాయి. నేలంతా అరంగుళం ఎత్తున కొంతకాలంగా మూతపడివుందేమో....సరే....ప్రొద్దుటిదాకా కాలక్షేపంచేస్తే విషయం తెలుస్తుందికదా! అనుకుంటూ లోపల ప్రవేశించాడు.

తిరిగేకాలూ-తిట్టేనోరూ ఊరుకోవంటారు—అయితే మరోటికూడా వుంది-గీతలు గియ్యడానికి అలవాటు పడ్డచేయీ ఊరుకోదు. అక్కడ గోడలు సున్నం కొట్టి ఖాళీగా వున్నాయి—అదృష్టవశాత్తు సిరాబుడ్డి-బ్రష్లు కూడా దొరికాయి...."ఆహా...ముదమాయెను నామదికిన్"-అన్నట్టు అబ్బాయికి ఒళ్ళు తెలియనంత ఆనందం కలిగింది. కలగడం ఏమిటి? ఓ విజృంభించి బొమ్మలు వేసెయ్యసాగేడు. ఏమి బొమ్మలు వేసాడో వివరించాలంటారా....మా పాఠకులు అంత ఊహించని వాళ్ళు కారు. ఎందుకొచ్చిన సస్పెన్స్?

పిల్లి బొమ్మలు. ఎన్ని పిల్లి బొమ్మలు-ఎన్ని భంగిమల్లో-ఎన్ని జాతుల పిల్లుల్ని చిత్రించాడో చెప్పలేం— జీవితంలో ఇంతటి మహదానందాన్ని అబ్బాయి తను పుట్టేక అనుభవించలేదు. గీసిగీసి విసుగెత్తి చివరకు నిద్ర ముంచుకురాగా....ఎక్కడ పడుకుంటే బాగుంటుంది అని ఆలోచించసాగేడు. అప్పుడు హటాత్తుగా తన గురువు-అదే ఆ పండితప్రవరుడు చెప్పిన సలహా గుర్తుకు వచ్చింది "పెద్ద పెద్ద ప్రదేశాలకు వద్దు చిన్న చిన్న వాటితో తృప్తి పడు"

అందుకే ఆ దేవాలయాంలో అతి చిన్న గది ఏది ఉంటుందా అని వెతికి వెతికి దాన్లో పడుకున్నాడు-

పడుకున్నాడన్న మాటేకాని—కంటిమీద కునుకు పడితే ఒట్టు-తెల్లవార్లూ హాలులో రణగుణ ధ్వని—గావుకేకలు గభీగుభీమన్న శబ్దాలూ, హాహాకారాలూ-అవేమయి వుంటాయి? అన్న ఆలోచన కూడా రాలేదు ఆ అబ్బాయికి-

నిద్రాభంగమయిందనే చికాకు మాత్రం కలిగింది. దీపాలన్నీ ఆరిపోయి మొత్తం దేవాలయమే కటిక చీకటయిపోయింది-ఏదిఏమయినా బల

వంతంగా కళ్ళు మూసుకుపడుకున్నాడు-చివరకి ఎలాగైతేనేం తెల్లవారింది-మెల్లగా తలుపు తెరుచుకు బయటకు వచ్చి చూశాడు. దేవాలయమంతా చిందరవందరగా పడి వుంది. యుద్ధరంగాన్ని తలపింపజేస్తోంది. హాలు మధ్యగా ఓ పెద్ద సైజు ఎద్దంత దెయ్యపు ఎలిక రక్తపు మడుగులో చచ్చి పడి వుంది—ఎవరు చంపి వుంటారు? మనుష్యులెవరూ వచ్చిన సూచనలు లేవు—ఆశ్చర్యకరమైన విషయం ఏమంటే గోడలమీద ఉన్న అన్ని పిల్లి బొమ్మల నోళ్ళకీ-పంజాలకీ-రక్తపు చారికలు వున్నాయి-పెద్ద పెద్ద ప్రదేశాలకి వద్దు-అన్న సలహా ఏమిటో అర్థం కాసాగింది అబ్బాయికి.

ఆ తరువాత ఆ అబ్బాయి ఓ గొప్ప చిత్రకారుడు అయ్యాడు. ఇప్పటికీ ఆ దేవాలయంలోని పిల్లిబొమ్మలు యాత్రికులకు అపురూపంగా చూపిస్తారు జపాన్‌వారు.

—o—

# 25. "తప్పించుకు తిరుగువారు ధన్యులు సుమంతీ !"

(THE STREET THAT GOT MISLAID)

—పాట్రిక్ వ్యాడింగ్టన్ (కెనడా)

మార్క్ జిరాన్‌డిన్ మునిసిపల్ కార్పొరేషన్‌లో టౌన్‌ప్లానింగ్ సెక్షన్‌లో ఫైలింగ్ గుమాస్తా. ఒకే సీటులో పాతుకుపోయాడో ఏమో అత నికి ఆ నగరం మొత్తంఒక మ్యాప్ రూపంలో అలా కళ్ళముందు కదుల్తూ వుండేది. ఆ నగరంలో వీధులపేర్లు, పేటలపేర్లు, భవంతులపేర్లు, ఏ భవంతి ఎన్ని అంతస్థులో అన్నీ కంఠోపాఠం. ఏ ఏ వీధిలో ఏ మొగని ఏ ఇల్లువుందో, ఏ వీధిలో ఏ ఇల్లు ఆఖరిదో - ఏ వీధిలో ప్రవేశిస్తే మనం మరి ముందుకు సాగకుండా గోడలాటిది అడ్డొస్తుందో (దాన్నే బ్లైయిండ్ లేన్ అంటాం) అన్నీ కళ్ళుమూసుకు చెప్పగలడు.

ఈ ఘనవిద్యలో అతవిని పదిమంది పోలీసులూ - డజన్‌మంది టాక్సీ డ్రైవర్లుకూడా నిర్జించలేరు. అంటే దీని అర్థం అతగాడు ప్రతి రోజూ ఈ వీధులన్నీటుకు తిరుగుతున్నాడని అర్థంకాదు. అది తాను ఫైలు చేసే సమయంలో వాటిని - మళ్ళీమళ్ళీ గుర్తుపెట్టుకోవడం వల్ల కలిగిన జ్ఞాన (జ్ఞాపకం) మాత్రమే. అయితే ఒక్క విషయం మాత్రం స్పష్టం - అతడు తానుచేసేది, చిన్న ఉద్యోగమైనా, తన విద్యుక్త ధర్మాన్ని అం తగా అభిమానించాడు. ఆరాధించాడు, ప్రేమించాడు - తన విధిలో తను అంతగా తదాత్మ్యం చెందేవాడు. ఇలా ప్రతి ఒక్కరూ ఎవరి ఉద్యోగాన్ని వారు అంతనిష్టగానూ, తపస్సుగానూ చేస్తే ఎంత బాగుండును? నిజానికి మనంఏదో భవంతి ముందు నిలబెట్టి - "ఇదిఏమి అనిఅడిగినా అతడు మనకి చెప్పలేడు - దానికి ప్రక్కనున్న భవనంపేరు చెపితే మాత్రం తక్కిన దీని "కథా కమామీషూ" చెప్పేస్తాడు. అంతక్షుణ్ణంగా ఎబ్బాట్ వీధిమొదలు జోయ్‌టిక్ వీధివరకూ ఆ నగరాన్ని క్షుణ్ణంగా పాపన వర్ణిశాడు. ఇత

గాడిని ఓ చిన్న గుమాస్తా అని ఈసడింపుగా, ఇతర సమయాల్లో, చూసినా —వాళ్ళకి ఏమైనా అవసరం వున్నప్పుడు - బడాబడా పెద్దమనుషులూ - గొప్పగొప్ప ఇంజనీర్లూ -ఏదో ఒక ప్రదేశాన్ని గురించి వివరాలు తెలుసుకోడానికి అతని దగ్గరకి వస్తూనే వుంటారు. ఎలక్షన్ సమయాల్లో హస్త సాముద్రికుల గిరాకీ లాటిది అతని నిత్యకృత్యం.

నిజానికి అతడుచేసే వుద్యోగంలో మనస్సుకు అహ్లాదాన్ని కలిగించే ప్రత్యేకత ఏమీ లేకపోయినా - అతని మటుకు అతనికి తాను చేసే ఉద్యోగం గర్వకారణంగానే వుండేది. అతనికి అ స్తమానం ఏదో గడబిడలతో చికాకు కలిగించే అతని ఇంటి పరిసరాలకంటే — ఆఫీసే పదిలంగా హాయిగా వుండేది (వాళ్ళ ఇల్లు ఓవెన్ స్ట్రీట్‌లో వుండేది - సెయింట్ క్యాతరీన్ చెర్చికి దక్షిణ వైపున ఉండే రెండురోడ్ల కూడలిలో వుంది. ఏ ఇంటిని గురించైనా అతనికి ఈ విధంగా చెపితేనే అర్థం అవుతుంది — మరి!) - అతని ఇరుగు పొరుగువారు ఎప్పుడూ ఏదో గట్టిగా వాదులాడుకుంటూ వుండేవారు. (అద్దెకిచ్చిన మహాతల్లి—మహాగయ్యాళి) - మార్క్‌ని తన ఉద్యోగం యొక్క ప్రధానతని గురించి చెప్పాలని వుండేది - అయితే ఎవరికి కావాలి? ఎవరికి అర్థమై ఏడుస్తుంది కనుక? అక్కడికి లూయీ అనే స్నేహితుడికి తన ఉద్యోగం యొక్క గొప్పతనాన్ని గురించి వివరించబోయాడు.

"ఆ వీధి అంటావ్ - ఈ వీధి అంటావ్!.... ఎవరిక్కావాలి ఈ గోలంతా?" దీన్లో అంత ఉద్వేగ భరితమైంది ఏముంది?"

"ఆ! అదే, వస్తున్నా!.... నువ్విప్పుడు ఎక్కడ నివసిస్తున్నావ్"

"ఇదేం పిచ్చిప్రశ్న?.... ఏం గొప్పగా అడిగావ్ గురూ!.... ఏ చిన్నపిల్లాడిని అడిగినా చెపుతాడు. ఓవెన్ స్ట్రీట్ అయితే ఏంటట?"

"నీకు ఎలా తెలుసు?"

"ఎలా తెలుసూ???.... నేను ఇక్కడ వుంటున్నాను. నేను నా అద్దె చెల్లిస్తున్నాను, ఉత్తరాలు నా ఎడ్రస్‌కి వస్తున్నాయి. ఈ వీధి పేరు "ఓవెన్" అనడానికి ఇంతకన్నా ఏం కావాలి?"

"నో! నో! నో!" అడ్డంగా తలవూపేడు మార్క్.

"నువ్వు ఓవెన్ వీధిలో నివసిస్తున్నావు - అనడానికి మామునిసిపల్ రికార్డ్సులో నేను భద్రపరచిన ఫైళ్ళే కారణం. నా కార్డులో ఈ విషయాన్ని నేను భద్రపరచలేదనుకో - అసలు ఈ వీధి అక్కడ వున్నదన్న సంగతే ఎవ్వరూ గుర్తించరు - టాక్సుల వాళ్ళు టాక్సులు వసూలు చెయ్యరు — టాక్సు కట్టకపోతే అభివృద్ధి ఏమీ జరగదు- పోస్టల్ డిపార్ట్‌మెంట్ నీ ఉనికిని పట్టించుకోదు. అదే నాయనా ఆఫీసులో పని చేసేవారి ప్రముఖపాత్ర"

విలాసంగా నవ్వేడు మేక్.

లూయీ బుర్రకి ఏమీ ఎక్కినట్టులేదు - అయోమయంగా చూశాడు.

పైగా జోక్ ఒకటి వేశాడు "ఈ విషయాలు మన ఇంటి యజమానురాలితో చెప్పవోయ్ చూద్దాం" అన్నాడు.

మార్క్ చేసేది అనామకపు ఉద్యోగమే అయినా దానికి ఓ చరితార్థతని ఆపాదించుకుని తృప్తిగా పనిచేస్తున్నాడు. కాలం ముందుకు సాగుతూ మార్క్‌ని నలభై వసంతాల వాడిగా రూపాంతరం చెందించింది. అయితే ఈ ఉద్యోగం చేసే ఇరవై రెండు సంవత్సరాల్లోనూ అతనిది ఒకే ధ్యేయం — ఒకే మూసపోసిన వ్యావృత్తి - ఒకేరకపు సంతృప్తి -ఆశలూ లేవు - నిరాశలూలేవు. నిబ్బరంగా సాగిపోవడానికే అతడు అలవాటు పడిపోయాడు. ఈ సంఘటన జరిగి వుండకపోతే అతని జీవితం మరో పదిహేను సంవత్సరాలు ఈమూస కార్యక్రమంగానే సాగి.... చివరకు "అయ్యో! నేను రిటైరయిపోతోన్నానే - ఈ ఫైలింగ్ కార్యక్రమం ఏ అసమర్థుడి చేతిలోపడి ఈ నగరపు నైసర్గిక స్వరూపమే చిన్నాభిన్నమై పోతుందేమోనని అనుక్షణం భయపడిపోతూవుండే వాడు - ఎప్పటికప్పుడు

అతిజాగ్రత్తగా ఏ వీధి వెడల్పు చేశారో? దేనికి పేరు మారిందో - ఏ వీధిలో ఎన్ని అదనంగా భవంతులు లేచాయో జాగ్రత్తగా ఫైలింగ్ చేసు కుంటూ మూడు ఫైల్సూ — ఆరు రికార్డింగులుగా తన నిత్యకృత్యాన్ని గడి పేస్తున్నాడు.

అయితే ఆరోజు సరిగ్గా ఉదయం ప....ది....గం....ట ....ల .... ము....ఫై....ని....మి....షా....ల....కు.... ఏం జరిగిందనగా....??

ఆగస్టు నెలలో ఆ రోజు ఒక దుర్దినం, మార్క్ మహాశయుడు తన అల్మైరా తాళం తెరిచాడు -డ్రాయర్‌లో ఉన్న కొన్ని ఫైళ్ళను....దాని లోకి సర్దేప్రయత్నంలో వున్నాడు..... అప్పుడు బయట పడింది.... ఆ భయంకరమైన సత్యం. ఆ డ్రాయర్ ముందుకూ వెనక్కీ రాక మధ్యలో మొరాయించింది. ఎంత ప్రయత్నించినా లాభం లేకపోయింది. ఏమైనా ఇరుక్కుని బెట్టు చేస్తోందేమోనని చేయి లోపలికి పోనిచ్చి చూశాడు. క్రైవేట్ కరక్ట్ ఓ కార్డు నెరదలో ఇరుక్కుంది - కార్డుని ఊడబీకేడు - అది ఒక వీధిపేరును సూచించే ఇన్‌డెక్స్ కార్డు. తెగ మాసిపోయి వుంది. ఆ కార్డు వయస్సు పదహేను సంవత్సరాలు వుండవచ్చు. తెగమాసి వుంది. అయితే దానిమీద అక్షరాలు చదవ యోగ్యంగానే వున్నాయి - అంచులు చిరిగి వున్నాయి. దానిమీద ఇలా వ్రాయబడివుంది.

"రూ-డి—లా బౌటెల్లి వెరే లేక గ్రీన్ బోటిల్ స్ట్రీట్ - కెనడాలో ఫ్రెంచ్, ఇంగ్లీష్ రెండింటికీ అధికార భాషా హోదా వున్నది.

మార్క్ అవాక్కై విప్పారిన కళ్ళతో ఆ కార్డుకేసే చూడసాగాడు. ఇంత పాతబడిన వీధిపేరును అతను ఇదివరకు ఎప్పుడూ వినిలేదు. ఈ మధ్యలో ఈ వీధిపేరు రూపాంతరం చెంది వుండాలి. మొత్తం అన్ని వివ రాలూ వున్న మాస్టర్ ఫైల్‌ని క్షుణంగా పరిశీలించి చూశాడు. అసలు ఇలా పరిశీలించే అవసరమే లేదు. అతని "మనస్సే" ఓ పెద్ద కంప్యూటర్.

అయినా పొరపాటు జరగకుండా వుండడం కోసం - ఓసారి అన్నీ పరిశీల నగా చూశాడు — మళ్ళీ, మళ్ళీ— ఎన్నిసార్లు చూసినా అంతుబట్టని చిక్కు ముడిలా తయారయింది ఈ కార్డు. ఈ కార్డు సరిగ్గా పదిహేను సంవత్స రాల పద్నాలుగు రోజుల క్రితం దీన్లో ఇరుక్కునట్టు నిర్ధారణగా తెలిసి పోయింది. "కింక ర్తవ్యం??".... మతిపోయినంత పనయింది మార్క్ కి...

ఇది ఒక తప్పిపోయిన వీధి. లెక్కల కన్నుగప్పి.... రికార్డులబారి నుండి తప్పి జారిన వీధి. ఇది పదిహేను సంవత్సరాలక్రితం మాంట్రి యల్— మహానగరపు నడిబొడ్డులో —సిటీహాల్‌కి అరమైలులోపు దూర ములో వుండి వుండిన వీధి.... మరి ఈ వేళ....? ఆ వీధి ఏమైపోయిందో రికార్డుల్లో ఎక్కడా కనబడటంలేదు. అది తటాకంలో మునిగిన గులక రాయిలా ఎక్కడికి పోయిందో ఏమో!!....

మార్క్ కి ఇలాంటిదేదో జరిగినట్టు ఇదివరకే కొన్ని కలలు వస్తూ వుండేవి. పెద్ద పెద్ద భవంతులున్న — అవ్యక్తరూపంగా వున్న వీధులు గజిబిజిగా కళ్ళముందు కదలాడుతూ మాయమయి - కరిగిపోతున్నట్టు అప్పుడప్పుడు కలలు కనేవాడు - ఈ కలల అంతరార్థం —ఈ యదార్థంగా రూపొందుతుందని అతగాడు కలలో కూడా ఊహించలేదు.... ఇది ఇలా జరుగుతుందని ఊహించనే లేదు - ఒక వీధి వీధీ, ఏకంగా గ్రీన్ బోటిల్ స్ట్రీట్ అనే ముఖ్యమైన వీధే- డైనమైట్ పెట్టి పేల్చేసినట్టు నగరపు నడి బొడ్డులోంచి అదృశ్యమై పోయింది. రికార్డులోంచి తప్పుకుందంటే - మరి ....దాని అర్థం అదేకదా!! ఇలా ఎందుకు జరిగిందో కారణాన్ని అన్వే షించడమా.... ఈ జరిగిన దారుణాన్ని పరిహరించి ఆ వీధిని కనిపెట్టి జీవనస్రవంతిలో కలిపేలా చెయ్యడమా.... తాను కేవలం ఒక ఫైలింగ్ గుమాస్తా.... తానేం చేయగలడు?.... అన్న స్పృహ మొదటిసారిగా కలి గింది మార్క్ కి; "ఇంతవరకూ ఈ యావత్ నగరపు.... ఉనికీ తన చిటి కెన వ్రేలి గోటిమీదే ఆధారపడి పరిభ్రమిస్తోందని భ్రమించే వాడు కాస్తా తనను "ఆదుకునేవారు లేరా" అని మధనపడసాగేడు.

అసలిలా ఎందుకు జరిగిందో....అతనికి లీలగా స్ఫురించసాగింది. తాను ఉద్యోగంలో చేరిన కొత్తరోజుల్లో—ఆఫీసు భవనాన్ని....ఒక వీధి లోంచి మరో వీధిలోకి మార్చారు. ఆ సర్దుబాటులో పాతవాటిని కొత్త రికార్డుల్లోకి ఎక్కించి, పాతవాటిని కట్టలుకట్టి పడేశారు. ఆ హడావిడిలో ఈ కార్డు ఈ డ్రాయరు సందులో ఇరుక్కుని వుండవచ్చు, ఇక ఆ కార్డు ఆ డ్రాయరులో అలాగే ఇరుక్కుని వుండడం అనర్థదాయకం అని ఆ కార్డుని జేబులో వేసుకుని ఇంటికి వచ్చేశాడు. వచ్చేసాడన్న మాటేగాని మార్క్ మనస్సు మనసులోలేదు. అప్పటినుంచి మార్క్ ఇదివరకటి మార్క్‌లా లేడు. కళ్ళు మూసుకుంటే పీడకలలు—తెరిస్తే ఆలోచనలు. బుర్ర బద్దలై పోతోంది. బుర్రమీసాల రెడ్ ఛీఫ్ (ఆఫీసర్) తన డ్రాయర్నీ- తన ఫైల్సునీ, నిశితంగా పరీక్షిస్తోన్నట్టు తన నిర్లక్ష్యానికి భయంకరంగా అరుస్తూన్నట్టు, అనిపించి నిద్ర మధ్యలో "కెవ్వు"మని అరుస్తూ లేచి కూర్చున్నాడు....భార్యా పిల్లలకి ఇతని ధోరణి ఏమిటో అంతుబట్టక కంగారుపడిపోయేవారు.....ఇక ఓర్పు అతని తరంకాలేదు. అందుకే ఒక రోజున వంట్లో బాగోలేదని శలవు రాసిపడేసి (మార్క్ ఆఫీసుకి శలవు పెట్టాడంటే—పడమట సూర్యుడు ఉదయించినంత వింతేమరి-అయితే ఈ విషయాన్నికూడా వాళ్ళ ఆఫీసులో ఎవ్వరూ పట్టించుకోకపోవడం—తొమ్మిదో వింత)—అసలీవీధి ఎక్కడ వుందో ఆరాతీద్దామని బయలుదేరాడు. రికార్డుల్లో ఈ వీధులన్నీ కొట్టిన పిండే....భౌతికంగాకూడావాట్లని గుర్తించబడం బ్రహ్మవిద్య ఏమీకాదు-అయినా వెతుకుతూ, వెతుకుతూ, నాలుగయిదుసార్లు వెనక్కు-ముందుకు అతిశ్రద్ధగా పరీక్షిస్తూ తిరిగినా ఆ వీధి ఎక్కడ వుందో అతనికి అంతుపట్టిందికాదు. కళ్ళుమూసుకుని మరీ—తదేక ధ్యానంగా ఆ పరిసరాల్ని తన మనోఫలకంముందు చిత్రీకరించుకుని—వాస్తవ రూపానికీ తన మనోఫలకంమీదవున్న పటానికీ అనుసంధించి చూసుకున్నాడు. ఓ రెండు భవనాల మధ్య ఒకవీధి వుండి

వుండాలి. అయితే దాని స్థానంలో ఓ పెద్ద కర్రగేటూ దానికి వేసివున్న ఓ పెద్ద తాళంకప్పా తప్ప కనపట్టంలేదు. ఈ చిక్కుముడికీ ఈ తాళం కప్పకీ....చిక్కుముడి....చిక్కు విడిపోతోంది.

తాళం కప్పని ఓ లాగు లాగి చూసాడు....అది కప్పలాగే నోరు తెరుచుకుంది. ....మార్క్ సులభంగానే గేటు తెరుచుకుని లోపల ప్రవేశించగలిగాడు. అయితే గేటుని మాత్రం జాగ్రత్తగా మళ్ళీ దగ్గరకువేసి లోపలికి అడుగులు వేయసాగాడు....ఆశ్చర్యం....? లోపల ఓ వీధి.... భవనాలు....జనసంచారం....ఓ గోడమీద గ్రీన్‌బోటిల్ స్ట్రీట్ అనిమట్టి కొట్టుకుపోయిన అక్షరాలు....ముచ్చెమటలూ పట్టేశాయి మార్క్ మహాశయుడికి. ఆ వీధిని చాలా పరీక్షగా చూశాడు మార్క్.

రాతితో కట్టిన పూర్వకాలపు తరహా రోడ్డు—అటూ ఇటూ వున్న విశాల భవంతులు-ఎన్ని వున్నాయని కుతూహలంతో లెక్కపెట్టాడు.... సరిగ్గా ఎనిమిది భవనాలున్నాయి. ప్రతి భవనానికీ ముందు ఓ చిన్నతోట. పాతకాలపు ఇనుపముళ్ళ తీగల ప్రహారీ గోడలు—ఇళ్ళన్నీ ఎంతో పరిశుభ్రంగా, ఆరోగ్యంగా వున్నాయి. వీధులన్నీ పరిశుభ్రంగా నీళ్ళతోతడిపి శుభ్రంచేసినట్టు వున్నాయి. పూర్వపు భవంతులకు వున్నట్టు తలుపులేని కిటికీలు, నిశ్శబ్దంగా హడావిడి లేకుండా వున్న ప్రశాంతత. ఇవి చూసి మార్క్ ముగ్ధుడైపోయాడు.

తన చిన్నతనంలో....ఈ నగరం ఎలా వుండేదో వాళ్ళ నాన్నగారు వర్ణించి చెపుతూవుండేవారు....సరిగా ఆ వాతావరణమే మార్క్‌కి ఈ వీధిలో కనిపిస్తోంది.

మొట్టమొదటి ఇంటి ఆవరణంలో ప్రవేశించాడు మార్క్. ఓ వృద్ధ మాత తన తోటలోని పూలమొక్కలకి నీళ్ళు పోస్తూవుంది. "పూల బాలలు

తల్లి ఒడిలో హాయిగా ఆడుకుంటున్నాయి'' అన్న కవివాక్యం గుర్తుకి వచ్చింది మార్కుకి.

కర్తవ్యపాలన ముఖ్యం....ద వుడ్స్ ఆర్ లౌలీ, డార్క్ అండ్ డీప్....బట్ ఐ హ్యావ్ ప్రోమిసెస్ టు కీప్ (ఈ అడవి అందంగా-ఆకర్షణీయంగా వుంది. అయినా నేను నిలబెట్టుకోవలసిన వాగ్దానాలు వున్నాయి)—అన్న రాబర్ట్ ఫ్రాస్ట్ మహాశయుని ఉద్బోధ మాటేమిటి ? అని అనిపించింది మార్కుకి,

విధి నిర్వహణకీ-ఆనందాస్వాదనకీ ఈ సంఘర్షణ ఎప్పుడు ఉండనే వుంది. కర్తవ్యపాలనే ముఖ్యం.

"గుడ్‌మార్నింగ్ మేడమ్—'' అన్నాడు వినమ్రంగా.

చూస్తూనే ఆమె ఇతన్ని చూస్తూనే ఉక్కిరిబిక్కిరి అయిపోయింది.

"నేను సిటీ ఇంజనీరింగ్ డిపార్టుమెంట్—మనిషిని మేడమ్'' అని తనను తాను పరిచయం చేసుకున్నాడు.

"ఓ! మొత్తానికి మేమనే వాళ్ళం వున్నామని - మీ పాలకసంఘం వారికి స్పృహ కలిగిందన్నమాట !''

ఈ మాటలు విన్నతర్వాత - తను చేసిన పొరపాటు ఫలితంగా ఆకాశం విరిగి భూమిమీద పడలేదని, అయితే ఫైలింగ్ చేయడం మర్చిపోయినట్టు రూఢి అయింది.

అయితే ఆ పొరపాటు చాలా తీవ్రమైన పరిణామాలకి దారి తీయలేదని, ప్రజలు ఇబ్బంది పాలు కాలేదని-అనిపించి తృప్తిగా గాలి పీల్చుకున్నాడు-

"ఏమిటో చెప్పండి—మేడం ?'' అన్నాడు మాట్లాడే ఛాన్స్ ఆమెకే ఇస్తూ....

ఇది చాలా తమాషా కథ. ఈ గ్రీన్ బోటిల్ స్ట్రీట్‌లో ఒక ధని కునికి చెందిన భవనాలు వున్నాయి. వాటి మీద వచ్చే అద్దె ఆధారంతోనే అతడు హాయిగా బ్రతికేవాడు—చాలా సంవత్సరాలు గడిచాయి. అతనిది మంచి మనస్సు.

తన ఇళ్ళల్లో కాపురాలు చేసే వాళ్ళని ఎంతగా ప్రేమించేవాడంటే తన మరణ వాఙ్మూలంలో ఎవరు కాపురం చేస్తోన్న ఇంటిని వాళ్ళకే వ్రాసేసి—తన డబ్బుని కూడా అందరికీ తలోకాస్త ఇచ్చేసి కన్ను మూశాడట.

మా ఆస్తిపాస్తుల్ని గురించిన దరఖాస్తులు—పూర్తిచేసి మునిసిపల్ రికార్డుల కోసం అర్జీలు పంపుతున్నాం. పన్నులు కూడా రెగ్యులర్‌గా కడు తూనే వుండేవాళ్ళం. మాకు పన్ను నోటీసులు కూడా సక్రమంగా వస్తూనే వుండేవి. అయితే కొంతకాలం క్రిందట హఠాత్తుగా నోటీసులురావడం ఆగి పోయింది. మమ్మల్ని గురించి పట్టించుకున్న నాధుడేలేడు - మొత్తానికి మమ్మల్ని నగరపాలక సంస్థ మరిచిపోయి ఉంటుందన్న నిర్ణయానికి వచ్చేశాము.

ఇన్‌స్పెక్షన్లులేవు—జనాభా లెక్కలవాళ్ళు రావడం మానేశారు. ఎల క్షన్ గోలలు లేవు — రేషన్‌కార్డుల హడావిడిలేదు. కొంత "వాడ"వారంతా ఆందోళన చెందకపోలేదు. మైకేల్ ఫ్లానగాన్ నాలుగో నెంబరు ఇంట్లో వుంటాడు ఆయన చాలా తెలివైనవాడు. ఓ రోజున మా అందరికీ ఒక మీటింగ్ ఏర్పాటు చేశాడు—అతనే మాట్లాడేడు.

"విపరీతాలు జరిగినప్పుడు వాటిని మనమే మనకు అనుకూలంగా మలుచుకోవాలి" అంటూ తన పథకాన్ని వివరించాడు. ఆయన సలహాని అనుసరించే మా వీధి ముందు ఓ కర్రగేటు కట్టేసి తాళం పెట్టేశాము.

ఈ విధంగా ఈ ఆఫీసర్ మిడతల దండు బారి నుంచి మమ్మల్ని మేము రక్షించుకున్నాము. కొంతకాలంపాటు దిట్టమైన తాళం కప్పనే వేశేశాము.

అయితే కొంతకాలం తర్వాత కప్ప ఊడిపోయేలా వేసినా ఒక్కొక్కప్పుడు పొరపాటున వెయ్యడం మరచిపోయినా....మావైపు ఎవరూ వచ్చేవారు కాదు. అయితే ముఖ్య జనస్రవంతితో మాకూ కొన్ని అవసరాలులేకపోలేదు. అపరాలు, కూరలు కొనుక్కోవడం - ఉత్తరాలు మొదలైన అవసరాలువున్నాయి.... మొత్తానికి జనస్రవంతిలో కలవకున్నా మా జీవితాలు హాయిగానే గడుస్తున్నాయి.

"అయితే అప్పటి నుంచి ఇప్పటిదాకా మీ జీవన సరళిలో ఏమీ మార్పులే జరగలేదా?" అడిగాడు మార్క్.

"ఇద్దరు ముఖ్య స్నేహితులు చనిపోయారు-వాళ్ళ ఇళ్ళు కాళీ అయ్యాయి. అయితే ఆరోనంబర్ ఇంటిలోవున్న జీన్‌డెస్పెలిన్-నగరం లోకి వెళ్ళి తిరిగి వస్తూ వస్తూ ఒక కాందిశీకుణ్ణి వెంట బెట్టుకు వచ్చాడు. ఆ కాందిశీకుడి పేరు ప్లోస్కీ. ప్లోస్కీ చాలా కలుపుగోలు మనిషి. జీవితంలో ఎన్నో ఢక్కాముక్కీలు తిని జీవితంతో విసిగివేసారి ఉన్నాడేమో ఈ నూతనమైన వాతావరణం అతనికి హాయిగా ఉందన్నాడు. అతనికి మూడో నెంబరు ఇంట్లోవున్న మిస్ హంటర్‌తో స్నేహం కలిసింది. వారికి ఏదో దూరపు బంధుత్వం కూడా వున్నట్టు వుంది. వాళ్ళిద్దరికీ పరిస్థితులు బాగా అర్థమయినట్టు కూడా అనిపించింది.

"అది సరే మేడం....మీ గురించి?"

"నా పేరు సారాట్రాస్టేల్—నేను గత రెండు దశాబ్దాలుగా ఇక్కడే వుంటున్నాను. భగవంతుడు మేలు చేస్తే ఇక్కడే తుది శ్వాస వదుల్తాను."

ఆవిడ నవ్వుతూ మాట్లాడుతోంది. బహుశః అతని జేబులో వాళ్ళ జీవితాలని సర్వనాశనం చేసే గ్రెనేడ్ (అదే కార్డు) ఉన్నదని తెలియని అమాయకత్వం ఆమెది. జేబులో చేతులు పెట్టుకుని కార్డుని ఉండగా చుట్టడం ప్రారంభించాడు అసహనంగా. ఆమె ధోరణి అంతులేకుండా సాగిపోతోంది.

"ప్లోస్స్కికి, మిస్ హంటర్‌కీ-దోస్తీ బాగానే కుదిరింది. ఇద్దరూ ఒకే పడవలో ప్రయాణం చేసి వచ్చిన ప్రయాణీకులేమో ఎంతో సన్నిహితంగా మాట్లాడుకుంటూ తిరిగేవారు. హంటర్ పియానో చక్కగా వాయిస్తుంది. కచ్చేరీలు కూడా చేస్తుంది. హజార్డు, డెస్పెలిన్‌లు తీరిక సమయాల్లో చదరంగం ఆడుకుంటూ కాలం గడుపుతారు.

మార్క్‌తో బ్రెస్‌డేల్ చాలాసేపు తోటలోని చీడీల మీద కూర్చుని అరమరికలు లేకుండా మాట్లాడేస్తోంది.

"నిన్ను చూస్తే మా మేనల్లుడు జ్ఞాపకం వస్తున్నాడోయ్-చాలా అందమైన కుర్రాడు-ఆ అబ్బాయి పోయినప్పుడు నా గుండె బ్రద్దలైంది. అనుకోలేదు స్మి-ఇన్‌ఫ్లుయంజా వచ్చిపోయాడు" కళ్ళమ్మట నీళ్ళు పెట్టుకుంది బ్రెస్‌డేల్.

"మా కుటుంబంలో నేనే ఆఖరిదాన్ని నా తర్వాత...." ఇంకా ఏవేవో మాట్లాడేస్తోంది.... బ్రెస్‌డేల్. తన జీవిత కాలంలో తనతో హృదయం విప్పి ఇంత సూటిగా మాట్లాడిన వాళ్ళెవరూ కనబడలేదు .... జేబులోంచి కార్డుని మెల్లిగా పైకి తీశాడు....

"ఈ కార్డుని నా డ్రాయర్‌లో నిన్నే దొరికింది....ఇది నాకు తప్ప మరెవరికీ తెలియదు. ఇది కనుక బయట పెట్టేనంటే - న్యూస్

పేపర్లు దీనిని అల్లరి చేస్తాయి. మీ జీవితాలే అస్తవ్యస్తం అయి పోతాయి."

"ఇలా మాట్లాడుతున్నా అతని మనస్సులో- తన ఇంటి యజమాను రాలు, వీధిలో జరిగే గగ్గోలు, కొట్లాటలు-ప్రశాంతతలేని ఆ జన స్రవంతి మధ్య జీవితం - పన్ను వసూలుదార్లూ, జనాభా లెక్కలు, పోలీసుల గోల ఇవన్నీ గుర్తుకి వచ్చాయి.

"నేనూ—మంచి గృహస్థుణ్నే" అన్నాడు.

"అయితే ఇంకేం. మా యింట్లో మొదటి అంతస్తులో వుండొచ్చు. మా ఇల్లు విశాలంగానే వుంటుంది. నీకు చాలా బాగుంటుంది - నాకూ ముందూ వెనకా ఎవ్వరూ లేరు. ఏమంటావ్?" అంది ఆప్యాయంగా.

మార్క్ గిరోన్‌డిన్ ఒక దృఢ నిశ్చయానికి వచ్చాడు. పరమ యోగిలా కార్డుని ముక్కలు ముక్కలుచేసి వాటిని నీళ్ళ డబ్బాలోపడేశాడు.

"అమ్మయ్య ఇంక గ్రీన్‌బోటిల్ వీధి."

ఈ ప్రపంచపు రుగ్మతలకి అతీతంగా ఇక ముందులాగా హాయిగా స్వేచ్ఛగా బ్రతికేస్తుంది అని తృప్తిగా ఊపిరి తీసుకున్నాడు.

—:o:—

# ౨౨. ప్రాణం ఖరీదా ?

## కోడిపెట్ట ఖరీదా ?

— మేరీ లేవిన్ (ఐర్లండ్)

ఇదొక విధవరాలి ఏకైక పుత్రుని కథ. అన్ని కథలకీ ఒకే ముగింపు వుంటే, ఈ కథకి రెండు ముగింపులు.

దేవుడు రాసిన కథల ముగింపులు మార్చడానికి మనకి అవకాశం లేదు కాని - మనిషి రాసే కథల ముగింపులు మనిషి చేతిలోనే వుంటాయి కదా ! ఇదీ సంగతి....చూద్దాం ఈ కథ :—

ఆమె భర్తృవిహీన. వూరూ పేరూ లేని ఆ కుగ్రామంలో ఒక కొండ మొదట ఆమె నివాసం. ఆమెకు ఒక్కడే కొడుకు. అయితే ఆమెకు జీవిత సర్వస్వం ఆ కొడుకే. ఆమె జీవితానికి అర్థం, తాత్పర్యం సర్వం ఆ కొడుకే. కొడుకు్కోసమే జీవిస్తోంది. అతనికోసమే తాను కొవ్వొత్తిలా కరిగిపోతుంది.

తన కొడుకుని దగ్గరలోవున్న పట్టణంలో ఒక మంచి స్కూలులో చదివించడానికి ప్రతి రోజూ కనీసం ఒక వంద త్యాగాలనైనా చేస్తోంటుంది. ఆ పట్టణం కొండ అవతల నాలుగు మైళ్ళదూరంలో వుంది. ఆ స్కూలును నిర్వహిస్తోన్న టీచర్ చాలా సమర్థుడు.

ఆ స్కూలులో చదువుకున్న వారంతా జీవితంలో ఎంతో పైకి వచ్చారు. ఈ గ్రామంలోవున్న స్కూల్‌లో చేర్పిస్తే సరిపోదా అంటారు ఆమె బీదరికాన్ని ఎరిగినవారు. స్వంతంగా చదువుకుని టీచరైన ఈ పల్లెటూరి టీచరమ్మ చెప్పే చదువంటే ఈ విధవరాలికి ఎంత మాత్రం గౌరవం లేదు. పైగా ఎప్పుడూ ఈసురో దేవుడా—ఎందుకొచ్చిన బ్రతుకురా అన్నట్టు వుంటుంది ఆమెను చూస్తే. అందుకే ఆ గ్రామంలో చదువుమ

కాదని పట్టణానికి పంపించింది ఖర్చయితే అవుతుంది. కానీ-కొంచెం కష్ట పడుతుంది. మరేం ఫర్వాలేదు.

సంవత్సరాలు గడుస్తున్నాయి. ఇప్పుడు ఈ గ్రామంలో అందరూ, ఆమె కొడుకు "పేకీవి" సాగనంపేటప్పుడూ స్వాగతం పలికేటప్పుడూ ఆమె కొడుకోసం ఎంత ఆత్రుతగా ఎదురు చూస్తోంటుందో చెప్పగలరు. ఆ కళ్ళలో కనబడే ఆమె ఆతృత అంత స్ఫుటంగా కనపడుతుంది. అయితే ప్రేమ హృదయంలో ఉప్పొంగేదే అయినా-మాటలు మాత్రం మహా కటువుగా వుండేవి.

"ఒరేయ్ అబ్బాయ్....బుద్ధిగా మంచి మార్కులు తెచ్చుకున్నావా సరేసరి-లేకపోతే చదువు మాన్పించేసి నిన్ను ఏ ఫ్యాక్టరీలోనో కార్మికుడుగా చేర్పించేస్తాను తెలుసా!" అని బెదిరిస్తూండేది.

ఈ పెడసరపు మాటలు-పై పైవేననీ, ఆమె అంతర్యం నవనీత సదృశం అని పేకీ ఎరగకపోడు. అయినా బుద్ధిమంతుడు బూరి ముక్కలా "సరేనమ్మా" అంటూండేవాడు.

పేకీకోసమే ఆమె మైళ్ళకొద్దీ దూరం ఆవుని తోలుకుని మేపేది. ఆ పని తన పొలంలో పెరిగే గడ్డినే మేపి చేయవచ్చు. కాని దూరంగా రోడ్డుమీద మేపితే తన పొలంలోని గడ్డి ఆదా అయి కొంత సొమ్మును వెన కేసుకోవచ్చని అది పేకీ చదువుకి పనికొస్తుందని ఆవిడగారి ఉద్దేశం.

అతనికోసమే ఆవిడగారు కేటేజీలు అమ్ముతూ వీధివీధికీ తిరిగేది. అతనికోసమే పుట్టుగొడుగుల్ని సేకరించి—తిండికోసం తనడబ్బు ఖర్చు పెట్టనక్కర్లేకుండా—తిని....ఆదాచేసిన డబ్బుని దాచుకునేది. అతని కోసమే వళ్ళువంచి కష్టించి, అడ్డమయిన పనులూ చేస్తూండేది.

ఎంతో కష్టించి తనకున్న బీడుభూముల్లో పెరిగిన ఎండుగడ్డిని సైతం అమ్మకుని డబ్బు చేసుకునేది. కోడిగ్రుడ్లు అమ్మేది. ఇవన్నీ "పేకీ" చదువుకీ, పుస్తకాలకీ, దుస్తులకీ ఖర్చుచేస్తూండేది.

పేకీకి ఇప్పుడు పధ్నాలుగుసంవత్సరాల వయస్సు. ఆ స్కూలులో వున్న అత్యున్నత తరగతిలోకి వచ్చేశాడు. ఈ పరీక్షలో బాగామార్కులు తెచ్చుకుంటే కాలేజీ చదువుకి ఉపకారవేతనాన్ని (స్కాలరుషిప్‌ని)సాధి స్తాడు. "పేకీ" ప్రతిభమీద అతని ఉపాధ్యాయుడికి బలమైన విశ్వాసం వుంది.

మనకైతే స్కాలర్‌షిప్ ఒక ప్రాక్టికల్ జోక్‌లాగ హత్తుకు కూర్చుంది కాని, పాపం అమాయకులయిన ఇతర దేశాలవాళ్ళు ఇంకా స్కాలరుషిప్‌ని ప్రతిభకి ప్రతీకగానే గుర్తిస్తున్నారు)పేకీ ఇప్పుడుపొడుగ్గా కూడా అయ్యాడు. అతని శారీరక లక్షణాలలోకూడా యవ్వన ప్రాదుర్భా వం తొంగిచూస్తోంది....అతని తల్లి మాట పెడసరితనంవల్ల అతని వ్యక్తి త్వం—సక్రమ మార్గంలోనే వికసించసాగింది.

"పైకి కఠినమనిపించినా—లోన వెన్న కనిపించడంచేత "కొడుకు తల్లితిట్టే తిట్లని-తీవ్రంగా తీసుకునేవాడుకాదు—అతని ప్రవర్తన ఎప్పు డయితే బాగుందో గ్రామస్థులుకూడా అతని డబ్బుండి చదువుకునే మోతు బర్ల కొడుకులతో సమానుడిగా గుర్తించి గౌరవిస్తూండేవారు. వారిలాగే పేకీకూడా నీలిరంగు దుస్తులూ టైకట్టుకుని తిరుగుతోంటే ఆ భర్తృ విహీన హృదయం ఆనందతాండవమే చేసేది. అయినా తన మనోభావాల్ని అతడు పసికట్టి—తనని లోకువకట్టి గారాబంతో చెడిపోతాడోనని-పైకి మాత్రం నోటి వదరుతనంతో వాణ్ణి చూడు—వీణ్ణి చూడు—నీలాగే జులా యిగా తిరుగుతున్నారా? మార్కులు తక్కువ వస్తే చూడు—వెంటనే పేడ పిసికి పిడకలువేసే పనిలో పెట్టేస్తాను హాట్....హూట్ అంటూం దేది ....

అది జూన్ నెల....బరువుగావున్న గాలికెరటాలు పచ్చగడ్డిమీంచి పిచ్చిగాలేచి బరువయిన మేఘమాలికల సందెల్లో గిలగిలలాడుతున్నాయి-ఊపిరి సలపక తల్లి పేకీకోసం గేటుదగ్గర నిలబడి ఎదురుచూస్తోంది.

కొన్ని రోజులనించి వానలు పడక నేల ఎండిపోయివుంది. పౌల్ట్రీ లోని కోడిపుంజులూ, పెట్టలూ, పిల్లలూ—వేడిగాడ్పుకి తట్టుకోలేక పౌల్ట్రీ బయటకువచ్చి అసహనంగా ఇటూ అటూ తిరుగుతున్నాయి.

దారినపోయె దానయ్య ఒకతడు-ఈ నిలబడ్డ తల్లిని చూశాడు.

"పేకీ కోసమా—నిరీక్షణ ?" అన్నాడు తలమీద పెట్టుకున్న టోపీని తీసి కారుతోన్న చెమటని రుమాలుతో అద్దుకుంటూ.

"ఓహో....మీ అబ్బాయి ఆ డొక్కు సైకిల్‌మీదే వస్తాడనుకుంటాను. అయినా కాని అమ్మాయీ ఇలాటి వేసవికాలంలో—ఈ ఎండలో రావడం చాలా శ్రమతోకూడిన పని సుమా! నామటుకు నాకు నీ వరస నచ్చలేదు. క్షేమంగా ఏ బస్సుమీదో రమ్మనకపోయావా ??"

"పేకీ సంగతి నువ్వెరగవ్! ఈ నాలుగుమైళ్ళ దూరాన్ని గంటలో నాలుగయిదుసార్లు వెళ్ళిరాగలడు తెలుసా?" అంది ఏకంగ మూడులైన్ల వాక్యాల్ని గుక్కతిప్పకుండా చదివేసినంతటి విజయగర్వంతో.

నిముషాలు....యుగాలుగా గడుస్తున్నాయి, ఆ తల్లి విప్పారిన కళ్ళతో ఎదురుచూస్తోంది. ఎండవేడి అంతకంతకు ముదురుతోంది.

"వర్షంకంటే....ఎండే నయమేనేమో!" అంది చివరకు.

"ఎండకూడా....ప్రమాదకారే....కాని ఇలాంటి రోజుల్లో వడదెబ్బ కూడా తగలొచ్చు" అని తలెత్తి పైకిచూసి "ఎందుకో ఈవేళ సూరయ్యగారు భగభగలాడిపోతున్నారు" పచ్చటి చెట్లు—రాళ్ళదిబ్బల్లా అయిపోతాయి నాల్రోజులు ఇలా ఎండకాస్తే" అన్నాడు.

ఆమెగారికి ఈ మాటలేవీ చెవికెక్కటంలేదు....కొడుకు రాక కోసం ఆమెకళ్ళు సుదూరంలోకి చూస్తూనే వున్నాయి....

"ఎండ ఎలా వుంటేనేం—సైకిల్‌మీద కొండదిగే సమయంలో ప్రాణం లేచివచ్చేలా హాయిగా చల్లగాలి వేస్తుంది" అంది పరధ్యానంగా అతగాడు కొండకేసి చూస్తూ.

"అవునవును – ఇలాటి విప్పులు చెరిగే మధ్యాహ్నం సైకిల్ మీద పైనించి క్రిందకి వస్తూంటే ప్రాణం లేచి వచ్చేంత చల్లగా గాలివేస్తుంది నీ బుగ్గల మీంచి గాలి సిల్కుతెరలా వీస్తుంది, అదే శీతాకాలం అనుకో బుగ్గల్ని చీరేసే రెండు చురకత్తుల్లా తగుల్తుంది గాలి" అంటూ ప్రక్కన వున్న ఓ గడ్డిపరకని తెంపి కొరుకుతూ అన్నాడు.

ఈ కొండ ఐర్లండ్‌లోవున్న అతి ఎత్తైయిన కొండల్లో ఒకటి మమా! ఇలాటి దాన్ని కొండ అనాలిగాని.... అడ్డమైన వాటినీ కొండ లంటే - కొండలకే పరువు తక్కువ.... నన్నడిగితే ఈ కొండని సర్వే మ్యాప్‌లో ప్రముఖంగా వుండే కొండగా గుర్తించాలి "అప్పుడు అది పుస్తకాలలోకి ఎక్కుస్తారమకుంటానే?.... అప్పుడైతే పేకీ కళ్ళుమూసు కుని ఈ కొండ వివరాలన్నీ చెప్పేయగలుగుతాడు" పుస్తకంలో వున్న మ్యాప్‌లో వున్నా అవన్నీ మన పేకీకి కరతలామలకం అయిపోతాయి." అన్నాడు సంభాషణని కొనసాగిస్తూ.

"అడుగో పేకీ వస్తోన్నట్టున్నాడు ...." అంటూ గేటు బార్లాతీసి రోడ్డుమీదకి పరిగెత్తి - ఒకవారగా నిలబడింది- ఆ తల్లి. కొండమీదనుంచి సైకిల్ స్పోక్స్ తళతళ కనిపిస్తోంది. — సైకిల్ మరింత దగ్గర దగ్గరికి, వచ్చేసరికి సైకిల్ నల్ల కోడెమాదలా మెరుస్తూ కనపడింది. పేకీ బ్రౌన్ రంగు జుత్తు ఎర్రటి ముఖంమీద అందంగా, రివ్వుమని ఎగురుతోంది. అతని చేతులు సైకిల్ హ్యాండిల్ బార్‌ని బలంగా అదిమి పట్టుకుని

వున్నాయ్. కొండ అతగాడన్నట్టు చాలా ఎత్తయినదే. సైకిల్ స్పీడులో అసలు కదులుతొన్నట్టే కనిపించటం లేదు. మనం రైల్లో ప్రయాణం చేసేటప్పుడు - ప్రక్కనున్న పొలాలూ, టెలిఫోన్ స్థంభాలూ చకచకా వెనక్కి వెళ్ళిపోయినట్టు కనిపిస్తాయ్.... అలా వెనక్కి జరుగుతున్నట్టు అనిపిస్తోందన్నమాట ("పేకీ"కి)

వస్తోన్న సైకిల్‌ని చూసి కోళ్ళు, కోడిపిల్లలూ "క్లక్ క్లక్" అంటూ చెల్లాచెదరుగా పరిగెడుతున్నాయి, ప్రాణరక్షణ కోసం అన్నట్టు. పేకీ దూరం నించే వాళ్ళమ్మకి సంతోషంగా చెయ్యి ఊపుతున్నాడు. దగ్గరగా మరింత దగ్గరగా వచ్చేస్తోంది సైకిల్.

"షూ....షూ...." అంటూ సైకిల్‌కి అడ్డం పడుతోన్న కోళ్ళను తోలుతున్నాడు. కోళ్ళు మోరలు ముందుకు చాపుకుని అయోమయంగా పరిగెడుతున్నాయి.

"షూ....షూ" అంది పేకీ తల్లి- తన పరికిణీ అంచుల్ని పైకి ఎత్తి ఊపుతూ కోళ్ళని అటూ ఇటూ తరుముతూ....

ఈ హడావిడిలో ఆవిడగారి పరికిణీ నీడలో రక్షణ పొందుదామని ఆశించిన ఒక ముసలి కోడిపెట్ట ఈ యీ ఊపుకి కంగారుపడి పోయింది. పరికిణీ కిందనుంచి ఒక్కసారిగా పైకెగిరి రోడ్డు మధ్యగా పడింది.- తన పిల్లలన్నింటినీ అయోమయంగా చూసుకుంది- పిల్లలు అపాయంలో ఉన్నారని భయంకరంగా అరచి దుమ్ము రేగే రోడ్డుమీద ఇటూ అటూ ఎగరడం మొదలెట్టింది.

పేకీ సడన్‌గా బ్రేకులు వేశాడు. ఆ వెధవరాలు కెవ్వుమని అరచింది. కొన్ని కోడి ఈకలు గాలిలోకి ఎగరడం కనబడింది..... రోడ్డు

రక్తసిక్తం అయింది. సైకిల్ అటూ ఇటూ ఊగిసలాడి ఒకవైపుకి పడి పోయింది. పేకీ హాండిల్‌బార్ వైపుకు తూలిపడ్డాడు. ఇది చాలా చిన్న ప్రమాదమే అయి వుండాలి. ఎటొచ్చీ ఆ ముసలమ్మ - ఆవిడ గారితో మాట్లాడుతోన్న ముసలాయనా కంగారుగా కేకలు వేశారే తప్ప - పెద్ద ప్రమాదమేమీ ముంచుకు వచ్చే అవకాశం లేదు. చుట్టుప్రక్కల సహాయ పడమని అడగడానికి మనుషులూ లేరు. అయితే పేకీ చాపచుట్టలా పడి వున్నాడు..... నోట మాటరావడం లేదు.... ముఖం మీదనుంచి రక్తం కారుతోంది- అతగాడిని చేతుల మీదగా కాటేజీలోకి సాయం పట్టాల్సి వచ్చింది.

అయితే వాళ్ళందరికీ తెలియని నిజం ఒకటి .... అతగాడిని కాటేజీలోకి చేర్చేలోగానే ప్రా....ణం....వ....ది....లే....శాడు. తల్లిమాత్రం విభ్రాంతిలో వున్నాడు.... నా తండ్రి" అని అంది....

"అవును.... అవును....అంతే....అంతే" అని వంత కలిపేడు ఆ ముసలాయన.

"డాక్టర్‌కి కబురంపుదాం.... డాక్టర్ ఓ ఇంజెక్షన్ చేసి ఓ బ్యాండేజీ వేస్తే సరిపోతుంది" అని గొణుక్కుంటుంది ఆ వెర్రి తల్లి. ఈ అలజడికి చుట్టుప్రక్కల వారంతా ప్రవాహంలా రావడం -జరిగింది వాళ్ళకి అర్థమైపోవడం జరిగాయి.

"నీ కొడుకు- నీకికలేడు" అని ఆమెకు అర్థమయేలా చెప్పడానికి వాళ్ళకు తాతలు దిగి వచ్చారు. గుండెలు బ్రద్దలయేలా ఏడవడం ఇప్పుడు ఆమెవంతయింది. ఆ ఉద్రేకంలో ఆ పౌల్ట్రీలో వుండే అన్ని కోళ్ళనీ మెడలు మలిమి చంపేస్తానంటూ కోపంగా బయల్దేరింది.

"దొంగ ముండల్లారా మిమ్మల్నందర్నీ ఒకేసారి చంపిపారేస్తాను. నాకొడుకే నాకు లేకపోయాక ఈ కోళ్ళకుంపటి నాగుండెల మీద ఎందుకు? ....ఇన్ని కోళ్ళు కలిసి నాకు నా కొడుకు రక్తం ఒక్క బొట్టయినా తిరిగి తేగలవా? అయ్యో దేవుడోయ్ - నన్నింతన్యాయం చేస్తావా? ఆరుషిల్లింగుల ఖరీదైన చెయ్యని ఈ ముసలికోడి కోసం - నా కొడుకు అన్యాయంగా ప్రాణాలు పోగొట్టుకున్నాడే....నేనేమి చేతునోయ్ భగవంతుడా!" అంటూ గుండెలు బ్రద్దలయేలా ఏడుస్తోంది.

"ముసలికోడి ముండ .... అదీ దాని పిల్లలూ ఏ గోదాట్లో పడితే నీకేమిట్రా తండ్రీ....దాని ఖరీదు ఆరుషిల్లింగులుండదు....మరి నీ జీవితం? మొత్తం ఐర్లండుని అమ్మేస్తే సరితూగుతుందిరా చిట్టితండ్రీ? మరి ఈ బోడి ముండ కోసం నీ జీవితాన్నే బలిపెట్టేవా? నీ త్యాగం నాకు సంతోషం కలిగిస్తుందనుకున్నావా తండ్రీ!" అని ఆ తల్లి అలిసిపోయేలా ఏడుస్తోంటే.... ఏం చెయ్యగలరు ఎవ్వరేనా .... సాధ్యమైనంత వరకూ "ఊరుకో.... ఊరుకో.... పోయిన వాళ్ళు తిరిగి వస్తారా?" అని ఓదార్చే ప్రయత్నం చేస్తున్నారు.

ఇంత విలువైన జీవితాన్ని.... ఒక్క కోడిప్రాణం కోసం....ఖర్చు చేసేయడం ఏమేనా న్యాయంగా వుందా?" అని అందర్నీ బేలగా అడుగుతోంది.

"అవును ఏమీ న్యాయంగా లేదు" అని ఓదార్చడం తప్ప ఎవ్వరేం చెయ్యగలరు?........

అయితే.... నిజంగా పేకీయే....తన ప్రాణాన్ని కాపాడుకోడం కోసం.... ముసలికోడి ప్రాణాన్ని తీసేశాడనుకోండి.... అప్పుడు ఆ గయ్యాళి తల్లి.... కొడుకుని ఏ విధంగా సన్మానించి వుండేదో....వాళ్ళలో

వాళ్ళకి తెలుసు.... ఆమె తత్వాన్ని వాళ్ళు కాచి వడబోసిన వాళ్ళేకదా! ప్రతి ఒక్కళ్ళకీ తెలుసు - ఖరీదైన ఈ కోడిని పొట్టన పెట్టుకున్నందుకు "పేకీకి" బ్రతికి వున్నన్నాళ్ళూ నవశ్రాద్ధాలూ పెట్టేదని - అయితే ఈ "తిట్టాలజీని" ఎవరికి తోచిన విధంగా వారు ఊహించుకున్నారు గాని మొత్తం మీద - తాత్పర్యం ఒకటే — ఇది రచయితగా — (ఒకవేళ పేకీ తన ప్రాణాన్ని కాపాడుకోడానికి - కోడి ప్రాణం పణం పుట్టివుంటే ఏమి జరిగి వుండేదని) ఊహించి చిత్రించడానికి ప్రయత్నిస్తాను. దేవుడు రాసిన కథల ముగింపు మన చేతులో వుండదు కాని మనం రాసుకున్న కథల విధాతలం మనమేకదా! - కథ కొంతవరకూ పాతకథకి కార్బన్ కాపీయే.

ప్రారంభంలో రెండు కథలూ ఒకటే.... అయినా చూద్దాం ఈ కొత్త కథ ఎలా సాగుతుందో....

రోడ్డుప్రక్క చెలకలో ఆవుమేస్తోంది. ఆ రోడ్డు దగ్గరనున్న పట్టణం దాకా విస్తరించుకుని వుంది. ఆ పొలం నిండుగా నిలువెత్తు పచ్చగడ్డి పిచ్చిగా నవ్వుతూ పలకరిస్తుంది. పొలం మధ్య కాబేజీలు విరబూసి వున్నాయి. అక్కడ వుంది అతనితల్లి — కొడుకు స్కూలుకి లేటుగా వెడతాడేమోనని తెగ ఆందోళన పడుతోంది. సాయంకాలం సమయంలో కూడా ఆమె సరిగ్గా ఆ స్థలంలోనే విలబడి వుంటుంది. ఈ మాటు స్కూలుకి ఆలస్యం గురించి కాదు — స్కూలు నించి ఇంకా తిరిగి రాలేదేమా? అని ఆందోళన చెందుతూ వుంటుంది. అలాగే జూన్ నెలలో మండు ఎండలో మిట్ట మధ్యాహ్నమూ అక్కడే విలబడి వుంటుంది అదే సమయంలో ఆ దారినవెళ్ళే దానయ్యతో కబుర్లు చెపుతూ రాబోయే కొడుకు కోసం ఆత్రుతగా చూస్తూ వుంటుంది. అతడక్కడనే నిలబడి ఒక గడ్డిపరకని నోట్లో పెట్టుకు కొరుకుతూ ఆమెతో మాట్లాడుతూ వుంటాడు. అతడు నోరు తెరిచి చేపే వ్యాఖ్యానం ఇంచుమించు ముందరి కథలో లాంటిదే

